Mrityunjaya, by Abburi Chaya Devi
ISBN : 81-85284-10-5

**మృత్యుంజయ**

ప్రథమ ముద్రణ : జనవరి 1993

© **అబ్బూరి ఛాయాదేవి**

ప్రతులు : 1000

వెల : రు. 25/-

ప్రతులకు :

**ఉద్యమ పబ్లికేషన్స్**
1-7-632/9, రామ్‌నగర్,
హైదరాబాదు - 500 048.

**విశాలాంధ్ర బుక్ హౌస్,**
అన్ని బ్రాంచీలు.

**హైదరాబాద్ బుక్ ట్రస్ట్**
1-1-3428/బి, వివేక్‌నగర్,
హైదరాబాదు - 500 020.

**నవోదయ పబ్లిషర్స్**
విజయవాడ

ముద్రణ :

**ఓం సాయి లేజర్ గ్రాఫిక్స్,**
3-4-709, 2వ అంతస్తు,
నారాయణగూడా, హైదరాబాదు - 27

కవర్ డిజైన్ : చంద్ర

అంకితం

అక్క

శ్రీమతి కాళ్లకూరి ఇందిరాదేవికి

# సుకృతి

ఆ తండ్రి 'సంసారంలో సన్యాసి', విబుధులలో విన్నాణి.... "నీకు నేనంటే ఎవరో తెలియకపోవచ్చు. నీవు ఎవరివో నేనెరుగుదు" నంటున్నాడు 'తాను' - నేయంగా గుసగుసగా. నిశ్శబ్ద నిశ్చలాకంలా ఉన్న నా గుండె 'ఊ' కొడుతున్నది.

ఇంతకు మునుపు కలుసుకున్నానో, లేదో - కాకతాళీయంగా నా చేతుల్లో పడిన ఈ "ఉత్తరాలు" అపురూపమయిన ఈ సన్నివేశాన్ని కల్పించాయి. ఆ తండ్రీ కూతురూ వ్రాసుకొన్న ఉత్తరాలు ఎప్పటివో - అయితేనేం ? ఎన్ని నాగరికతలు మారినా, ఏ దిక్కు నుంచి ఎన్ని ప్రభంజనాలు వీచినా, విజ్ఞాన శాస్త్రంలో ఎన్ని మార్పులు వచ్చినా, వస్తున్నా తండ్రీ తనయల స్వభావం మారనిది. ఉత్తరాలు - తాపం, కోపం, ఈర్ష్య, స్వార్థం - పై పెచ్చు ప్రాణం లేనివి. వాటికి వాక్కును, సంచరణ శక్తిని సమకూర్చి పెట్టినది మనిషే కదా మరి. ఉత్తరాలంటే ఒకరికొకరి కలయిక. ఆపన్నిరసనదాయకాలైన ఉత్తరాలను చూస్తుంటేనే ఆత్మీయతానికష పట్టిక పయి ఒరసి చూడకుండానే ఒక మాధుర్య రేఖ మెఱసి పదహారు వన్నెల ప్రేమ స్వర్ణాభరణం మనోనిభృతం కావడం తథ్యం అన్నది అనుభవమయింది. వేగు చుక్క చిదురుపలు చిదురుపలయి అక్షరాల్లా వచ్చి నాచేతులలో వాలి, సంసార దుఃఖమనే సూర్యాతపంలో సంతప్త చిత్తుడైన నాలాంటి వాణ్ణి విమోచన పాద పచ్ఛాయకు - ఏ నింబవృక్షపు నీడకో తన్నుకొని పోయి 'ఖట్వాంగుడి' కథలో లాగా జ్ఞానం, ఆచరణలనే రెండు చేతులనిచ్చి కూర్చుండ బెడతాయన్నది విశదం చేశాయి.

'మృత్యంజయ', ఆయన కూతురూ ఒక క్రాంతి చక్రంలో విక్రమిస్తున్నారు-

ఒకరి వలయాన్ని ఇంకొకరు ఖండించకుండా, ఘర్షణ పడకుండా, ఎవరి పని వారు చేసుకొంటూ ఇంకొకరికి చేతనయినంత వరకూ చెయ్యి చాచకుండా ఒకరికొకరు సహాయపడుతూ, అన్నీ మనకే ఉండాలన్న స్వార్థపరత, దురహంకారం, దుర్జనత్వం లేకుండా, మనకంటే పైన ఉన్న వాళ్లు సుఖంగా ఉన్నారని భ్రాంతి పడుతూ కొందరు తక్కువగా ఉన్నారని నిర్లక్ష్యం చేస్తూ ఉపేక్షవహించకుండా మెళకువతో చూస్తూ, అందరూ సమానులన్న సత్యాన్ని - ఈ సత్యం ఒక్కటే సుందరమూ మంగళకరమైనదని మెలిగేటట్లు ప్రతి ఒక్కరూ తన ధర్మాన్ని నిర్వహిస్తూ, తన పీఠానికి అంటి పెట్టుకుని కూర్చుండక, ఎవరి బొమ్మను వారు చూచుకొనేటట్లు చేస్తూ, సంఘంతో సమన్వయించుకొంటూ పొందికగా, ఒద్దికగా, "నీ బాధ్యతలన్నీ నాపైన వెయ్యి, నేనుండగా నీకు భయమెందుకు" అనే దేవుడి నెత్తిన కూడా వెయ్యక - ఆయన అంతస్సును గ్రహించి 'మృత్యుంజయ' తన భారాన్నీ బాధ్యతలను తన నెత్తినే

వేసుకొనడం, కుటుంబంలో ప్రతి ఒక్కరినీ మన్ననతో చూడడం నాకెంతో నచ్చింది.

అసలు బ్రతకడానికే సూదిమోప జాగా యివ్వని ఈ నాటి సమాజంలో సంఘంతో సమరం కాకుండా సుమనస్కతతో బ్రతికే ఆత్మిక భావన 'నవ్య మనస్సు' ఇక్కడ ఉంది. అందరూ నవ్వు మొగంతో నిర్విచారంగా బ్రతికేమార్గం ఇక్కడ ఉంది

దేవుడే భయాన్ని - గడప గడప ముందున్న భయాన్ని - నిర్మూలించనిదే అడుగు ముందుకు పడదని గుర్తిస్తున్నప్పుడే జీవితం వడ్డించిన విస్తరిలా లేదు. ఆ లోపాన్ని పూరించుకొనవలసింది మనిషి - ఇది కథ చదివిన మీరంగీకరించే మాట.

'మృత్యుంజయ' తో నేను మాట్లాడుతున్నాను కదూ. ఆ గుసగుస మాటల్లో - తన 'నవ్య మనస్సు'ను నా చేతిలో పెట్టినప్పుడే ఈ కళ్లతో చూడని శత్రువులు పలాయనం చిత్తగించారు. కిసలయానికి ఇంక ఏ కిసమస లేదు. లఘు గురువులు ఒక్కటయినట్టు ఉంది. నిర్మలంగా ఉంది అంతఃకరణము. శుద్ధాంతఃకరణలకు పొందరానిదేమీ లేదు.

తన కైవారంలో పరిపూర్ణమైన బ్రతుకు బ్రతికిన 'మృత్యుంజయ' నీటిలో పడికరిగిపోయి కనిపించినట్టు ఆనంద సాగరమగ్నుడయిన జీవుడు. జితేంద్రియుడు

- ఇది యీ పెద్ద కథలో నా కర్థమయింది. గాంధీ మహాత్ముని చూచిన రోజు, గగారిన్‌ను చూచిన రోజు నేను ఇట్లాగే అనుకొన్నాను. కలియుగార్జునుడు అప్పారాయడు బాణాలతో బొమ్మలు గియ్యడం చూచిన రోజు అట్లాగే అనుకొన్నాను. లార్డ్ బెర్ట్రాండ్ రస్సెల్ స్ఫురణకు వచ్చినప్పుడల్లా ఇట్లాగే - ఒక్కడు ఎన్ని కష్టాలు పడి ఒక సమగ్రావగాహనతో దేశాలు - దేశాలు యుద్ధ పథం నుండి తప్పుకొనక తప్పని పరిస్థితిని సృష్టించడం, ఒక నూతన అవగాహనకు మానవాళిని సన్నద్ధం చెయ్యడం - ఒక అద్భుతాన్ని చూచాను.

ఏ చిన్న దీపం - మిణుగురు పురుగు అవగాహన అయినా సామాన్య మానవుడికి అసామాన్యమైనదే. ఆలోచన చెయ్యడమే. ఇట్లా ఆలోచింప జేస్తూ ప్రభావితం చేస్తున్న మహితాత్ముల కథ వినడమే ఒక సుకృతి.

**- ఏల్చూరి సుబ్రహ్మణ్యం**

రాజమండ్రిలో మకాం ఎత్తేసి నాన్నగారు హైదరాబాదు వచ్చేశారన్న వార్త నాలో ఆనందం కలిగించడం బదులు ఆందోళన కలిగించింది. నాన్నగారి ఆధ్యాత్మిక భావాల గురించి నాకు తెలిసి ఉన్నప్పటికీ, ఆయన అహంభావం సంగతీ, అహంకారం సంగతీ కూడా బాగా తెలుసు. నాన్నగారు ఒక్కక్షణం తీరిగ్గా కూర్చునే రకం కాదు. వృత్తిపరంగానే కాక, రకరకాల వ్యాపకాలతో తీరిక లేనట్లుగా కనిపించేవారు.

లాయరు వృత్తికి వయో పరిమితి లేదు. తనంతట తానే విధించుకున్నారు. హైదరాబాదు వచ్చాక నాకు ఉత్తరం రాశారు ఇలా -

"... నేను క్రిందటి నెలాఖరులో మళ్ళీ రాజమండ్రి వెళ్ళి ఈ మధ్యనే తిరిగి వచ్చాను. నేను చేపట్టిన ఆఖరి కేసు రాజమండ్రి సబ్‌కోర్టులో అప్పీలు పూర్తి చేసుకుని వచ్చాను. ఇక ఏ కోర్టుతోనూ నాకు పని లేదు. నల్లకోటు, తలపాగా ధరించనక్కర్లేదు. లాయరుగా నా జీవితం సమాప్తమయిందని నిశ్చయంగా చెప్పవచ్చు. ఈ భౌతిక జీవితం ఎప్పుడు సమాప్తమవుతుందో తెలియదు.

అవును. నేను నా ఆఖరి కేసు పూర్తి చేసేశాను. ఇంకే కేసూ లేదు. సన్యాసి కావడానికి అడవులకు పోయి ఉండనక్కర్లేదు. మానసికంగా నిజమైన సన్యాసిగా ఉండవచ్చును. ఏ విధమైన గొడవలూ లేకుండా మనస్సుని ప్రశాంతంగా ఉంచుకుని, అన్ని కోరికలనూ భయాలనూ త్యజిస్తే అదే నిజమైన సన్యాసం.

మీరు ఢిల్లీ వెళ్ళి అప్పుడే రెండేళ్ళు దాటింది... అవసరమైనవీ, కుతూహలకరమైనవీ, అన్ని విశేషాలతో పెద్ద ఉత్తరం రాస్తే నీకు కృతజ్ఞతలు తెలుపుకుంటాను..."

నాన్నగారు తన వృత్తిని విరమించుకోవడం విశ్రాంతి కోసం కాదనీ, అశాంతి లేకుండా చేసుకోవడానికనీ అర్థం చేసుకున్నాను. కానీ న్యాయవాద వృత్తి, దేశ స్వాతంత్ర్య సాధనలో పరోక్ష పాత్ర, హిందూ సమాజ వ్యవహారాలు, సమష్టి కుటుంబ వ్యవహారాలు, చావులు, పుట్టుకలు, చదువులు, పెళ్ళిళ్ళు, పురుళ్ళు, దివ్యజ్ఞాన సమాజ కార్యకలాపాలు, షిర్డీ, అరుణాచలాలకు ప్రయాణాలు, కృష్ణమూర్తి ప్రసంగాలు, వ్యాసాల అధ్యయనం, ఇంకా ఎన్నో వ్యాపకాలతో షష్ఠిపూర్తి చేసుకున్న నాన్నగారిలాంటి మనిషికి ముందు జీవితం ఎలా కొనసాగుతుందో నా ఊహకందలేదు. ఆయనకు పనిలేక పిచ్చెక్కిపోతుందేమోనని భయపడ్డాను. ఢిల్లీకి వచ్చి కొన్నాళ్ళు మా దగ్గర కాలక్షేపం చెయ్యమని ఒకటి రెండుసార్లు రాశాను. ఆయన ఒప్పుకోలేదు.

"... నన్ను ఢిల్లీకి రమ్మని నువ్వు పదే పదే కోరడం భావ్యం కాదు. కోరడంలో అర్థం లేదు. నేను ఢిల్లీ రాగలనని ఎలా అనుకుంటావు? నువ్వు ఈ ప్రాంతాలకు వచ్చేవరకూ నేను వేచి ఉండగలను... ఢిల్లీ వాతావరణం అంటే నాకు భయం... ఢిల్లీలోగాని, ఆగ్రాలోగాని, కాశ్మీర్‌లోగాని, బద్రీనాథ్‌లోగాని – ఈ ప్రపంచంలో దేన్నీ చూడాలనే కుతూహలం (మీ అమ్మగారికి మల్లే) నాకు లేదు. నన్ను, నా మనస్సునీ, నా చుట్టూ ఉన్న విశ్వాన్నీ అవగాహన చేసుకోవాలని మాత్రం ఎంతో కుతూహలపడుతున్నాను. నేను ఎక్కడ ఉన్నానో అక్కడే ఉంటాను – ఏదైనా పని మీద ఎక్కడికైనా వెళ్లవలసి వస్తేతప్ప...." అని రాశారు జవాబుగా.

అటువంటి తాత్త్విక మనస్తత్వం ఉన్న మనిషి కొన్నాళ్ల తరవాత రాసిన విశేషం నన్ను సంభ్రమాశ్చర్యాల్లో ముంచింది.

"... ఈ మధ్య ఎర్ల్ స్టాన్లీ గార్డ్‌నర్ నవలలు కొన్ని నేను చదవడం సంభవించింది. గార్డ్‌నర్ న్యాయానికీ, చట్టానికీ సంబంధించిన సృజనాత్మక సాహిత్యంలో మేటి రచయిత. నేను సాధారణంగా నవలలు చదవను. ఉద్రేకం కలిగించేవంటే నాకసహ్యం. కానీ, గార్డ్‌నర్ నవలలు నన్ను చాలా ఆకర్షించాయి. గత నెలపొడుగునా నేను అతని పుస్తకాలు వరుసగా చదువుతూనే ఉన్నాను. ఇరవయ్యో, ఇరవై అయిదో పుస్తకాలు చదివి ఉంటాను. వాటిలో చాలా చెప్పుకోదగిన అభిప్రాయాలూ, జీవన్మరణాల గురించి చక్కని తత్త్వం, అచ్చు జిడ్డు కృష్ణమూర్తిగారి అభిప్రాయాల వంటివే వ్యక్తం చేశాడు. జీవితం గురించి

అతను చేసిన విశ్లేషణ, అమెరికన్ల జీవన విధానం గురించి వ్యక్తం చేసిన అభిప్రాయాలూ నాకు చాలా నచ్చాయి. నేను పడిన ఈ ప్రయాస వల్ల మంచే జరిగింది..."

కాలక్షేపానికైనా వేదాంత గ్రంథాలనే చదివే నాన్నగారు డిటెక్టివ్ పుస్తకాలు చదివారని తెలుసుకుని నేను తబ్బిబ్బై "నాకు కూడా 'పెర్రీమేసన్' అంటే చాలా ఇష్టం" అని రాసినట్టున్నాను! తక్షణం జవాబు రాశారు "నన్ను అపార్థం చేసుకోవద్ద"న్నట్లుగా–

"... 'పెర్రీమేసన్' ఎంతైనా ఒక న్యాయవాది – కొంత తలతిక్కవాడైనా. నేను మాత్రం అమెరికాలో న్యాయ విచారణ ఎలా జరుగుతుందో, నేరాలను ఎలా పరిశోధిస్తారో, న్యాయశాస్త్రాన్ని ఎలా అన్వయిస్తారో, న్యాయమూర్తుల ప్రవర్తన ఎలా ఉంటుందో తెలుసుకోవాలనుకున్నాను. ఇండియాలో (ఇంగ్లండులోనైనా సరే) అటువంటి ఆకర్షణీయమైన, ఆసక్తికరమైన వ్యక్తిగత నేర పరిశోధకులనుగాని, న్యాయవాదులు నేర పరిశోధనలో వ్యక్తిగతంగా ఆసక్తి తీసుకోవటాన్నిగాని ఒప్పుకోరు. హర్షించరు కూడా. నేరాల సంగతీ, ఉద్వేగాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించడం సంగతీ ఎలా ఉన్నా, మరొక విషయం కూడా ఉంది. ఆ విపరీతమైన జీవన వేగం – అదంతా నాకస్సలు నచ్చలేదు. నాకు నచ్చిందొక్కటే – గార్డ్‌నర్ ఒక అద్భుతమైన జీవిత తత్వాన్ని ప్రతిపాదిస్తాడు. జీవితం పట్ల ఒక విశిష్టమైన భావన, స్త్రీ పురుషుల గురించీ, జీవన వ్యవహారాల గురించీ అతని అభిప్రాయాలు – కానీ సాధారణ పాఠకుడు అవన్నీ గ్రహించడు. అతని జీవిత తత్వాన్ని పెర్రీమేసన్ ద్వారా అప్పుడప్పుడు వ్యక్తపరుస్తూ ఉంటాడు. అదంతా రాయడానికిక్కడ కుదరదు – కానీ అసాధారణమైనదీ, ఔన్నత్యాన్ని పెంపొందించేదీ, ఎంతో విజ్ఞానదాయకమైనదీను. ఏమైనా, గార్డ్‌నర్ పుస్తకాలతో మంచి కాలక్షేపం..." అని రాశారు.

నాన్నగారిదీ, అన్నయ్యదీ, ఇద్దరిదీ పుట్టిన రోజు ఒక్కటే! ఒకే తిథి – ఆషాఢ బహుళ నవమి. ఇద్దరూ ఒకేచోట ఉన్నారు కదా అని ఇద్దరికీ కలిపి "బెర్ట్రాండ్ రస్సెల్ స్పీక్స్ హిజ్ మైండ్" అనే పుస్తకాన్ని పుట్టిన రోజు బహుమతిగా పోస్ట్‌లో పంపించి, ఆయనకి వేరే ఉత్తరం కూడా రాశాను శుభాకాంక్షల్ని తెలుపుతూ. అంతక్రితం నేనొకసారి హైదరాబాదు వెళ్లినప్పుడు

నాన్నగారు రేడియో దగ్గర కూర్చుని క్రికెట్ కామెంటరీ శ్రద్ధగా వినడం చూశాను. అది గుర్తుకొచ్చి "సెంచరీ నాటవుట్" అని విష్ చేశాను.

"నువ్వు చూపిస్తున్న ప్రేమకి సంతోషిస్తున్నాను. సెంచరీ చెయ్యాలని నువ్వు కోరడం మాత్రం నాకు నచ్చలేదు. నచ్చకపోవడమే కాదు. నాకు భయం కూడా. అయినా, సెంచరీ అందరికీ కాదమ్మా – మోక్షగుండం, కార్వే వంటి కొద్దిమందికి మాత్రమే తగినది" అంటూ రాశారు.

అంతలో అన్నయ్య ఏదో పనిమీద ఢిల్లీ వచ్చాడు. మా ఇంటికి కూడా వచ్చి కాస్సేపు మాతో గడిపి వెళ్లాడు. అన్నయ్య ద్వారా మా విషయాలు తెలుసుకుని నాన్నగారు ఉత్తరం రాశారు.

"... మీ ఆయన మరో ఉద్యోగంలో చేరాడని విని నేను కొంచెం ఆశ్చర్యపోయాను – మీ అన్నయ్య ఆశ్చర్యపోకపోయినా. ఇంతకు ముందు చేసిన గవర్నమెంటు ఉద్యోగం లాంటిదానికి రాజీనామా ఇచ్చాడనుకుంటాను. ఇప్పుడు మంచి జీతం వస్తోందని అన్నాడుట! ఇంతకు ముందు వచ్చిన జీతం మంచి జీతం కాదన్నమాటే కదా. ఢిల్లీలో మంచి జీతం అంటే ఏమిటో మీ అన్నయ్య ఏదో చెప్పాడు. ఇంతకీ నీ ఉద్దేశంలో ఏమిటి? ఏమైనా, ఏ తండ్రి అయినా కోరుకునేదేమిటంటే – తన పిల్లలు – కూతురు, అల్లుడూ జీవితాన్ని ఆనందంగా గడపాలని. అంచేత మీ ఇద్దరూ ఆనందంగా ఉన్నట్లయితే నాకదే తృప్తి. కానీ, వృద్ధుణ్ణి, సహజంగా, సాంప్రదాయకంగా ఉండేవాణ్ణి కాబట్టి భద్రత, సౌఖ్యం ఉండాలనిపిస్తుంది. సాహసకృత్యాలకు తలపడేవాళ్లు, యువకులు, ఔత్సాహికులూ భద్రత ఉందా లేదా అని పట్టించుకోరు.

ఒకసారి పండిట్ నెహ్రూ ఏమన్నారంటే తనకి భద్రత కోసం పాకులాడే వాళ్లంటే అసహ్యం అని. ఐ.సి.ఎస్. వాళ్లూ, ప్రభుత్వోద్యోగులూ జీవితంలో కష్టాలకు తెగించడానికీ, ఒడిదుడుకుల నెదుర్కోవడానికీ ఇష్టపడరు. అంచేత మీ ఆయన నెహ్రూలాంటి రకం అన్నమాట! ఎటువంటి కష్టనష్టాలకైనా తెగించటం అతనికిష్టం. మంచిదే. భగవంతుడు అతన్ని ఆశీర్వదించుగాక! నా ఆశీస్సులు మీకు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి" అని రాశారు.

ఆ తరవాత చాలా రోజులపాటు ఉత్తరాలు రాలేదు. నేను కంగారు పడ్డాను. అన్నయ్యకి ఉత్తరాలు రాయడం బద్ధకం. అమ్మ కూడా ఎందుకో

రాయలెదు చాలాకాలంగా. నాన్నగారికి ఆరోగ్యం బాగాలేదేమో అని అనుమానం వేసి, కంగారుపడుతూ అమ్మకి ఉత్తరం రాశాను. నాన్నగారికి చెప్పినట్టుంది. అప్పుడు రాశారు ఇలా :

"... నేనిప్పుడు అరవై ఏడు సంవత్సరాలు నిండిన యువకుణ్ణి! నువ్వు పంపిన పుట్టిన రోజు బహుమతి అద్భుతమైనది.

మహాత్ముల సాన్నిధ్యంలో ఉండటం వల్ల ఔన్నత్యం, జ్ఞానోదయం కలుగుతుంది. నెపోలియన్ గురించి ప్రస్తావిస్తూ ప్రష్యన్ సామ్రాజ్యాధిపతి ఫ్రెడరిక్ ది గ్రేట్ అన్నాడుట - మహాత్ములతో స్నేహం దేవుని వరప్రసాదం అని. గత కొద్ది రోజులుగా నేను లార్డ్ బెర్ట్రాండ్ రస్సెల్ సాన్నిధ్యంలో ఉన్నాను. ఆయన సాన్నిధ్యాన్ని నేనెంతో ఆనందించాను. పది రోజుల క్రితం రాత్రి 8 గంటలకి అనువాదం ప్రారంభించి, ఈ రోజు మధ్యాహ్నం 3 గంటలకి పూర్తి చేశాను. ఈ అనువాదాన్ని సరిదిద్ది మెరుగుపెట్టవలసి ఉందనుకో. చదవడానికి బాగానే ఉండొచ్చునని ఆశిస్తున్నాను. దాన్ని ఏ విధంగా ఉపయోగించవచ్చునో తెలియదు. అంతమంచి గ్రంథాన్ని ఎంపిక చేయగల మీ ఇద్దరి అభిరుచికీ అభినందిస్తున్నాను. ఆ ఎంపిక చాలా సందర్భోచితంగా ఉంది. కానీ, చాలా ఖరీదైన గ్రంథం.

బెర్ట్రాండ్ రస్సెల్‌కీ, జిడ్డు కృష్ణమూర్తిగారికీ చాలా సామ్యం కనిపించింది. ఇద్దరూ ప్రపంచ విఖ్యాత మేధావులు, తత్త్వవేత్తలు, బోధకులు. అయితే, లార్డ్ రస్సెల్ బోధకుడవునో కాదో చెప్పలేకపోవచ్చుగాని, ఆయన నిశ్చయంగా మహా మేధావి, తత్త్వవేత్త. ఆయన అభిప్రాయాలు విప్లవాత్మకమైనవే కాదు. ఎంతో వినూత్నమైనవి. ఆయన సాన్నిధ్యం నాకెంతో ఆనందాన్నిచ్చింది.

చిత్తు ప్రతిని తిరిగి రాసిన తరువాత నీకు ఒక కాపీ పంపిస్తాను. దాన్ని నువ్వు ఎలా ఉపయోగించుకున్నా సరే. ఇంగ్లండులో సర్వ హక్కులతో ప్రచురించబడిన పుస్తకాన్ని ఇలా అనువదించడం విపరీతంగానూ, తెలివి తక్కువగానూ కూడా అనిపించవచ్చు. కానీ, అనాలోచితంగా ఆరంభించాను. పది రోజుల్లో పూర్తి చేశాను. నా అరవై ఎనిమిదవ సంవత్సరం పూర్తి కాబోయే తరుణంలో అనువాదం కూడా పూర్తి కావచ్చింది. ఇలా ఎన్నాళ్ళు కొనసాగాలి? ఎవరెరుగుదురు? ఎందుకోసం? ఎవరికోసం? అలా కొనసాగవలసిందే.

కొనసాగనివ్వాల్సిందే. అంతకన్న నేనేం చెయ్యగలను? ఎందువల్లనో, నా పని పూర్తి అయిపోయింది, ఇక నేను నిష్క్రమించవలసిన సమయం ఆసన్నమైంది అనిపిస్తోంది. దేనికీ విచారం లేదు. ఎందుకు విచారం? ఇంకా ఏదో సాధించాలనుకునేవాళ్లు విచారిస్తారు. ఇంకా ఏదో పొందాలనే వాంఛ లేదు. ఉన్న పరిస్థితి ఏమిటో నాకు తెలుసు. నా గురించి నాకు నిజం తెలుసు. విచారం లేదు. సంతోషం లేదు. గాలి ఆగిపోయింది. మనస్సు నిశ్చలంగా ఉంది. మరణంలోని నిశ్చలత కాదు. ప్రశాంతమైన అవగాహనలోని నిశ్చలత..."

ఈ ఆఖరి వాక్యాలు కృష్ణమూర్తిగారి "కామెంటరీస్ ఆన్ లివింగ్" ప్రభావం అని నాకు ఆ పుస్తకాలు చదివాక తెలిసింది. ఈ ఉత్తరం ఆఖరున, అలవాటుగా ఆయన పేరు రాయకుండా ఊరికే చుక్కలు పెట్టారు. తరువాత గుర్తుకొచ్చినట్లుంది. కొంచెం మూలన ఎడంపక్కని రాశారు.

"అన్నట్లు, పుస్తకానికి ఏంపేరు పెట్టమంటావు? సమాధానం రాస్తావా" అని. నవ్వొచ్చింది నాకు. ఆశ్చర్యమూ వేసింది చుక్కలెందుకు పెట్టారా అని. ఆ విషయమై ఆయనికి ఉత్తరం రాద్దామనుకుంటూనే నా పనుల హడావిడిలో అశ్రద్ధ చేశాను. ఈలోగా నాన్నగారే మళ్లీ రాశారు.

"... నేను నిత్యం ఏదో ఒకటి చదువుతూనే ఉన్నాను. తీరిక లేకుండా ఏదో ఒకటి చేస్తూనే ఉన్నాను. రాధాకృష్ణన్ ఉపనిషత్తుల మీద రాసిన గ్రంథం, సిగ్మండ్ ఫ్రాయిడ్ రాసిన సైకోయనాలిసిస్ మొదలైన ఎన్నో పుస్తకాలు చదివాను. 'దీపిక' కోసం నెల నెలా ఏదో రాస్తూ ఉంటాను. నీ గురించి ఏమైనా తెలియజేస్తే సంతోషిస్తాను ..."

మళ్లీ చుక్కలు పెట్టారు సంతకం స్థలంలో. ఈసారి ఉత్తరంలో అడిగేశాను సంతకం పెట్టడం లేదేమని. దానికి జవాబు ఇలా ఇచ్చారు :

"ఇక నుంచీ నా చిరునామాలో నా అసలు పేరు స్థానంలో 'మృత్యుంజయ' అని రాస్తూ వుండు. ఇది నేను పెట్టుకున్న పేరు. ఎప్పుడో అప్పుడు గతమంతా నశించాలి. ఒక కొత్త అధ్యాయం ప్రారంభమైంది.... నాయీ కోరిక అనుకో, లేదా మానసిక బలహీనత అనుకో. దాన్ని మన్నించు. చెప్పినట్లుగా చెయ్యి. చిరునామాలో ఇంటినంబరు వెయ్యాలి సుమా.."

ఈసారి 'మృత్యుంజయ' అని కింద సంతకం పెట్టారు. నాన్నగారు చెప్పినట్లుగానే చేశాను.

* * *

మా చెల్లెలు మళ్లీ పురిటికి వెళ్లింది హైదరాబాదుకి. అమ్మ ఉత్తరం రాసింది - "నువ్వూ, మీ చెల్లెలూ కలుసుకుని చాలా ఏళ్లయింది. నువ్వే నెల్లాళ్లు సెలవు పెట్టుకుని ఇక్కడికి వస్తే ఇద్దరూ కలిసి కొన్నాళ్లుండటానికి వీలవుతుంది" అని. ఆఫీసులో 'ఆడిట్' జరుగుతోందనీ, నాకు రావడానికి కుదరదనీ రాశాను. అదీకాక, నెల్లాళ్లపాటు ఈయన్ని వండుకు తినమనో, హోటల్లో తినమనో చెప్పి నేను పుట్టింటికి వెళ్లి కూర్చోవడం నా కిష్టం లేదు. నాన్నగారికీ అటువంటివి నచ్చవు. అందుకే నేను పుట్టింట్లో ఒకటి రెండు రోజులు కూడా ఎప్పుడూ ఉండలేదు. అత్తవారు కూడా ఆ ఊళ్లోనే కాబట్టి మేమిద్దరం వెళ్లినప్పుడు అక్కడే ఉండేవాళ్లం. నేను అమ్మనీ నాన్నగారినీ చూడటానికి వెళ్లి కాస్సేపు కూర్చుని వచ్చేసేదాన్ని. మా అక్క, చెల్లెలూ అలా కాదు. పురుళ్లకనీ పుణ్యాలకనీ ఏడాదికోసారి పుట్టింటికి వెళ్లి నెలో, రెండు నెలలో అవసరాన్ని బట్టి ఉండటం వాళ్లకి అలవాటు. వాళ్లు నాలా ఉద్యోగంలో చేరలేదు.

మా చెల్లెలు ప్రసవించగానే నాన్నగారు ఉత్తరం రాశారు.

" ఈ రోజు ఉదయం తొమ్మిది గంటలకి ఆపరేషను చేశారు. మొదటిసారి ఆపరేషను కాబట్టి ఈ సారి కూడా తప్పదు కదా. మళ్లీ ఆడపిల్లే. తల్లితండ్రులు కొడుకు పుడతాడని ఆశించారు. అంచేత కొంచెం నిరాశ చెందారు. ఏమైనా ఏది ప్రాప్తమో అది స్వీకరించక తప్పదు. మరోసారి గర్భం వస్తే తట్టుకోలేదని ఆపరేషను చేసేశారు పిల్లలు పుట్టకుండా."

మా చెల్లెలికి అభినందనలు తెలపమనీ, ఆడపిల్ల అని నిస్పృహ చెందవద్దని చెప్పమనీ, ఈ రోజుల్లో ఆడపిల్లలు మొగపిల్లలకేం తీసిపోవడం లేదనీ రాశాను నాన్నగారికి. ఆయనకి మగపిల్లలంటే ప్రీతి అని తెలిసే రాశాను. జవాబుగా, "నీకు ఆడపిల్లలంటే ప్రేమ అనీ, మొగపిల్లలంటే అసహ్యమనీ నాకు తెలుసు! నీకు ఒక్క మొగ పిల్లాడు లేకుండా ఏడుగురు ఆడపిల్లలు పుడితే మీ అత్తమామలూ, మీ ఆయనా ఎంత సంతోషిస్తారో! అవును, నాకు తెలుసు- ఇప్పుడు మగవాళ్లు శాపగ్రస్థులు! పురుషుడు ఇప్పుడు అధమ

స్థానంలో ఉన్నాడు. స్త్రీ ఇప్పుడు చక్రం యొక్క శిఖరం మీద ఉంది. పురుషుడు గతంలో చేసిన పాపాలన్నిటికీ పరిహారం చెల్లించాలి. నీకు తెలుసో లేదో ప్రస్తుతం నేను ఆడదానిలాగే బ్రతుకుతున్నాను - మగవాడిలా కాదు! ఘనకీర్తి అంతా స్త్రీకి, పురుషునికి పతనం. నీకు ఆడపిల్లలు కలుగుగాక!..'' అని రాశారు ఉద్రేకంగా! అంతా అయాక అడుగున, మూలగా మరో వాక్యం కూడా రాశారు. ''క్రిందటి సారి డాక్టరు బిల్లు 550 రూపాయలు. ఈ సారి 750 /- మాత్రమే!'' (ఇది చాలా ఏళ్ల క్రిందటి మాట).

నేను హైదరాబాదులో ఎం.ఎ. చదువుకుంటున్నప్పుడు రాజమండ్రి నుంచి నాన్నగారు రాసిన ఉత్తరం గుర్తుకొచ్చింది. దాన్ని గాడ్రెజ్ బీరువాలో లాకర్‌లో ఉన్న ఫైలులోంచి తీసి మళ్లీ చదివాను.

''నీ ఉత్తరం అందింది. మీ అక్కకి పుట్టిన బిడ్డ గురించి నీకు వేళాకోళంగా రాసిన దానికి నేను అనుకున్నట్లుగానే నువ్వు స్పందించావు! మీ అమ్మగారు చెప్పినదాన్ని బట్టి - డాక్టరుగారు ''ఆడపిల్ల'' అని చెప్పగానే మీ అక్క ''ఇంతా కష్టపడితే ఆడపిల్లేనా!'' అందిట. దానికి డాక్టరు గారు నవ్వి, ''ఈ నెలలో యాభై పురుళ్లు పైగా పోశాను. ఇద్దరు తప్ప అంతా ఆడపిల్లలేను!'' అన్నారుట. అక్కడున్న ఆడవాళ్లందరూ కూడా ''వీళ్లందరికీ పెళ్లిళ్లు ఎలా అవుతాయో బాబూ!'' అని బాధగా నవ్వారుట.

నీకు బహుశా తెలిసే ఉంటుంది - ఈ ప్రపంచంలో మగవాళ్లకన్నా ఆడవాళ్లే ఎక్కువగా ఉన్నారు. మన దేశంలో ఆడవాళ్ల సంఖ్య మరింత ఎక్కువ. ఈ విషయమైనేను కొంత కాలంగా గంభీరంగా ఆలోచిస్తున్నాను. ఆడవాళ్ల సంఖ్య ఇంతగా మితిమీరిపోవడానికి కారణం ఏమిటి? ఇంతమంది ఆడపిల్లల్ని ఇచ్చి శిక్షించేటంతటి నిర్దయుడా భగవంతుడు? లేక, మరేదైనా నిగూఢమైన కారణం ఏదైనా ఉండి ఉంటుందా? తప్పక ఉండి ఉంటుందని తోచింది. ఆ కారణాలను కనుక్కోగలిగాను. దివ్యజ్ఞాన దీపికకూ, మరో ఆంగ్ల పత్రికకూ కూడా వ్యాసాలు పంపించబోతున్నాను.

ప్రప్రథమంగా నువ్వొక విషయం గుర్తుంచుకోవాలి. అహం, ఆత్మ, లేక జీవాత్మ ఏదో ఒక శరీరంలో ప్రవేశించి జన్మ పొందుతుంది. అంచేత, మన ప్రశ్న ఏమిటంటే, అన్ని ఆత్మలు ఎందువల్ల స్త్రీ శరీరాలనే ఎంచుకుంటున్నాయన్నది

– ముఖ్యంగా మన దేశంలో, అందులోనూ దుర్భరమైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులున్న భారతదేశంలోనే ఎందుకు? అది ఒక విచిత్ర సంఘటన కాదు. కర్మ ప్రభువులు అంత వివేకహీనులు కారు. ఒక ప్రత్యేక ప్రయోజనం కోసమే ఈ ఆత్మల్ని స్త్రీ శరీరాల్లో ప్రవేశింపచేయడం జరుగుతోంది. ఏమిటా ప్రయోజనం? నేను చెప్పే కారణాలను శాస్త్రజ్ఞులూ, విదేశాల నుంచి తిరిగి వచ్చిన మేధావులూ అంగీకరించక పోవచ్చును. కాని, వాటిలో నిజం ఉంది.

(1) నీకు తెలుసుకదా, లక్షలకొద్దీ సైనికులు ఎన్నో ఆశలూ, ఆశయాలూ పెట్టుకున్న యువకులు తమ ప్రియురాళ్ల కోసం, కాబోయే భార్యల కోసం, భార్యల కోసం ప్రేమ నిండిన హృదయాలతో యూరోప్ ఖండమంతటా యుద్ధరంగాల్లో పోరాడి రక్తాన్నీ, ప్రాణాల్నీ ధారపోశారు – మొదటి ప్రపంచ యుద్ధంలోనూ, రెండవ ప్రపంచ యుద్ధంలోనూ....

డాక్టర్ ఇ. లెస్టర్ స్మిత్ అనే ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడూ, అతీంద్రియ వైజ్ఞానికుడూ, పండితుడూ ఇలా అన్నాడు – యుక్తవయస్సులో ఉన్నవారూ, భౌతిక జీవనం మీదే తమ ధ్యాసంతా నిలుపుకున్నవారూ హఠాత్తుగా మృత్యువాత పడితే, అటువంటివారు తక్షణ పునర్జన్మ కోసం తహతహలాడవచ్చు. ఈ మధ్య, యుద్ధంలో ప్రాణాలు కోల్పోయినట్టివారు అసంఖ్యాకంగా ఉన్నారు. ఇటువంటి వారు సత్వరం స్త్రీ దేహాల్లో పునర్జన్మించడం జరుగుతుందంటారు".

అతీంద్రియ దృష్టితో పరిశీలనలు జరిపిన మీదటే ఈ విధంగా చెప్పడం జరిగింది. వారి ఆత్మలు మళ్లీ యురోపియన్ దేశాల్లో జన్మ పొందటానికి భయపడతాయి. మరో యుద్ధం వస్తుందని వాటికి భయం. ఆ భయం నిజమే అనిపిస్తున్నది కదా ప్రపంచ పరిస్థితిని చూస్తూంటే. ఈ ఆత్మలు ప్రశాంతమైన సాంసారిక జీవనాన్నీ, కుటుంబ జీవితాన్నీ, ఇంటిపట్టున లభించే తీయని సుఖాల్నీ కోరుకుంటున్నాయి. మళ్లీ యుద్ధంలో బలవంతాన చేరవలసిన అగత్యం లేకుండా స్త్రీ శరీరాలను కోరుకుంటున్నాయి!

2) పాశ్చాత్య దేశాల్లో కొందరు మహనీయులు (శాస్త్రజ్ఞులు!) "కుటుంబ నియంత్రణ" అనే మరో మత సిద్ధాంతాన్ని ప్రబోధిస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ అక్కడ పునర్జన్మ పొందాలనుకునే ఆత్మలకు దేహాలను తయారు చేసేందుకు సిద్ధంగా లేరు. అంచేత పాపం, ఆ ఆత్మలు చేస్తాయి? వాటికి యూరోప్‌లోని

పరిస్థితులూ, నాగరికతా ఇష్టమైనప్పటికీ భారతదేశంలో జన్మించవలసి వస్తోంది. ఎందువల్లనంటే (1) భారత దేశం క్షేమకరం - యుద్ధం వచ్చే అవకాశం తక్కువ. (2) కుటుంబ నియంత్రణ తక్కువ - పురుషులూ, స్త్రీలూ పునర్జన్మ కోరే ఆత్మలకు దేహాలనిచ్చి కుటుంబ జీవనాన్ని సాగించేందుకు సిద్ధంగా ఉన్నారు. (3) ప్రశాంతమైన, సుఖప్రదమైన గృహ జీవితాన్ని గడపటానికి పురుషులకన్న స్త్రీలకు ఇక్కడ అవకాశాలు ఎక్కువ.

పై కారణాలవల్ల అనేక ఆత్మలు - యూరోప్ దేశానికి చెందినవి (గత జన్మలో సైనికులు) ఇప్పుడు స్త్రీ శరీరాల్లో పునర్జన్మ పొందుతున్నాయి. అయితే, ఈ ఆత్మలు ఇంతకుముందు యూరోప్‌లో జన్మించడం వలన, వారి గత జన్మలోని అభిరుచులూ, లక్షణాలూ కొనసాగుతున్నాయి. తత్ఫలితంగా (1) బాగా చదువుకోవాలనే ఆసక్తి, (2) మగవారిలా ఆటలాడాలనే ఆసక్తి, (3) విదేశాలు పర్యటించాలనే ఇచ్ఛ, (4) అన్ని రకాల ఉద్యోగాలనూ అభిలషించడం, (5) అన్ని మానవ కార్యకలాపాల్లోనూ పురుషులతో సమాన ప్రతిపత్తి కావాలనుకోవడం జరుగుతోంది.

ఇది అంత విచిత్రం, అసంబద్ధం కాదనుకుంటాను. స్త్రీల సంఖ్య అధికమవడానికి మరో ముఖ్య కారణం కూడా ఉంది. స్త్రీలు సాధించవలసిన ఒక ముఖ్య కార్యం ఉంది. పరమ నిష్ణాతుడు, గురువు "కూథూమీ" (ఆయన చిత్రపటాన్ని దివ్యజ్ఞాన మందిరంలో చూసే అదృష్టం నీకు కలిగింది కదా) ఇలా అన్నారు : స్త్రీ యొక్క కర్తవ్యం భావి అతీంద్రియ జ్ఞానులకు ఏ పాపమూ అంటనివారికి (అనఘులకు) తల్లి కావడమే. స్త్రీని ఉన్నత స్థితిలో ఉంచగలిగినప్పుడే ప్రపంచానికి ముక్తి, మోక్షం లభిస్తుంది. స్త్రీ శారీరక బానిసత్వపు శృంఖలాల్ని తెంచుకుని బయటపడ గలిగినప్పుడే ఆమె నిజ స్వరూపం ఏమిటో, ప్రకృతిలో ఆమెకు తగిన స్థానం ఏమిటో ప్రపంచానికి అవగతమవుతుంది" - అద్భుతమైన పలుకులు!!! భారత దేశానికి కావలిసినది అటువంటి స్త్రీలే. భారతదేశం, యావత్ప్రపంచమూ అటువంటి రక్షకుల వల్లనే పరిరక్షింపబడాలి. పురుషులు కొందరు యూరోప్‌నీ, పాశ్చాత్య నాగరికతనీ రక్షించారు. స్త్రీలు భారత దేశాన్నీ, భారతీయ సంస్కృతినీ, ప్రపంచ నాగరికతనీ పరిరక్షించాలి.

అందువల్లనే ఈనాటి స్త్రీలకు అంత ఆత్మశక్తి ఉన్నది. వాళ్లు పూర్వజన్మలో సైనికులుగా బ్రతికి తమ జీవితాలను ఒక ఆదర్శం కోసం, తమ దేశం కోసం త్యాగం చేశారు.

నీ శరీరంలో ఏ ఆత్మరూపు దిద్దుకుంటోందో ఎవరు చెప్పగలరు? పరమ గురువు "కుథూమీ" నిర్దేశించిన కార్యాన్ని నువ్వు సాధించగలవా? భావి అతీంద్రియ జ్ఞానులకు నువ్వు జన్మనివ్వ గలవా? శారీరక బానిసత్వపు శృంఖలాల్ని తెంచుకుని ప్రపంచానికి ముక్తినీ, మోక్షాన్నీ ప్రసాదించగలవా?

ఇదంతా నిష్ప్రయోజనకరమైన "థియోసఫీ" కాదు. ఈనాటి సాంఘిక దురాచారాలను చూస్తే నాకు ప్రగాఢ సంతాపం కలుగుతోంది. అత్యంత హానికరమైన దురాచారాలు - అన్నిటికన్నా హీనమైనది "వరకట్న వ్యవస్థ" వీటితో భారత సమాజం కుళ్లిపోయింది. సిగ్గు లేకుండా అడుగుతున్నారు. ఇన్ని వేలన్ని వేలు కట్నం ఇమ్మని. నిర్ఘాంత పోవడం, నిలువెల్లా వొణుకు పుట్టడం జరుగుతోంది. "మనం ఎక్కడికి పోతున్నాం? నా కుమార్తెల వివాహం చెయ్యడం నాకు సాధ్యమేనా?" అని నాకు ఆశ్చర్యం కలుగుతోంది.

మాణిక్యంలాంటి నీవంటి పిల్లకి కట్నం పదివేలు అడుగుతున్నారంటే అంతకన్న కళంకం మరొకటుంటుందా? కొన్ని సమయాల్లో నిస్సహాయులమైపోతాం. ఈమధ్య ఐ.ఎ.ఎస్. పాసైన ఒక వరుని తాలూకు బంధువు రెండు వందల రూపాయలడిగాడు - పూరీ నుంచి పెళ్లి కొడుకుని ఇక్కడికి పిల్లని చూడటానికి రప్పించడానికి. తన ప్రయాణపు ఖర్చులు కూడా తను పెట్టుకోలేడు! తీరా పిల్లని చూసిన తరువాత "పిల్ల అంత సంతృప్తికరంగా లేదు" అని చెప్పడానికేనా ఈ ప్రయాణపు ఖర్చులు కోరడం? వింతగా ఉంది కదూ?...

స్త్రీలు - భారతదేశంలోని మహిళా సంఘాలన్నీ ఈ సమస్యని చేపట్టి, పోరాడి, ఈ దురాచారాన్ని రూపుమాపాలి. ఇది సాధించాలంటే స్త్రీలు ఆత్మ గౌరవాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ, ధైర్యాన్నీ, పవిత్రమైన శీలాన్నీ, సాహసాన్నీ, నిస్వార్థతనీ, ఆత్మ త్యాగబుద్ధినీ, చెక్కు చెదరని సాంఘిక సేవాభిలాషనీ పెంపొందించుకోవాలి.

స్త్రీ అంటే నాకు అపారమైన గౌరవం. ఆమెను పూజిస్తాను. ఆరాధిస్తాను. కానీ, ధనికుణ్ణి కానందువల్ల ఆడపిల్లల పెళ్లిళ్లు చెయ్యవలసిన సమస్యను

ఎదుర్కొంటున్నప్పుడు ఒక్కొక్కసారి బలహీనత ఆవహిస్తుంది నన్ను. ఆడది అంటే నాకు హీనమైన అభిప్రాయం ఉందని ఎప్పుడూ అనుకోకు. మీ అక్కకి ఆడపిల్ల పుట్టిందని "సెకండ్ క్లాస్ వచ్చింది" అని రాయడం కేవలం వేళాకోళానికే. అందరూ సాధారణంగా చేసే హాస్యమే కదా.

మీ అక్కకి పుట్టిన పిల్ల పెద్దపిల్లలాగే ఉంటుంది. ఇంకా తెల్లగా ఉంది. చూడటానికి చాలా బాగుంది. అటువంటి చక్కని చుక్కని చూసి నిరాశ చెందడం అమానుషమే. కాని వేలకి వేలు కట్నం ధారపొయ్యమన్నప్పుడు కన్నతండ్రి "ఓ భగవంతుడా, ఆడపిల్ల నెందుకిచ్చావయ్యా నాకు" అని వాపోవడంలో తప్పు లేదు".

అప్పటికి దాదాపు ఒక దశాబ్దం క్రితం రాసిన ఈ ఉత్తరాన్ని నాన్నగారు మళ్లీ చదివితే ఆయన గుండె ఇంకెంత బరువెక్కుతుందో! (ఎన్ని దశాబ్దాలయినా పరిస్థితుల్లో మార్పు రావడం లేదు కట్నాల విషయంలో - సిగ్గుచేటు!)

* * *

నాకు పదమూడేళ్ల వయస్సు ఉన్నప్పుడు నాన్నగారు నా ప్రమేయం లేకుండానే నన్ను దివ్యజ్ఞాన సమాజంవైపు మళ్లించడానికి ప్రయత్నించారు. ఆంతరంగిక సభ్యులకు ప్రవేశం ఉండే మందిరంలోకి తీసుకువెళ్లి, నాకు వాళ్లు అనుసరించే పరమ గురువుల చిత్ర పటాలు చూపించారు. వారి ప్రభావం ఎందువల్లనో నామీద ఎంతమాత్రం పడలేదు. చిన్నతనం వల్ల కావచ్చు. అప్పటికే రాముడు, కృష్ణుడు, ఆంజనేయస్వామి, షిర్డీ సాయిబాబా వీళ్లంతా నా మనస్సుని ఆక్రమించి ఉన్నారు. మహర్షి కూథూమీ, లార్డ్ మైత్రేయా, లెడ్ బిటర్, ఆనీబిసెంట్, జినరాజదాసా - ఈ పేర్లు తరుచు వినడం మాత్రం జరిగేది. నా చదువుకీ, పరీక్షలికీ భంగం కలగకూడదనుకున్నారేమో, నన్ను ఎక్కువ వొత్తిడి చెయ్యలేదు అప్పట్లో.

వివాహం అయి, నేను కొద్దిగా స్థిమితపడ్డాక మళ్లీ దివ్యజ్ఞానం సంగతి ఎత్తారు. నేను ఉత్తరాలకి వెంటనే సమాధానం రాయడం లేదని చిరాకుపడి ఇలా రాశారు.

"..(1) నీ ఉత్తరం నిన్న సాయంత్రం 6 గంటలకి నాకు చేరింది. ఈ జవాబుని ఈ ఉదయం 7.30కి రాస్తున్నాను.

(2) నా అలవాట్లు, నా క్రమశిక్షణ నాకు నేర్పినది - ప్రతి ఉత్తరానికీ 48 గంటలు దాటకుండా సమాధానం రాయడం. కాని, మీవంటి గొప్పవాళ్లకి ఉత్తరం వచ్చిన వెంటనే సమాధానం రాయడం కుదరదు! మీ ఆయన వంటివారు అసలు ఉత్తరాలు రాయడానికే దిగజారరు! బహుశా వాళ్లకి తమ సంతకాల్ని ఎవరైనా చూసి దొంగ సంతకాలు చేస్తారనే భయమేమో!!! టెలిగ్రాముల క్రింద అతని పేరు చూడటమేగాని, ఇంతవరకు అతని సంతకాన్ని గాని, దస్తూరిని గాని చూడనేలేదు! ఈ అశ్రద్ధలోని ఆంతర్యం ఏమిటో తెలుసుకోవాలని చాలా తీవ్రంగా ప్రయత్నిస్తున్నాను. మీ అన్నయ్య కూడా దీనికి అతీతుడు కాడు - ఉత్తరాలకి జవాబులు రాయడంలో అశ్రద్ధకి. నేనేమీ నిరసించడమూ లేదు. విమర్శించడమూ లేదు. ఊరికే, జీవితాన్ని అర్థం చేసుకోవడానికీ, మానవ మనస్తత్వాన్ని అవగాహన చేసుకోవడానికీ ప్రయత్నిస్తున్నానంతే. దానివల్ల నన్ను నేను ఇంకా బాగా అర్థం చేసుకోవచ్చునేమోనని. ఏమైనా ఇటువంటి అశ్రద్ధనీ, బద్ధకాన్నీ నేను మాత్రం మెచ్చుకోలేకుండా ఉన్నాను. ఈ విషయమై ఇంకేమీ చెయ్యలేను కాబట్టి, దాన్ని సహిస్తాను.

(3) నీలోని ఇంకో చిత్రమైన విషయం ఏమిటంటే కాగితానికి రెండువైపులా రాయడానికి తగినన్ని విశేషాలే తోచవు నీకు! ఆ ఊళ్లోనే ఉన్న మీ అన్నయ్య గురించి గాని, నీ మేనకోడలి గురించి గాని, మీ పింతల్లి కొడుకు గురించిగాని, మీ ఆడబిడ్డ గురించిగాని, మరిది గురించిగాని ఒక్క ముక్క రాయలేదు నువ్వు. అంతా చిత్రంగా ఉంటుంది నాకు. మరీ అంత స్వార్థపరంగా ఉండకుండా, మరికొంత విశాల దృక్పథం కలిగి ఉంటే మంచిదనుకుంటాను. ఇందులో కోపగించుకోవలసినదేమీ లేదనుకుంటాను.

(4) మీ ఆయన కోలుకుంటున్నాడని తెలిస్తే సంతోషిస్తాను. అతను నన్ను అపార్థం చేసుకోకుండా ఉంటే, నాదొక సలహా. అతను తన జీవన విధానాన్ని క్రమబద్ధంగా మార్చుకోవాలి. భోజనం, టిఫినూ సరియైన వేళకి తీసుకోవాలి. క్రమశిక్షణ లోపలినుంచి రావాలి. బయటనుంచి కాదు. ఎవరో విధించిన క్రమశిక్షణ బలవంతం చేస్తున్నట్లుగా, అణచివేస్తున్నట్లుగా అనిపిస్తుంది. స్వయంగా అలవరచుకునే క్రమశిక్షణ అవగాహన వల్ల సాధ్యమవుతుంది. స్వయంగా క్రమశిక్షణ అలవరచుకోవడం వల్ల 'యోగం', 'స్వేచ్ఛ' లభిస్తాయి.

(5) దివ్యజ్ఞాన సమాజపు సభ్యత్వాన్ని కొనసాగిస్తున్నావే, లేక మానివేశావే

నాకు తెలియదు. నీ పెళ్ళికి ముందు నేనే నీ సభ్యత్వపు చందా కట్టేవాణ్ణి. నీకు "థియొసాఫికల్ రెవ్యూ" అనే మంచి ఆంగ్లపత్రిక బెనారసు నుంచి వచ్చే ఏర్పాటు చేశాను. తప్పకుండా చదువుతూ ఉండు. శ్రద్ధగా చదివి గ్రహించు. ఈ సభ్యత్వం నీకు కాకతాళీయంగా వచ్చిందని అనుకోవద్దు. నీ పూర్వజన్మ సంస్కారం వల్లనూ, నాకు పుత్రిక అవడం వల్లనూ, నీకు థియొసాఫికల్ సొసైటీలో సభ్యత్వం లభించడం జరిగింది. ఈ సభ్యత్వాన్ని సద్వినియోగం చేసుకుంటావో లేదో నీలో ఉంది. థియొసాఫికల్ సొసైటీ సభ్యత్వంలోగల విశిష్టత సామాన్య మానవులకి ఎన్ని పరీక్షలు పాసైనా, ఎంత గొప్పవాళ్ళైనా, తెలియదు. థియొసాఫికల్ సొసైటీ సాహిత్యాన్నీ, ఆ అమూల్యగ్రంథాల్నీ చదివి ఆనందించగలిగిన వారికే తెలుస్తుంది...

నేను నా బిడ్డలకు ధనం, ఆస్తులూ ఇవ్వలేను. దివ్యజ్ఞాన గ్రంథాలను మాత్రమే ఇవ్వగలను. వారు ఎలా ఉపయోగించుకుంటారో అది వారి పని. నాది కాదు...

మానవజాతి ప్రస్తుతం అతి క్లిష్టమైన స్థితిలో ఉంది. పరిణామం ఎలా జరుగుతుందో తెలుసుకోవలసి ఉంది. జీవితంలో దేనికి ఎలాంటి విలువలు ఇవ్వాలో వివేకంతో గ్రహించవలసి ఉంది. ఆ విలువలు తెలియకపోవడం వల్లనే ప్రపంచంలో ఇంత బాధ, పోరాటం, కష్టం కలుగుతున్నాయి.

ఈ మధ్యనే నన్ను ఆంధ్రా థియోసాఫికల్ ఫెడరేషన్ సెక్రటరీగా ఎన్నుకున్నారు. ఇది ఫెడరేషన్ సెక్రటరీగా నీకు నా ప్రథమ గంభీరోపన్యాసం!!

(6) నిన్న నేనొక జ్యోతిష పత్రిక చదువుతున్నప్పుడు, నీ జాతకం ప్రకారం నువ్వొక గొప్ప వేదాంతివయే అవకాశాలున్నట్లు అనిపించింది! నీ ఆంగ్ల విద్యాభ్యాసాన్ని సరిగ్గా వినియోగించుకుని థియోసఫీ అధ్యయనం శ్రద్ధగా కొనసాగించినట్లయితే నువ్వు తత్త్వజ్ఞానివయే అవకాశాలు లేకపోలేదు. అలా అయితే నిజంగా ఎంత బావుంటుంది!

(7) నువ్వు ఎం.ఎ. పాసైనదానవు. నీ విజ్ఞానాన్ని సంపూర్ణంగా సద్వినియోగం చేసుకుంటే మంచిదనుకుంటున్నాను. ఏదైనా సాంఘిక సేవా కార్యక్రమాల్లో పాల్గొంటే బావుంటుంది. "మానవ సేవ" జీవిత ముఖ్యోద్దేశం కావాలి. తోటి మానవులకు సేవ చెయ్యగలిగినప్పుడే జీవితం సార్థకమవుతుంది.

(8) నీకొకసారి ఒక ముఖ్య జీవన సూత్రాన్ని చెప్పాను. "సరియైన పనిని సరియైన సమయంలో సరియైన విధంగా చెయ్యాలి" అని. బుద్ధ భగవానుడు, ఏసుక్రీస్తు, శంకరాచార్యులు, భగవద్గీతా బోధించిన దాని సారం ఇదే. ఇదే యోగం – "యోగః కర్మణ కౌశలం". ఆ చిన్న సూత్రం అత్యున్నత ఆధ్యాత్మిక శక్తి సాధనకి దారితీస్తుంది. జీవన్ముక్తిత్వానికి కూడా. జీవితంలో ఆ సూత్రం వర్తించని విషయం ఏదీ లేదు. ఆ 'సూత్రం గురించి రోజులు, వారాలు, నెలల తరబడి ధ్యానం చెయ్యవచ్చు. నీ జీవితంలో ఆ సూత్రాన్ని అమలుపరచు. బాగా ఆలోచించు దాని విషయమై.

(9) నువ్వు చక్కని తెలుగులో ఆధునిక వ్యావహారిక శైలిలో రాస్తావు. అటువంటి శైలిని నేను ఈ జీవితంలో అలవరచుకోలేను. నా తెలుగు పురాతనంగా, వికృతంగా, ఊపులేకుండా ఉంటుంది. అందుకని ఇక ముందుకూడా నా ఉత్తరాలను ఇంగ్లీషులోనే రాయదలుచుకున్నాను. నన్ను క్షమించు..."

* * *

నాన్నగారు థియొసాఫికల్ సొసైటీలో నా సభ్యత్వం గురించి ఎన్నిసార్లు రాసినా నేను పట్టించుకోకుండా ఊరుకున్నాను. అందులో నాకు అభిరుచి కలగకపోవడమేకాక, నా భర్త ప్రోత్సాహం లేకపోవడం కూడా కొంత కారణం. మా ఇద్దరికీ సాహిత్యాభిలాష ప్రధానంగా ఉండటం, లలిత కళలలో కూడా అభిరుచి ఉండటం వల్ల, అప్పట్లో దివ్యజ్ఞానంవైపు నా దృష్టి పోలేదు నాన్నగారు ఎంత ప్రయత్నించినా. కొన్నేళ్ళు నాబదులు ఆయనే చందా కట్టి కట్టి, ఇంక విసుగొచ్చి ఊరుకున్నారు. తరువాత మేము ఢిల్లీ వెళ్లిపోయాం.

తమాషా ఏమిటంటే, తరువాత నాన్నగారే దివ్యజ్ఞాన సమాజాన్ని వదిలిపెట్టి జిడ్డు కృష్ణమూర్తిగారి ప్రసంగాల ప్రభావంలో పడ్డారు!

ఏదో ఒక ఆలంబనం లేకపోతే మనిషి జీవించలేడనుకుంటాను. జీవితంలో ప్రధానభాగం బ్రతుకు తెరువుకోసం ప్రయాసపడటంతోనే సరిపోతుంది. కాస్త తీరిక దొరికితే చాలు. ఎందుకు, ఎంతకాలం – వంటి ప్రశ్నలు ఉత్పన్నమై మనస్సుని స్తిమితంగా ఉండనివ్వవు. వృత్తి విరమణ అయింతరువాత, ఈ అంతర్మథనంతోనే సాగుతుంది శేషజీవితం. ఒంటరితనం విశ్వరూపం దాలుస్తుంది. కాలక్షేప మార్గాలు వెతుక్కోవడం అరంభిస్తాడు మనిషి. ఆ మార్గాలే ఆలంబనాలు

జీవించడానికి. నిరాశ, నిస్పృహల మధ్య ఏదో కాంతిపథం గోచరిస్తున్నట్లు తోస్తుంది ఎప్పటికప్పుడు! నాన్నగారి శేషజీవితంలో కృష్ణమూర్తిగారే కాంతికీ, క్రాంతికీ దారి చూపించారు. అంతకు ముందు చాలా సంవత్సరాలుగా కృష్ణమూర్తిగారి ప్రసంగాలతో, ప్రవచనాలతో పరిచయం ఉన్నప్పటికీ, నాన్నగారు తన అరవై ఎనిమిదవ ఏట కృష్ణమూర్తిగారితో ఒక వినూత్న సాన్నిహిత్యం ఏర్పడినట్లు అనుభూతి చెందారు.

"ప్రస్తుతం నేను జిడ్డు కృష్ణమూర్తిగారి 'ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్' అనే విశ్వ విఖ్యాత గ్రంథాన్ని అనువదిస్తున్నాను. ఈ పుస్తకానికి ఆల్‌డస్ హక్స్‌లీ ఉపోద్ఘాతం రాశారు. కొద్ది సంవత్సరాల కాలంలోనే ఏడుసార్లు ప్రచురితమైంది ఈ పుస్తకం... ఈ గ్రంథాన్ని అనువదిస్తున్నప్పుడు మాటల్లో వ్యక్తం చేయలేని ఒక అపురూపమైన అనుభవం కలుగుతోంది. ఒక విచిత్రమైన సన్నిహితత్వం ఏర్పడుతోంది.." అని రాశారు ఉత్తరంలో.

నాన్నగారు ఉత్తరాలు రాసే తీరు విశిష్టమైనది. అందరిలాగా "ఇక్కడ క్షేమం. అక్కడ అంతా క్షేమం అని తలుస్తాను" అంటూ మొక్కుబడి తీర్చుకున్నట్లు రాయరు. ప్రతి విషయానికీ స్పందిస్తూ, వ్యాఖ్యానిస్తూ రాసేవారు.

"ఢిల్లీలో చెలరేగుతున్న చలిగాలికి ఎలా తట్టుకుంటున్నారు? మినిమమ్ 5° సెంటిగ్రేడ్ అంటే నిజంగా దుర్భరమే! హైదరాబాద్‌లో మాకు రాత్రిళ్లు వెచ్చగానే ఉంటోంది. ఈ వేసవికాలం మరింత తీవ్రంగా ఉండవచ్చుననుకుంటున్నాము.

.... అష్టగ్రహ కూటమి యొక్క ప్రభావం ఎలా ఉంటుందో చూద్దాం...." అని నాన్నగారు రాసిన దానికి జవాబు రాస్తూ, నేను బ్రోంకైటిస్‌తోనూ, ర్యుమాటిక్ నొప్పులతోనూ బాధపడుతున్నట్లు రాశాను. నా ఆరోగ్యం గురించి ఆందోళన పడుతూ, 'బి' విటమిన్ మాత్రలు కొన్ని నెల్లపాటు వాడమని సలహా ఇచ్చారు. హోమియోపతీ వైద్యం చెయ్యడం అప్పటికింకా ఆరంభించలేదు నాన్నగారు.

కృష్ణమూర్తి గారి పుస్తకానికి చేసిన అనువాదం కాపీ ఒకటి నాకు పంపించారు. మూడు నెలల్లో నాలుగు కాపీలు తయారు చేశారుట!

"నీకు పంపిన అనువాదం నాల్గవ కాపీ. మరొక కాపీ ఇరవై ఒక్క రోజుల్లో

రాసి రాజమండ్రిలో థియొసాఫికల్ లాడ్జికి బహూకరించాను. ఎలా కాలక్షేపం చెయ్యడం?...

పొద్దున్నే 5.45కో 6 గంటలకో కాఫీ తాగుతాను. 8.30కి భోజనం చేస్తాను. మళ్ళీ 1.30, 2 గంటలకి మధ్య కాఫీ తాగుతాను. సాయంత్రం మీ అన్నయ్యతో కలిసి 7.30కి భోజనం చేస్తాను. బజారుకి వెళ్ళి కూరలూ అవీ పట్టుకొస్తూ ఉంటాను. మిగిలిన సమయం అంతా ఏం చెయ్యను? ఆరు నెలలనుంచీ (మే, జూన్ నెలల్లో 5 వారాలు తప్ప) నా అనువాదానికి కాపీలు తయారు చేశాను. మొత్తం అయిదు కాపీలు. ఎలా కాలక్షేపం చెయ్యాలో నాకు అర్థం కావడం లేదు. నువ్వేమైనా సలహా ఇవ్వగలవా?...

నా అంతట నేను స్వతంత్రంగా గ్రంథాలు వ్రాయగలిగే తెలివి తేటలు నాకు లేవు. ఇంకో గ్రంథమేదైనా అనువదించడానికి ప్రయత్నించవచ్చుననుకో (ఇప్పటికి 3 పుస్తకాలు చేశాను కాబట్టి). అనువదించడానికి ఉపయోగకరమైన పుస్తకాన్నేదైనా – తెలుగులో అచ్చు వేయడానికి వీలైనదీ, నలుగురికీ ఉపయోగపడేదీ ఏదైనా నాకు సూచించగలవా? నువ్వేదైనా మంచి సలహా ఇవ్వగలవని ఆశిస్తున్నాను.

నేనొక్కటే చెప్పగలను – నాకు చాతనయినంతగా చేయడానికి ప్రయత్నిస్తాను. భాష సరళంగా, సులభంగా ఉంటుంది – అంతకన్న బాగా రాయగలననుకోవడం లేదు. సామాన్య పురుషులకీ, స్త్రీలకీ అర్థమయేట్లు రాయగలిగితే చాలు. జిడ్డు కృష్ణమూర్తిగారి పుస్తకానికి పీఠిక రాసిన ఆల్డస్ హక్స్లీ భావాల్లా మరీ ఉత్కృష్టంగా ఉన్నట్లయితే నేనేమీ చెయ్యలేను ఈపాటికి నీతండ్రి శక్తి సామర్థ్యాల గురించి నీకు తెలిసే ఉంటుంది. నువ్వేం మొహమాట పడక్కర్లేదు. నాకున్న తీరిక సమయంలో – అది చాలా ఉంది – ఏదైనా ఉపయోగకరమైన పని – అంటే, నాకున్నపాటి తెలివి తేటలు, శక్తి సామర్థ్యాలూ వినియోగించి, సమాజానికి ఏవిధంగానైనా ఉపయోగపడేలా కాలక్షేపం చెయ్యాలన్నదే నా ఉద్దేశం...

మీ అన్నయ్య లాబ్స్‌లో ఏవో కొత్త ప్రయోగాలు చేస్తూ రోజంతా పని చేస్తున్నాడు. పొద్దున్నే 7 గంటలకి వెళ్ళి మళ్ళీ రాత్రి 7.30కి, ఒక్కొక్కప్పుడు 10 గంటలకీ తిరిగి వస్తున్నాడు... ప్రస్తుతం నాకేమీ పనిలేదు. నా మనస్సు ఖాళీగా ఉంది.." అని రాశారు.

ఏదో చెయ్యాలన్న తపన, చేసే ఓపిక ఉన్న నాన్నగారు ఎందుకంత త్వరగా తన వృత్తిని విరమించుకున్నారో అనిపిస్తుందొక్కొక్కప్పుడు.

"యోగః కర్మణ కౌశలం" అనే సూత్రాన్ని మార్గదర్శకంగా పెట్టుకుని జీవితాన్ని సాగించాలని చెబుతూ వచ్చారు. "సరియైన పనిని సరియైన సమయంలో సరియైన విధంగా" నిర్వర్తించాలని బోధించేవారు. పదే పదే చెప్పడానికి ఆయనకి విసుగు లేకపోయినా వినడానికి మాకుండేది. మా ఎవరివల్లనైనా ఏదన్నా పొరపాటు జరిగితే చాలు – "అందుకే సరియైన..." అని అందుకునేవారు! ఆయన అటు తిరగ్గానే నవ్వుకునేవాళ్లం. చిన్నతనంలో ఆ మాటలు గంభీరంగా తీసుకోవాలని ఎప్పుడూ అనిపించలేదు.

పెద్దయిన తరువాత కూడా ఎంత ఆలోచించినా అందులో ఎక్కడా సహేతుకమైనదేదీ కనిపించలేదు. ఏది "సరియైనదో" ఎవరు నిర్ణయిస్తారు? ఎలా నిర్ణయిస్తారు? నాకు సరియైనదే మీకు సరియైనది కానట్టు ఎందుకనిపిస్తోంది? అంతరాత్మ చెప్పిన ప్రతీదీ సరియైనదేనని కూడా రుజువు కావడం లేదు. దీనికి మీరేమంటారు? అని నాన్నగారి ఎదుట నిలబడి అడిగే ధైర్యం ఎప్పుడూ కలగలేదు. ఏదో తోచినట్లు చెయ్యడం, బెడిసికొడితే చివాట్లు తినడం, నిరాశ చెందడం, ఇదే జీవిత విధానం అయిపోయింది. ప్రతిదానికీ "ఇది సరియైన పని అవునా కాదా, సరియైన సమయం అవునా కాదా, సరియైన విధం అవునా కాదా" అని పరిశీలించి నిర్ణయించుకునే తీరిక, ఓపికా రెండూ ఉండవు నిత్య జీవితంలో కొన్ని నిర్ణయాలు క్షణంలో తీసుకున్నా సత్ఫలితాలనిస్తాయి. కొన్ని రోజుల తరబడి ఆలోచించి, నలుగురితో చర్చించి, నిర్ణయాలు తీసుకున్నా పరిస్థితులు తారుమారు అవుతాయి. దానికి దురదృష్టమనీ, కర్మ అనీ, విధి అనీ రకరకాలుగా పేర్లు పెట్టి, జరిగిన దాన్ని సమర్థించుకుంటాం.

నాన్నగారు బోధించి, అనుసరించిన సూత్రం ఆయన జీవితాన్ని ఎలా నడిపింది? అదే చూడాలి. అందరిలా నాన్నగారిని తిక్క మనిషి అని తేల్చేయడం నాకిష్టం లేదు. ఆయన ఒక చిక్కు మనిషి.

"నిరాడంబరత"ని ప్రబోధిస్తూ నిరాడంబరంగా జీవించిన ఆయన చిక్కు మనిషి ఎలా అయ్యారు? చిక్కు ఎక్కడ వస్తుందసలు? నా తోవని నేను ముక్కు సూటిగా పోతాను అనుకోవడానికి వీలు కుదరదు సంఘజీవికి. మనకిష్టం ఉన్నా

లేకపోయినా మన చుట్టూ ఉన్న వారితో సంపర్కం, సంబంధం ఏర్పడక తప్పదు. ఆ సంబంధ బాంధవ్యాల తీరుతెన్నుల్లోనే ఏ వ్యక్తి తత్త్వమయినా ప్రస్ఫుటమవుతుంది. మన ఇష్టాయిష్టాలూ, కోపతాపాలూ – అన్నీ మన చుట్టూ ఉన్నవారితో ముడిపడతాయి మన ప్రయత్నం ఉన్నా లేకపోయినా.

నాన్నగారు రాజమండ్రిలో యుక్తవయస్సులో ప్రారంభించిన న్యాయవాద వృత్తిని కుటుంబ బాధ్యతలు పూర్తికాగానే విరమించుకోవాలని నిర్ణయించుకున్నారు. హైదరాబాదులో కొడుకు దగ్గరికి వెళ్ళి ఉండాలని అమ్మ కాంక్ష. 'అన్యాయవాదం' ప్రబలుతున్న కొద్దీ న్యాయవాద వృత్తి మీద విరక్తి కలగడం, దివ్యజ్ఞాన సమాజ కార్య కలాపాల్లో ఆసక్తి పెరగడం, ధన సంపాదనపైన విముఖత కలగడం, ఇవన్నీ కోటు విప్పేసి కొడుకు దగ్గరికి వెళ్ళడానికి ప్రోద్బలం కలిగించాయి. రాజమండ్రిలో సొంత ఇల్లు ఎలాగూ లేదు. హైదరాబాదులో కొడుకు ఇల్లు కొనుక్కోవాలనుకుంటున్నాడు. పొలం, పుట్రా అమ్మిన డబ్బేదో వాడి చేతికే ఇచ్చి నిశ్చింతగా దివ్యజ్ఞాన సమాజానికి సేవ చెయ్యవచ్చునని ఆశపడి, 'సరియైన' నిర్ణయాన్ని తీసుకుని, హైదరాబాదు వచ్చేశారు. వచ్చి నాలుగైదేళ్లు కాలేదు. అన్నయ్యకి డెహ్రాడూన్‌లో పెద్ద ఉద్యోగం వచ్చింది. అన్నయ్య కుటుంబంతోబాటు అమ్మ, నాన్నగారూ వస్తారని నేను అనుకున్నాను. కానీ –

"మీ అమ్మగారు వాళ్లతో కలిసి వెడతారేమో. ఆవిడకి ఊళ్ళు తిరగడం, యాత్రలకి వెళ్ళడం సరదా కదా. నేను మాత్రం ఒక మైలురాయిని – చలనం, చైతన్యం లేనివాడిని. కాని, నేనిక్కడ ఒంటరిగా ఉండదలుచుకోలేదు. నేను ఎక్కడైనా బ్రతక గలను. ఇంకా ఏమీ నిశ్చయించుకోలేదు. ఢిల్లీ గాని, డెహ్రాడూన్‌గాని మాత్రం కాదు..." అని రాశారు నాన్నగారు.

* * *

తరవాత దాదాపు సంవత్సరంపాటు ఉత్తరాలు లేవు. హైదరాబాదు వదిలిపెట్టి నరసాపురంలో మకాం పెట్టి స్థిరపడేవరకూ ఉత్తరాలు లేవు. ఈ ఊరి నుంచి ఆ ఊరికి మకాం మార్చడం, కొత్తచోట స్థిరపడటం – ఆ ఇబ్బందుల వల్ల కాదు. అలాంటివి నాన్నగారికి ఇబ్బందులని ఎప్పుడూ అనిపించవు. ఏదైనా బాధ్యత తీసుకున్నా, బాధ్యతపైన పడినా మనస్ఫూర్తిగా నిర్వర్తిస్తారు. పైకి ఎంత

గొణుక్కుంటున్నా, అందరినీ ఎంత సాధిస్తున్నా, చెయ్యవలసిందంతా సవ్యంగా చేస్తారు. అదికాదు అసలు విషయం. ఆ విషయం నేను నరసాపురం వెళ్లినప్పుడు అమ్మ వివరంగా చెబితే తెలిసింది.

నాన్నగారిలో ఒక విశేష గుణం ఉంది. అది ఎంతమందిలో ఉంటుందో చెప్పలేను. నాలోనూ ఉంది కొంతవరకు. తన తప్పు లేనప్పుడు ఎదుటివారిని విమర్శించడంలో, ఖండించడంలో ఎంతమాత్రం వెనకాడరు. అదే ఎందులోనైనా తన తప్పుంటే కిక్కురుమనరు. తనదే తప్పు అని సూటిగా ఒప్పుకోరు. 'ఏమో, ఇందులో నా తప్పు ఎంతవరకో నాకు తెలియదు' అని తప్పించుకుంటారు. ఈ సంవత్సరంపాటు నాకు ఉత్తరాలు రాయలేదంటే, ఆయన పైకి చెప్పుకోలేని తప్పేదో జరిగిందనుకున్నాను అమ్మ చెప్పిన ఉదంతాన్ని బట్టి. ఆ ఏడు జరిగిన విశేషాలను నాన్నగారు తరువాత కూడా ఎప్పుడూ ప్రస్తావించలేదు. తప్పు ఒప్పుకోలేని బలహీనత కావచ్చు, గతాన్ని పూర్తిగా విస్మరించాలన్న తత్త్వం కావచ్చు. కొంత విరక్తి కావచ్చు.

ప్రభుత్వం విధించే ఆంక్షలాంటిదేమీ లేకపోయినా, చేస్తూన్న 'లా' ప్రాక్టీసు విరమించుకున్నారని చెప్పాను కదా. మారుతున్న కాలంలో తను నమ్మిన న్యాయానికి విలువ ఉండటం లేదనీ, న్యాయవాదిగా పేరు పెట్టుకుని తిరగడంలో అర్థంలేదనీ అనిపించే దాయనకి. మొదటినుంచీ, తనకు న్యాయమని తోచి, నమ్మకం కలిగినప్పుడే, ఆ కేసులను చేబట్టేవారు. సహజంగా, ఆర్థికంగా అర్భకులూ, అన్యాయానికి గురి అయినవారే ఎక్కువగా వస్తూండేవారాయన దగ్గరికి. డబ్బున్నవాళ్లు కొద్దిమందే ఉండేవారు ఆయన క్లైంట్సులో. ఒకవేళ ఎవరైనా వచ్చి ఆయన్ని కేసు తీసుకోమని బలవంతపెట్టినా, న్యాయంగా తను గెలుస్తానన్న నమ్మకం లేనప్పుడు వాళ్లని అన్యాయానికి పాల్పడవద్దని చివాట్లేసి పంపించేవారు.

నాన్నగారే న్యాయ నిర్ణేతగా జడ్జీ స్థానంలో కూర్చుని ఉంటే ఎంతమందికో న్యాయం జరిగి ఉండేదేమో. ఆయన ఆఫీసు గదిలో ఆయన కూర్చోవడానికి జడ్జీగారి కుర్చీలాంటిది ఉండేది (అప్పుడప్పుడు ఆయన ఇంట్లో లేనప్పుడు ఆ కుర్చీలో కూర్చుని, ఎదురుగా గోడమీద కనిపిస్తున్న నిలువెత్తు ఫోటోలో కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారి ముఖాన్ని చూస్తూ గడపటం నాకు ఇష్టంగా ఉండేది).

జడ్జీమాట దేవుడెరుగు. అడ్వకేటుగా కూడా నమోదు చేయించుకోలేదు. ఆయనకా ఆశ లేదు. నేను 'లా' చదువుతానంటే ఒప్పుకోలేదు. 'నీమొహం, కోర్టులో ఎవరైనా గట్టిగా వాదిస్తే ఏడుస్తూ ఇంటికొస్తావ్!' అనో, 'నీ గొంతుక్కి సాయం...' అనో వెక్కిరించేవారు. నా గొంతు ధాటీగా లేకపోవడానికీ, ఆత్మ విశ్వాసాన్ని ప్రదర్శించక పోవడానికి ఆయనే కారణం అయివుండచ్చునని నాన్నగారితో నేనెప్పుడూ అనలేదు.

నాన్నగారు అప్పుడప్పుడు కేసులు ఓడిపోవడం ఆయనకి తెలివి తేటలు లేక కాదు. ప్రపంచంలో స్త్రీ స్థానం ఎలా ఉందో న్యాయదేవత స్థానం కూడా అంతే. అడుగడుగునా అన్యాయానికి గురి అవుతుంది స్త్రీ మూర్తి. ద్రౌపది కౌరవ సభలో అపహాస్యం పాలైనట్లు న్యాయదేవత కూడా తరతరాలుగా అవమానాలపాలవుతూనే ఉంది. ఆవిడని స్వస్థానంలో నిలబెట్టడానికి కోర్టుకీ ఇంటికీ మధ్య ఎన్ని పరుగులు తీసినా, గవాస్కర్‌లా అప్పుడప్పుడు "కేచ్" అవుతూండేవారు. అలాంటప్పుడే నాన్నగారికి విరక్తి కలిగేది న్యాయవాది వృత్తి మీద. ఎప్పుడు కుటుంబ బాధ్యతలు పూర్తవుతాయా, ఎప్పుడు కోర్టు ముఖం చూడటం మానేద్దామా అని ఎదురు చూస్తున్నట్లు బంధుమిత్రులతో చెబుతూండేవారు.

'దీనికి తోడు అమ్మ కూడా రాజమండ్రి అంటే మొహంమొత్తిపోయి, "అయిదరబాదా" వెళ్లిపోతేగాని తన కష్టాలు గట్టెక్కవు అంటూ ఉండేది. రాజమండ్రిలో ఇల్లు ఒక ధర్మసత్రంలా ఉండేది వచ్చే పోయే బంధుమిత్రులతో. చాకిరీ చెయ్యలేక చచ్చిపోతున్నాని గోలపెట్టేది అమ్మ.

నాన్నగారు అధికారపీఠం అధిష్ఠించలేదు గాని, అధికారం ఆయన నరనరాల్లోనూ ఉంది. ఆయన చూపులు నేరాన్ని పసికడుతున్నట్లు, గుచ్చుకునేట్లూ ఉండేవి – 'యూల్ బ్రిన్నర్' చూపుల్లాగ. కొంచెం కీచు కంఠం అయినా, అరిస్తే హడల గొట్టేట్లు ఉండేది. ఆయనకి మొదటి నుంచీ ఆడపెత్తనం కిట్టదు. చిన్నప్పుడే తల్లీ, తండ్రీ పోతే, విధవ మేనత్త పెంచి పెద్ద చేసింది. ఆవిడ చండశాసనురాలు. అటువంటి స్త్రీ చెప్పు చేతల్లో పెరిగిన తరవాత స్త్రీలకి ఏ మాత్రం అధికారం ఇవ్వాలన్నా (ముఖ్యంగా, ఎదురు నిలిచి జవాబు చెప్పడం) ఆయనకి 'ఎలర్జీ' పట్టుకుంది. ఆడవాళ్లు ఏదైనా సలహా చెప్పబోతే వాళ్లకి అవమానమే మిగిలేది. (ఇక్కడ మరో వైరుధ్యం ఉంది. మేనత్త పెత్తనాన్ని ఎంత హర్షించక పోయినా, ఆవిణ్ణి పల్లెత్తు మాట అననిచ్చేవారు కాదు ఎవరినీ. ఆవిడ

పోయాక ఆవిడ గురించి అమ్మ ఏదో అన్నందుకు అమ్మమీద చెయ్యి వేసుకున్నారు కూడా. అంతే కాదు. దివ్యజ్ఞాన సమాజంలో అనీబిసెంట్, రుక్మిణీ అరండేల్ మొదలైన వారితోనూ, రాజమండ్రిలో వీరేశలింగంగారు ఏర్పరిచిన సంస్థలతోనూ అనుబంధం ఏర్పడటం మూలాన్ని 'స్త్రీ' అంటే గౌరవ భావం పెంపొందినా, స్త్రీని చులకనగా చూడటం అలవాటు పోలేదు. మా అమ్మని 'మీరు' అని సంబోధించినా, కోపం వచ్చినప్పుడు "మీకు బుద్ధిలేదండీ" అనేవారు!). ఇక్కడే సంఘర్షణ ఆరంభమైంది హైదరాబాదులో.

స్వభావరీత్యా అన్నయ్య నాన్నగారికి పూర్తిగా వ్యతిరేకం. వాడికి వైజ్ఞానిక పరిశోధన, ఉద్యోగ నిర్వహణ – వీటి మీద ఉన్న ఆసక్తి ఇంటి విషయాల్లో ఉండేది కాదు. అన్నీ వదినే నిర్వహించుకునేది. 'మగపన్లు', 'ఆడపన్లు' – అన్నీ తనే చేసుకునేది. అక్కడే మొదలైంది ఘర్షణ. "చెట్టంత వాణ్ణి నేనుండగా ఆడవాళ్లు అవస్థలు పడటం దేనికి?" అని ఆయన అనుకునేవారు. పైగా రిటైరై ఇంట్లో కూర్చున్నారు. ఉద్యోగ విరమణ తరవాత శేష జీవితాన్ని ఎలా గడపాలన్నది ఒక పెద్ద సమస్య ఎవరికైనా. ఇతరులకు ఎంత వేదాంతం చెప్పినా, తనదాకా వచ్చేసరికి నిర్లిప్తత అలవరచుకోలేక పోవడం ఆయనకి పెద్ద మానసిక బలహీనత అయిపోయింది.

బంగారం నుంచి బంగాళా దుంపలదాకా అన్ని ఖర్చులూ ఆయన చేతిమీదుగా నడవటం ఆయన్ని పెంచి పెద్ద చేసిన మేనత్త పోయినప్పటి నుంచీ అలవాటయింది. ఆయన సంగతి తెలిసి, నాన్నగారికి కొంత ఇంటి ఖర్చు పెత్తనం అప్పజెప్పాడు అన్నయ్య. అయినా ఘర్షణ తప్పలేదు. చినుకు చినుకు గాలివాన అయింది. అంతక్రితం (స్వరాజ్యం రాకముందు) ఇంగ్లండులో రీసెర్చి చేస్తూ గడిపిన మూడేళ్లలో, కొడుకులూ, కూతుళ్లూ సరిగ్గా చూడక నానా అవస్థలూ పడుతున్న వృద్ధుల్ని చూసి, తను మాత్రం తన తల్లిదండ్రులికి ఎప్పటికీ అటువంటి హీనస్థితి, దీనస్థితీ కలుగజెయ్యకూడదని నిశ్చయించుకున్నట్లు మాటల సందర్భంలో చాలాసార్లు వెల్లడించాడు అన్నయ్య.

ఆదర్శం వేరు, ఆచరణ వేరు – నిత్యం ఎదురయే అనుభవాలూ, అనుభూతులూ వేరు. ఇంట్లో యుద్ధాన్ని విరమింపజేసినా, మనశ్శాంతిని సాధించలేకపోయాడు అన్నయ్య.

దైవికంగా ఒక అవకాశం వచ్చింది. పాము చావకుండా, కర్ర విరక్కుండా. అన్నయ్య ఉద్యోగరీత్యా ఉత్తర ప్రదేశానికి తరలి వెళ్ళాల్సి వచ్చింది.

అప్పటికే అన్ని విధాలా హైదరాబాదు అంటే రోత పుట్టిన నాన్నగారు కూడా వేరే ప్రాంతానికి మకాం మార్చడానికి నిశ్చయించుకున్నారు. ఆ విషయమై అమ్మతో తర్జన భర్జనలు జరిగాక, హైదరాబాదులో ఉన్న సొంత ఇల్లు అద్దెకిచ్చేసి, నరసాపురం వెళ్ళిపోయారు.

నేను కూడా ఆఫీసులో ప్రమోషను వచ్చిన మీదట, పని ఒత్తిడిలో నాన్నగారు ఉత్తరాలు రాయకపోయినా పట్టించుకోలేదు. అమ్మ అప్పుడప్పుడు క్షేమ సమాచారాలు రాస్తూనే ఉంది. అక్కడి గొడవలు ఏదో అయోమయంగా రాసినా, నేను పట్టించుకోలేదు.

అన్నయ్య కూడా, ఢిల్లీ వచ్చినప్పుడు, నాతో "నా మనస్సు విరిగిపోయింది" అని చూచాయగా సూచించాడు. నేను గుచ్చి గుచ్చి అడగలేదు.

నాన్నగారూ, అమ్మా నరసాపురంలో స్తిమితపడ్డాక నేను ఉత్తరం రాశాను. మావారి అమెరికా యాత్రా విశేషాలు వర్ణిస్తూ. మళ్లీ నాన్నగారి లేఖారచన ప్రారంభమైంది.

* * *

కొన్నాళ్ల తరువాత ప్రివిలేజ్ లీవ్ తీసుకుని అత్తవారి ఊరు వెళ్లి తిరిగి వస్తూ మధ్యలో నరసాపురం కూడా వెళ్లి ఒకటి రెండు రోజులున్నాను. అక్కయ్య కుటుంబం కూడా ఆ ఊళ్లోనే ఉంది. నాన్నగారూ, వాళ్లూ వేరే వేరే ఇళ్లల్లో ఉంటున్నారు. నేనక్కడ ఉన్న రెండు రోజులూ కీళ్ల నొప్పులతో బాధపడ్డాను. నాన్నగారూ, ఆయన స్నేహితుడొకాయనా నాకు హోమియోపతీ వైద్యం చేశారు. నేను తిరిగి వెళ్లేటప్పుడు నాకు కొన్ని మందులు కూడా ఇచ్చి పంపించారు. ఢిల్లీ చేరుకోగానే ఎలా ఉన్నదీ ఉత్తరం రాయమన్నారు. రాశాను. ఆయన వెంటనే జవాబు రాశారు.

"... నీ విషయంలో కొన్ని వివరాలు స్పష్టంగా తెలుసుకోగోరుతున్నాను.

(1) అలోపతీ వైద్యం కాకుండా హోమియోపతీ వైద్యం తీసుకోవడానికి నువ్వు పూర్తిగా సంసిద్ధంగా ఉన్నావా? దానిమీద నీకు గురి ఉందా?

(2) నువ్వు హోమియోపతీ వైద్యం చేయించుకోవడం మీ ఆయనకు ఇష్టమేనా? అతనికిష్టం లేనట్లయితే ఆ పని చెయ్యొద్దు.

(3) అక్కడేదైనా హోమియోపతీ మందులు దొరికే దుకాణం ఉందా? ఉండే ఉంటుంది. అక్కడ మందులు కొనుక్కోవడానికి నీకు వీలవుతుందా? ఎంచేతనంటే, ఇక్కణ్ణించి పోస్టులో పంపించడం సాధ్యం కాకపోవచ్చు. అక్కడెవరైనా నమ్మకస్తుడైన హోమియోపతీ డాక్టరున్నాడా? ఆయన సలహా తీసుకుని మందులు తీసుకోవడానికి వీలవుతుందా? వెయ్యి మైళ్ల దూరం నుంచి పోస్టు ద్వారా వైద్యం చెయ్యడం ఎల్లప్పుడూ సంతృప్తికరంగా ఉండకపోవచ్చును.

(4) ఇప్పుడు నీకు బాధ కలిగిస్తున్న నొప్పులు ఆ రాత్రి నువ్వు చేసిన ప్రయాణం వల్లనే (రిజర్వేషన్ లేకుండా) వచ్చి ఉంటాయి గాని, "రుస్‌టాక్స్" వాడటం వల్ల కాదు. "రుస్ టాక్స్" కీళ్ల నొప్పులికి చాలా మంచి మందు. దానివల్ల ఏవిధమైన హానీ జరగదు. నొప్పులు కూడా రెండు కారణాల వల్ల ఎక్కువై ఉండవచ్చు. వ్యాధి ముదరడం వల్లనూ, ఆ మందు పనిచేసి ఉండకపోవడం వల్లనూ కావచ్చు. లేదా మందు పనిచేస్తున్న సూచనగా, ముందు నొప్పులు ఎక్కువై క్రమంగా వ్యాధి నయమవడానికి కావచ్చు. ఏమైనా నువ్వు "రుస్‌టాక్స్" వేసుకోవడం ఎలాగూ ఆపివేశావు కదా. "సల్ఫర్" ఇంకొకక్క డోసు మాత్రం వేసుకో. అంతకన్న వద్దు.

ఇంకొక సంగతి కూడా నువ్వు ఆలోచించాలి. హోమియోపతీలో ముఖ్యమైన అంశం ఏమిటంటే, ఇదివరకటి శారీరక బాధలన్నీ అంటే జలుబు, వాపులు, నొప్పులు, మర్మభాగంలో మంట మొదలైనవేమైనా ఉంటే అవి పైకి రావచ్చు. అదీ మన మంచికే. అంటే ఇచ్చిన మందు సరియైనదన్నమాట. అప్పుడిక ఏమీ కలుగజేసుకోనక్కర్లేదు. ఇంకేమందూ, ఏ వైద్యం అవసరం ఉండదు. పాత బాధలేమైనా ఉంటే అవి మళ్లీ మొదలై, కొద్ది రోజులు సతాయించి, తరవాత వాటంతటవే మాయమవుతాయి. అప్పుడు వ్యాధి పూర్తిగా నిర్మూలింపబడుతుంది. ఊరికే నయమవడం, లేక ఉపశమనం కలిగించడం మాత్రమే కాదు.

రోగి, డాక్టరు - ఇద్దరికీ ఓరిమి ఉండాలి. త్వరగా ఫలితాలు కనిపించాలని తొందర పడకూడదు. ఇంజక్షన్ల వల్ల కలిగినట్లు తక్షణ ఫలితాలు కనిపించాలని ఆశించకూడదు. ప్రతి రోగ లక్షణం - మానసికమైన ఉద్రేకాలు, అనుభూతులకు

సంబంధించినదేదైనా విలువైనదే. అనంత సత్యంలో సజీవ విశ్వాసం ఉండటం అత్యవసరం. "సిమిలియా సిమిలియమ్ క్యూరాన్‌టూర్" అంటే ఒక రకమైనది అదే రకమైన మరొక దాన్ని నయం చేస్తుంది. అంటే, ఒక మందు ఒక ఆరోగ్యవంతమైన వ్యక్తికి ఇచ్చినప్పుడు ఏ లక్షణాలు ఏర్పడతాయో, అటువంటి లక్షణాలున్న వ్యాధిగ్రస్తుణ్ణి కూడా నయం చేస్తుంది. అందువల్ల, నమ్మకం, ఓర్పు అత్యవసరం. సోదరులు రావుగారి సలహా కూడా తీసుకుని (దివ్యజ్ఞాన సమాజం వాళ్లు తోటి సభ్యులను సోదరులుగా పేర్కొంటారు) నీకు నా చాతనయినంత వరకు వైద్యం చేస్తాను... వ్యాధి పీడితమైన నీ మూర్తే నా కళ్లముందు కనబడుతోంది.

"యాంటిమోనియమ్ క్రూడమ్" - ఇది చాలా మంచి మందు. ముఖ్యంగా నీకున్న బాధలకి - కీళ్ల నొప్పులు, జలుబు, అరికాళ్ల నొప్పులు, మలబద్ధకం, జిగట విరేచనాలు ఒకదాని తరువాత ఒకటి అవడం మొదలైన వాటికి. అయితే, నాలుక మీద తెల్లని చిక్కని పొర ఏర్పడటం, అతి దాహం వెయ్యడం ఉంటేనే ఈ మందు వాడాలి. నీ విషయంలో ఈ లక్షణం లేదనుకుంటాను కానీ, ఈ మందు 200 పొటెన్సీ పొద్దున్న, సాయంకాలం కొద్ది రోజులపాటు వాడితే గుణం కనిపించవచ్చు. దీర్ఘకాలంగా పీడిస్తున్న కీళ్ల నొప్పులు కూడా ఈ మందు వల్ల నయమైనట్లు చెబుతారు ఈ మందు నీకు నప్పకపోయినట్లయితే, అంటే ఏ విధమైన గుణమూ కనిపించకపోతే, "పల్సటిల్లా" తప్పకుండా ప్రయత్నించవచ్చు. (నాలుక తడి ఆరిపోవడం, దాహం వెయ్యకపోవడం ఉంటే) ఈ మందు నీకున్న బాధలన్నిటినీ కీళ్ల నొప్పులతో బాటు నయం చేసి తీరుతుంది. నువ్వు తక్షణం మూత్ర పరీక్ష చేయించుకోవలసిందిగా సలహా ఇస్తున్నాను. ఇది చాలా అవసరం. అందులో "ఆల్బుమిన్" ఉన్నదేమో కనుక్కోవాలి. మూత్ర పరీక్ష చేయించుకుని ఫలితాన్ని వెంటనే నాకు తెలియజెయ్యి. మూత్రం రంగు, చిక్కదనం, మొదలైన లక్షణాలన్నిటి గురించీ రాయాలి.

అంత అసహనం చూపించకు. అన్ని వివరాలతో పెద్ద ఉత్తరాలు రాయి వ్యాధి లక్షణాలు తెలుసుకోవడం చాలా ముఖ్యం. ఎంత స్వల్పమైన లక్షణమైనా సరే అంత ముఖ్యం కాదేమోననీ, చెప్పుకోవడానికి సిగ్గుచేటనీ అనుకోకు. ఇది సిగ్గు పడవలసిన విషయంగానీ, లేనిపోని సిగ్గుని చూపించాల్సిన విషయం గానీ కాదు. బహిష్టు గురించీ, మర్మావయవాల గురించీ, కామ ప్రవృత్తి గురించీ -

అన్నీ ముఖ్యమైనవే. తండ్రి, కూతుళ్ల మధ్య సిగ్గు పడవల్సిందేమీ లేదు. నాతో స్వేచ్ఛగా మనసు విప్పి చెప్పవచ్చు..."

నేను వెంటనే జవాబు రాయలేదు. ఆయనే మరో ఉత్తరం రాశారు. కోతికి కొబ్బరికాయ దొరికినట్లు, నా వ్యాధి ఆయనకో వ్యాపకం అయింది! అయితే, ఇది ఆయన చాదస్తం మాత్రమే కాదు. హోమియోపతీ వైద్యులు వేసే సవాలక్ష ప్రశ్నల్లో ఎలాంటి రకాలుంటాయో జస్టిన్ జి.డి. ఖోస్లా ఓసారి ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో వ్యాసం రాశాడు. "రాజాజీ స్వతంత్రా పార్టీ పెట్టడం గురించి మీ రియాక్షన్ ఎలా ఉంది?... థియేటర్‌లో ఇంగ్లీషు సినిమాలో హీరో, హీరోయిన్లు రసపట్టులో ఉండగా చూస్తే మీకెలా అనిపిస్తుంది?" లాంటి ప్రశ్నలు వేస్తారని హాస్యంగా రాశాడు.

"... ఏది సరియైన మందో తెలుసుకోవాలంటే రోగి యొక్క నిజమైన సంపూర్ణ స్వరూపం, వ్యాధి లక్షణాలు సమస్తం తెలుసుకోవాలి. రోగి యొక్క శారీరక, మానసిక లక్షణాలు ఉన్నవీ, ఉన్నాయనుకునేవీ అన్నీ తెలుసుకోవాలి. ఇవి మూడు విధాలుగా కనుక్కోవచ్చు. (1) రోగి చెప్పినదాన్ని బట్టి, (2) డాక్టరు అడిగిన ప్రశ్నలకు రోగి ఇచ్చే సమాధానాలు బట్టి (3) రోగి బంధువులు రోగితోబాటు ఉంటూ రోగిని దగ్గర నుంచి గమనించిన దాన్ని బట్టి...

మనిద్దరం ఒక దగ్గర ఉన్నట్లయితే ఇది సాధ్యమయేది. అది వీలు కాదు కాబట్టి, మరో ఉత్తమ మార్గాన్ని ఎంచుకుంటున్నాను. నేనొక ప్రశ్నలపట్టికని పంపిస్తాను. ఆ ప్రశ్నలకి "అవును" అని కాని, "కాదు" అని కాని సమాధానం రాయి. లేదా, ఒకటి రెండు మాటల్లో విడమరచి రాయొచ్చు.

...హోమియోపతీ మీద ఒకటి రెండు పుస్తకాలు నువ్వు చదివితే మంచిదని నా అభిప్రాయం. ఏ పుస్తకాలు చదవాలో నేను చెబుతాను. అవి చదివితే నీకే మందు బాగా నప్పుతుందో నువ్వే నిర్ణయించుకోవచ్చును. నీకు చదివేందుకు తీరిక, ఓపిక లేవు కాబట్టి – నిజానికి అవి చదివితే నీకెంతో లాభించడమే కాకుండా, ఎంతో విజ్ఞానదాయకంగానూ, బోధనాత్మకంగానూ ఉంటాయి. ప్రస్తుతానికి ఈ ప్రశ్నావళి పద్ధతి యోచించాను. జవాబులు నిజంగా, సరిగ్గా, నిజాయితీగా ఉండేట్లు రాసి, కాగితాల్ని తిరిగి నాకు పంపించు. అప్పుడు నేను ఉన్న పరిస్థితిని బట్టి మంధు నిర్ణయిస్తాను. అటువంటి మందు

నీకున్న బాధలన్నిటినీ పూర్తిగా నిర్మూలిస్తుంది. ఇంకేమైనా చెయ్యవలసింది ఉంటే తరవాత చూసుకుందాం.

ప్రతీ ప్రశ్ననీ జాగ్రత్తగా చదివి, సమాధానం సహనంతో రాయి. ఆత్మవంచన, అనవసరపు సిగ్గూ లేకుండా రాయాలి. ఒక క్రిస్టియన్ తన పాపకృత్యాలను ఆఖరిసారిగా నివేదించుకున్నట్లు, భగవంతుని సాక్షిగా చెబుతున్నట్లు సమాధానాలు రాయాలి. అప్పుడే ఆ జవాబులు డాక్టరుకి ఉపయోగపడతాయి. నాతో సహకరిస్తావని ఆశిస్తున్నాను..'' అని రాశారు. అన్నయ్య దగ్గర నుంచి నాన్నగారికి ఉత్తరం వచ్చి ఆరు నెల్లయిందిట. మనియార్డర్లు తప్ప ఉత్తరాలు రావడం లేదని రాశారు. నా అనారోగ్యం ఒక కాలక్షేపం అయింది ఆయనకి. ఆఫీసుకి యధాప్రకారం రోజూ వెళ్ళివస్తూ, ఇంట్లో పనీ, వీధిలో పనీ చేసుకుంటున్నా నేనొక వ్యాధిగ్రస్తురాలినైనట్లు ఊహించుకుని, నా గురించి బాధపడిపోతూ, నాకు రాసే ఉత్తరాల నిండా మందుల గురించీ, వ్యాధి లక్షణాల గురించీ రాస్తూండేవారు. నాన్నగారిని సంతృప్తి పరచడం కోసం మధ్య మధ్య జవాబులు రాసేదాన్ని ఎలాగో తీరిక చేసుకుని.

కొంతమంది తల్లితండ్రులు దీనావస్థలో ఉన్నట్లు ప్రవర్తించి, పిల్లల జాలి పొందాలని తాపత్రయపడుతూ ఉంటారు. తమ పిల్లల మీద జాలి, శ్రద్ధ చూపించడం, లేదా, పిల్లలు తమపై జాలిపడేట్లు, శ్రద్ధ చూపించేట్లు ప్రవర్తించడం – రెండూ తల్లితండ్రులు పిల్లల్ని ఆకట్టుకోవడానికే. ఎదిగిన పిల్లలు మానసికంగా దూరమైపోవడం తల్లితండ్రులు వృద్ధాప్యంలో తట్టుకోలేరు. వారి మధ్య అనుబంధం సన్నగిల్లడం సహించలేరు. పిల్లలు చిన్నతనంలో తల్లితండ్రుల మీద శారీరకంగా, మానసికంగా ఆధారపడినట్లు, పిల్లలు ఎదిగిన తరువాత తల్లితండ్రులు వారిపైన ఆధారపడతారు. ఒక్కొక్కప్పుడు వారికి తెలియకుండానే ఆధారపడతారు. కానీ ఆ సంగతి నాన్నగారు ఒప్పుకోరు తన విషయంలో.

"... నేను నరసాపురం వచ్చాక మీ చెల్లెలు ఒక్క ఉత్తరం కూడా రాయలేదు నాకు. నేను నిష్ఠురంగా రాశానని ఎలా జవాబు రాసిందో చూడు – నాకు ఎవ్వరికీ ఉత్తరాలు రాయాలని లేదు. అందుచేత రాయడం లేదు. ఏమీ అనుకోవద్దు. దాని ధోరణి చూడు! దాంతో నేనేం చేసేది? హోమియోపతీ వైద్యం చేసి దానికీ కొంత ఉపశమనం కలిగించాలనుకోవడం నేను మానెయ్యాలన్నమాట. రోగి సహకారం లేకుండా నేనేం చెయ్యగలను? ఎవరి కర్మ ఎలా ఉంటే అలా

జరుగుతుంది. నాకేం విచారం లేదు. నేను ఉత్తరాలు రాయకుండా ఊరుకోగలను.."

నేను తరుచు ఉత్తర ప్రత్యుత్తరాలు రాయడం జరుపుతున్నానంటే ఒకరితో అనుబంధం ఏర్పరచుకోవాలని కాదు. నా పని నేను చురుకుగా చాకచక్యంగా చెయ్యాలనుకోవడం వల్ల మాత్రమే.. నేను పనిచేసే తీరే అంత. దానికి ఎవరూ ఏంచెయ్యలేరు. మీ చెల్లెలికేమైనా అయితే నేనేమీ బాధపడను. ఎవరి కోసమూ ఒక కన్నీటి చుక్క కూడా కార్చను. నేను మానసికంగా నిర్లిప్తంగా ఉంటాను. ఎవరితోనూ ఎటువంటి అనుబంధమూ లేదు. భార్యతోగాని, పిల్లలతోగాని, మరెవరితోగాని. నేను ఒంటరిగా ఎక్కడైనా ఉండగలను. కానీ, ఎవరికైనా సహాయం అవసరమైతే వారికి నాచాతనైన సేవ చెయ్యడానికి నేనెప్పుడూ సంసిద్ధంగా ఉంటాను. సేవ చెయ్యడం నాకిష్టం... మీ అన్నయ్య ఉత్తరాలు రాయడానికి తీరిక లేనంతగా పనిచేస్తూ ఉండి ఉంటాడు. నేను ఉద్యోగ నిర్వహణ చేస్తూ, థియొసాఫికల్ సొసైటీకి సంబంధించిన కార్యకలాపాలతోబాటు ఎన్నో బాధ్యతలు నిర్వర్తిస్తున్నప్పుడు కూడా ఉత్తరాలు రాయడానికి నాకెప్పుడూ సమయం దొరికేది ఉత్తరానికి జవాబు రాయడానికి 48 గంటల కన్న ఎక్కువ సమయం నేనెప్పుడూ తీసుకోలేదు. ."

నాన్నగారి మనస్సుకి నేను కూడా కష్టం కలిగించకూడదని, వెంటనే జవాబు రాస్తే, మళ్లీ తిరుగుటపాలో ఉత్తరం వచ్చింది.

"... దీనితోబాటు 'శాంగ్వినేరియా' మాత్రలు కొన్ని పంపిస్తున్నాను. అవి నీ [illegible]నొప్పి తగ్గటానికి. ఇక్కడ తెలిసిన ఒకాయన భార్యకి కుడిభుజంలో విపరీతమైన నొప్పి వచ్చి బాధపడుతూండేదిట. చెయ్యి ఎత్తలేకపోయేదిట. గత తొమ్మిది నెలలుగా అలా బాధపడుతోందిట. నిన్న ఉదయం ఈ సంగతంతా నాతో చెప్పింది. నిన్న సాయంత్రం "శాంగ్వినేరియా" నాలుగు డోసులు ఆవిడ చేతికిచ్చాను. రాత్రి ఒక డోసు వేసుకుందిట. ఈ ఉదయం నన్ను నవ్వుతూ పలకరించి కృతజ్ఞతలు తెలిపింది. నిన్నరాత్రి బాగా నిద్రపట్టిందిట. ఒక్కడోసుతోనే ఎంతో తేలిగ్గా ఉందని చెప్పింది. నాకు ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. నీక్కూడా అటువంటి ఉపశమనం కలుగుతుందని ఆశిస్తున్నాను. ఆ మాత్రల్ని చేత్తో తాకడంగాని, నేలమీద ఒలకపొయ్యడంగాని చెయ్యకూడదు. కొద్దిరోజులపాటు ఉదయం, సాయంకాలం, మూడు, నాలుగు మాత్రల చొప్పున వేసుకో. మంచి

ఫలితాన్నిస్తే, నువ్వే 'శాంగ్వినేరియా' 200-1 డ్రాం కొనుక్కుని నొప్పి పూర్తిగా పోయేవరకూ వాడుతూ ఉండు. తరువాత ఆపేసెయ్యి. ఈ మాత్రలు వేసుకుంటున్నప్పుడు "రుస్‌టాక్స్" తీసుకోవడం ఆపెయ్యాలి.

నేను మొదట్లోనే నీకు 'శాంగ్వినేరియా' ఇవ్వాలనుకున్నాను. కానీ, నీకు మోకాలి నొప్పి కూడా ఉండటం వల్ల, సోదరులు రావుగారి సలహా తీసుకుని 'రుస్‌టాక్స్' ఇచ్చాను. ఇప్పుడీ కొత్తమందు ప్రయత్నించి చూడు.

ఒక్క విషయం – ఈ మందు వ్యాధి నివారణకై తీవ్రగతిలో పనిచెయ్యదు. మెల్లిగా పైపైన పని చేస్తూ ఉపశమనం కలిగిస్తుంది. నీ జలుబు బాధ కూడా దీనివల్ల నయం కావచ్చు. నీకోసం నేను నా శాయశక్తులా కృషి చేస్తున్నాను. నీకు అనేక బాధలున్నాయి. అన్నింటికీ జాగ్రత్తగా వైద్యం చెయ్యాలి. దానికి కొంత వ్యవధి పడుతుంది. త్వరగా ఫలితాన్నివ్వాలనుకోకూడదు. తక్షణం ఫలితాన్నిచ్చేవి ఆట్టేకాలం పనిచెయ్యవు. అంతకన్న మెల్లిగా నిదానంగా పనిచెయ్యడమే మంచిది. మనం – అంటే, నువ్వూ, నేనూ సహనం కలిగి ఉండాలి. మందువల్ల ఎటువంటి మార్పులొస్తున్నాయో మెలుకువతో గ్రహించి, ఆ మార్పులన్నిటినీ నాకు తెలియజెయ్యాలి నేను ఒక్కటే కోరుతున్నాను. వారానికోసారి సెలవురోజున అన్ని వివరాలతోనూ ఉత్తరం రాయమని. అప్పుడే నేనేదైనా నీకోసం చెయ్యగలుగుతాను. నేను పొరపాటు పడవచ్చు. కానీ, చిత్తశుద్ధితోనే ప్రవర్తిస్తున్నాను.

'శాంగ్వినేరియా' ఉపశమనం కలిగించినట్లయితే, అది ఆపేసి, 'థూజా 200' ఒక డోసు (నాలుగైదు మాత్రలు) 25 లేక 30 రోజులకోసారి పుచ్చుకోవచ్చు. అక్కడ ఏదైనా హోమియోపతీ మందులషాపు కెళ్లి 'థూజా 200' 1 డ్రాం కొనుక్కుంటే మంచిది. దాని ఖరీదు అర్ధరూపాయో, ఎంతో – అంతకన్న ఉండదు. థూజా నీకు ఎన్నో విధాల మంచి చేయవచ్చు.

ఈలోపున నువ్వు కారం తినడం మానెయ్యాలి. మీ ఆయన కారం బాగా తింటాడనుకుంటాను. నీక్కూడా అలవాటయి ఉంటుంది. నువ్వు కారం మానెయ్యనైనా మానెయ్యాలి, లేదా, బాగా తగ్గించనైనా తగ్గించాలి. అది చాలా అవసరం. మలబద్ధకాన్ని కలిగించే బంగాళ దుంపలు, మొదలైన వాటిని తరుచు తినకుండా ఉండాలి. ఆకు కూరలు, తాజాకూరలు, పళ్లు–రసం గల

పళ్లూ ఆరోగ్యానికి చాలా మంచివి. మూలశంక, మలబద్ధకం మొదలైన వ్యాధుల విషయంలో ఆహారం చాలా ముఖ్యపాత్ర వహిస్తుంది. నీ బాధల గురించి జాగ్రత్తగా యోచించి, పుస్తకాలు జాగ్రత్తగా చదివాక, కొద్దిరోజులు పోయిన తరవాత నీకు మళ్లీ రాస్తాను...

నరసాపురంలో వాతావరణం చాల్లగా హాయిగా ఉంది. కానీ, రాజమండ్రిలోలాగే ఇక్కడ కూడా ఘోరంగా వ్యాపించిన ఫైలేరియా చూస్తేనే నాకు విచారంగా ఉంది. లేకపోతే, ఇక్కడ ఇంకే బాధా లేదు''.

* * *

జవహర్‌లాల్ నెహ్రూ అస్తమించారు. శవయాత్ర చూడటానికి నేనూ, నా మరిదీ కలిసి ఇండియాగేటుకి వెళ్లాము. ఎండలో గంటల తరబడి కూర్చున్నాం పేవ్‌మెంటు మీద. కోటుకి పెట్టుకున్న ఎర్ర గులాబీతో పోటీపడుతూ కుసుమ కోమలంగా, మనోహరంగా ఉండే నెహ్రూ పూలశకటం మీద కట్టెలా పడుకుని మండుటెండలో, వెడుతూంటే చూసి కళ్లనీళ్లు తిరిగాయి. కళ్లు తిరిగి పడిపోయాడు మా మరిది.

ఆ విశేషాలన్నీ నాన్నగారికి ఉత్తరంలో రాశాను. ఆయన కూడా తీవ్రంగా స్పందిస్తూ తిరుగుటపాలో ఉత్తరం రాశారు.

''... ఢిల్లీలోనూ, దేశమంతటా అంతా దుఃఖంలో మునిగి ఉన్నారు. గుణగణాలను కీర్తించడం, సమావేశాలూ, ఉపన్యాసాలూ, వ్యాసాలూ – ఇవన్నీ మనకి కావలసినవన్ని! గాంధీగారు పోయినప్పుడు కూడా ఇలాగే జరిగింది. కానీ, సత్యం, అహింస – వీటినే మొట్టమొదటగా అందరూ విసర్జించేది – ముఖ్యంగా కాంగ్రెసు వాళ్లు. ప్రతి వీధి చివరా కనిపించే ఆయన విగ్రహం వెక్కిరింపుకి గురికావడానికే. క్రమశిక్షణ లేకపోవడం, పార్టీలలో, ప్రభుత్వ శాఖలలో పోట్లాటలు, అవినీతి, ధనంకోసం, పదవి కోసం దురాశ – అన్ని దురాచారాలూ పెచ్చు పెరిగి పోయాయి. గాంధీగారి ఆదర్శాలలో ఒక్కదాన్ని కూడా గౌరవించి ఆచరణలో పెట్టడం లేదు. చరిత్ర పునరావృతం అవుతుందా?

నెహ్రూగారు (ఏవో కొన్ని పొరపాట్లు చేసినా) ఉత్తమ మానవతా మార్గంలోనే నడిచారు. మానవుని ఔన్నత్యానికీ, ఉదాత్తతకీ ప్రతీకగా నిలిచారు. ఆయన అత్యంత ఉత్తముడు. ఎవ్వరినీ శిక్షించలేనంత అత్యంత ఉదాత్తత, ఔదార్యం

కలవాడు. శిక్షించవలసిన ఆవశ్యకత, అవసరం ఉన్నప్పటికీ, శిక్షించలేకపోవడమే నెహ్రూగారి బలహీనత. ఆయన జీవన విధానంలోనూ, ఆచరణలోనూ కూడా నిజమైన తత్త్వవేత్త – "జీవిత పయనం బరువు మోత లేకుండా తేలిగ్గా సాగాలి. ఒక చిన్న స్థలానికో, భవనానికో, మరో దానికో ముడిపెట్టుకుని బ్రతకడం ఘోరం. నిజం చెబుతున్నాను. నేను ఆస్తిపాస్తులుండాలని ఎప్పుడూ అనుకోను" అని పార్లమెంటులో మాట్లాడుతూ అన్నారొకసారి. నేనిచ్చిన థియొసాఫికల్ ఉపన్యాసాల్లో ఈ అంశాన్ని ఆధారంగా చేసుకునే మాట్లాడాను.

జినరాజదాసా గారొకసారి అన్నారు. "జవహర్ లాల్ నెహ్రూని తొందరపడి విమర్శించకండి. ఆయన దేహంలో ఎంతటి మహనీయాత్మ వసిస్తున్నదో మీకు తెలియదు. ఆయనకున్న అవగాహన, సానుభూతి స్థాయిని అందుకోవడం మనలో చాలామందికి ఎంతో కష్ట సాధ్యం" అని.

అప్పుడప్పుడు నెహ్రూవల్ల పొరపాట్లు జరిగినా, ఆయన్ని నేను అపరిమితంగా ప్రేమించాను, గౌరవించాను, ఆరాధించాను. ఆయన వ్యక్తిత్వం సాధారణ మానవుడు అంచనా వెయ్యలేనంత ఉన్నతమైనది, బ్రహ్మాండమైనది. ఈ కాంగ్రెసు మహానుభావులు ఎలా ప్రవర్తిస్తారో, ఆయన ఆదర్శాలకూ, ఆశలకూ అనుగుణంగా ఎంతవరకు జీవించగలుగుతారో చూడాలి. నినాదాలు చేయడం సులభమే, కాని, జీవితంలో ఆచరించడం ఎంతో కష్టం. మనకీ, మన దేశానికీ ముందు ముందు ఏంరాసిపెట్టి ఉన్నదో చూద్దాం!

ఇక్కడ ఎండలు విపరీతంగా ఉన్నాయి. గత పదిహేను రోజుల నుంచీ నేను బనీనుగాని, లాల్చీగాని వేసుకోవడం లేదు. ఇంట్లో అంగవస్త్రం కట్టుకుని ఉంటున్నాను. బయటికి వెళ్లినప్పుడు ధోవతి కట్టుకుని కండువా వేసుకుంటున్నాను. ఈ ఉక్క, చమటా భరించలేకుండా ఉన్నాను. ఇక్కడ కాలవలు కట్టేసిన తరవాత త్రాగడానికి నీళ్లు లేవు. దూరాన ఉన్న బావుల దగ్గరకు వెళ్లి మంచినీళ్లు తెచ్చుకోవాలి. చాకలివాళ్లు మూడువారాలపాటు బట్టలు ఉతకరు. లాండరీవాళ్లు బట్టకి మూడు, నాలుగు అణాలు అడుగుతారు. నావంటి వాడికి ఇది చాలా దుర్భరం. కానీ ఏం చెయ్యగలను? ఈ ఎండల్లో పుస్తకం ముట్టుకోలేకపోతున్నాను. భగవంతుడనేవాడు నిజంగా ఉంటే, నన్ను తీసుకుపోయి ఉండవలసింది – మన ప్రధానిని తీసుకుపోవడానికి బదులు. నాలాంటి ముసలివాళ్ల వల్ల ప్రయోజనం ఏముంటుంది?..."

నాన్నగారికి అప్పటికి 70 సంవత్సరాల వయస్సు. మరో ఉత్తరంలో ఇలా రాశారు :

"... టెంపరేచర్ కొన్ని డిగ్రీలు పడిపోయినా, ఇంకా ఉక్క, చికాకూ తగ్గలేదు. మీ అమ్మగారికోసం 160 రూపాయలు ఖర్చుపెట్టి టేబుల్ ఫేన్ కొన్నాను. దాన్ని నేను మాత్రం వాడను. ఈ జీవితంలో అటువంటి సుఖాలను పొందను. నా జీవన విధానం వేరు.... మీ అన్నయ్య దగ్గర నుంచి నెల నెలా మనియార్డర్లు తీసుకుంటూ, మీ అన్నయ్య మీద ఇంకా భారంగా ఉండటం నాకు సిగ్గుచేటుగా ఉంది. నిజానికీ లోకం వదిలిపెట్టి పోయి మీ అన్నయ్యకి భారం తప్పించాలని ఉంది. మరొకరి మీద ఆధారపడుతూ ఇటువంటి అధమస్తపు బ్రతుకు బ్రతకడానికి నిజంగా సిగ్గు పడుతున్నాను. కానీ, ఆత్మహత్య చేసుకోలేను - అది బుద్ధి తక్కువ పని. ఏంచెయ్యాలో నాకు తెలియడం లేదు!...."

మీరింకా 20 సంవత్సరాలపాటు ఇలాగే బ్రతుకుతారు - తప్పదు - అని ఎవరైనా జ్యోతిష్కుడు అప్పుడాయనకు చెప్పి ఉంటే, ఆ జ్యోతిష్కుణ్ణి ఏమీ చెయ్యలేక నెత్తి మొత్తుకుని ఉండేవారనుకుంటాను. కోపం వచ్చినప్పుడు నెత్తి మొత్తుకోవడం అలవాటే. నాన్నగారికి జాతకాలపైన నమ్మకం ఉంది. చిన్నప్పటి నుంచీ జాతకాలు చూడటం అలవాటు. కానీ, భగవంతుడు, భక్తి, పూజలు - వీటి మీద నమ్మకం సడలిందనె చెప్పాలి ఆయన ప్రవర్తనలో వచ్చిన మార్పుని బట్టి. అన్నయ్య ఇంగ్లండునుంచి పి.హెచ్.డి. తీసుకుని వచ్చేవరకూ నాన్నగారు నుదుట నామం పెట్టుకోవడం, జపం చేసుకోవడం, తద్దినాలు పెట్టడం వంటి ఆచారాలు పాటించేవారు దివ్యజ్ఞాన సమాజంలో సభ్యుడైనప్పటికీ.

అన్నయ్య ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చాక, ఇద్దరి మధ్యా చర్చలు జరుగుతూండేవి. అచార వ్యవహారాల మీద, ఆస్తికత్వం మీద, కమ్యూనిజం మీద, సోషలిజం మీదా. అన్నయ్య ఇంగ్లండు వెళ్లగానే జంధ్యం తీసేశాడు. సైంటిస్టు అవడంతోబాటు, సోషలిజం, హేతువాదం పట్ల అవగాహన, అభిమానం ఏర్పడడంతో మన ఆచార వ్యవహారాలన్నిటినీ మూఢమైనవిగా చూడటం అలవరచుకున్నాడు.

వంశోద్ధారకుడి వ్యవహారం గమనించారు. "ఎదుటివారిని మార్చలేకపోతే, వారితో చేరిపోవాలి'" అన్న సూత్రాన్ని పాటించారు నాన్నగారు. ఆయన కూడా

జంధ్యం తీసేశారు. నామం పెట్టుకోవడం మానేశారు. మడి కట్టుకొవడం మానేశారు. తద్దినాలు పెట్టడం మానేశారు. హేతువాదిగా, మానవతావాదిగా మిగిలారు. గత పదిహేను సంవత్సరాలుగా అదే విధంగా ఉన్నారు. దానికి తోడు వేదాంత దృక్పథం.

మా అక్క కొడుకు పరీక్ష తప్పాడుట. బి.ఎ. పరీక్షలో ఒక పార్టు మాత్రమే పాసై తక్కిన పార్టులు రెండూ తప్పాడుట. ఆ విషయాన్ని నాకు తెలియ బరుస్తూ –

"... అక్టోబరు పరీక్షల్లోనైనా విజయాన్ని ప్రసాదించమని వేడుకోవడానికి కాబోలు తిరుపతి వెళ్లాడు తల్లితో కలిసి... మూఢ విశ్వాసాలకూ, తెలివి తక్కువ తనానికీ అంతులేదు. దైవం, భక్తి, వ్యాపార విషయాలైపోయాయి. బేరాలు చెయ్యడం జరుగుతోంది దేవుడితో – నువ్వు నాకు పాసవుతాననీ, పిల్లలు పుడతారనీ, ఉద్యోగం దొరుకుతుందనీ, ట్రాన్స్‌ఫర్ అవుతుందనీ, లేక మంత్రి పదవి లభిస్తుందనీ వరమియ్యి – బదులుగా నేను నీ గుడికి వచ్చి నిన్ను దర్శించుకుంటాను, నా జుట్టు కూడా ఇచ్చుకుంటాను. (అది మళ్లీ పెరుగుతుందని కచ్చితంగా తెలుసు నాకు) – అంటారు భక్తులు – దైవభక్తులు. దేవుడు ఎంత వెర్రి వెంగళాయి, ఎంతగా పొగడ్తలకి లొంగిపోయేవాడు, ఎంత అమాయకుడు, పసివాడు – వాళ్లు సమర్పించుకునే కానుకలకు తబ్బిబ్బైపోయి వాళ్లు కోరినవన్నీ తక్షణం తీర్చేస్తాడు! మనం ఎంత ఘోరమైన దుస్థితికి దిగజారిపోయాం!

జిడ్డు కృష్ణమూర్తిగారు 30 సంవత్సరాలనుంచీ ప్రబోధిస్తూ ప్రసంగాలు చేస్తున్నా ఏంప్రయోజనం? జనానికి ఎప్పటికైనా వివేకం కలుగుతుందా? ఈ మూఢ విశ్వాసాలను ఎన్నటికైనా అధిగమించగలుగుతాం? మీ అమ్మగారు, అక్కయ్య – వాళ్ల మూర్ఖత్వానికి జాలివేస్తుంది. రాబోయే నా పుట్టినరోజుకి (అప్పటి వరకూ నేను బ్రతికి ఉంటే) నాకోసం ఏ పుస్తకాన్నిగాని, మరే బహుమతినిగాని పంపించకు. నీ ప్రేమ పూర్వక శుభాకాంక్షలు చాలు. కృష్ణమూర్తిగారి పుస్తకాలూ, హోమియోపతీ పుస్తకాలూ తప్ప ఇంకే పుస్తకం చదవాలని లేదు. నీ డబ్బు వృథా చేయకు. నా కోరికని మన్నించు...

చుట్టుపక్కల కుర్రాళ్లు ఎంతోమంది వచ్చి నా సహాయాన్ని కోరుతూ ఉంటారు – నన్ను పాఠాలు చెప్పమని. వాళ్లతో నాకు తీరిక ఉండటం లేదు

వేదాంత గ్రంధాలు గాని, మరే ఇతర పుస్తకాలుగాని చదవాలని అనిపించడం లేదు. ఊరికే చదివి ఏంలాభం ?...

మీ మరుదులు అక్కడే ఉన్నారనుకుంటాను. వాళ్ళకి ఢిల్లీ అంటే ఎంత ఇష్టం!! నాకు ఢిల్లీ వెళ్లాలంటేనే భయం. ఢిల్లీమాట తలుచుకుంటేనే నాకు కంపరం కలుగుతుంది! ఆ అద్భుత స్థలాన్ని చూసే యోగం పట్టకుండా భగవంతుడు నన్ను రక్షించుగాక! ఇక్కడ ఇంతవరకు ఒక్క వర్షం కూడా కురవలేదు. దుర్భరంగా ఉంది ఎండాకాలం..."

పుట్టినరోజు సందర్భంగా గ్రీటింగ్స్ టెలిగ్రాం పంపినందుకు నన్ను కోప్పడుతూ, ఇంకా ఇలా రాశారు.

"... అసలు మా వంశంలో ఏ మగవాడూ 70 సంవత్సరాల వయస్సుదాకా జీవించి లేరు. నేను ఇంతకాలం పాటు ఉంటానని ఎప్పుడూ ఊహించలేదు. ఎంతోమంది జ్యోతిష్కులు 68 సంవత్సరాలకు మించి బ్రతకనన్నారు. కాని ఈ శరీరానికిప్పుడు 70 సంవత్సరాలు నిండాయి....

ఈ "నేను" అంటే ఎవరు? "నేను" అంటే ఈ శరీరం కాదని నువ్వు అంగీకరిస్తావనుకుంటాను. ఉపనిషత్తుల్లో ఆత్మ గురించీ, పరమాత్మ గురించీ ఎంతో వివరించి ఉన్నప్పటికీ, నాకెప్పుడూ అది ఎదురు పడలేదు. కానీ, నా మనస్సు నాకు తెలుసు.

"స్వము" అంటే "అహం" – తనకు తాను మానసికంగా ఆపాదించుకున్న పరిధులు – దేశం అనీ; జాతి అనీ, కులం అనీ, శాఖ అనీ, వంశం అనీ, ఇవికాక, కూడబెట్టుకున్న గతం – గతంలోని అనుభవాలూ, సుఖాలూ, దుఃఖాలూ, పడ్డ అవస్థలూ, సాధించిన విజయాలూ, ఎదుర్కొన్న అపజయాలూ, అవమానాలూ, నష్టాలూ మొదలైనవెన్నో....

మనస్సునుంచి గతాన్నీ, మానసికంగా ఏర్పరచుకున్న పరిధుల్నీ తొలగించివేసినట్లయితే – అంటే, మానసికంగా గతం నశించింది అనుకుంటే, మనస్సు నిశ్చలంగా ఉంటే, మనస్సుపైన గతం యొక్క ప్రభావం గాని, భారం గాని లేకుండా ఉన్నట్లయితే – "తను" అనేదిగాని "నేను" గాని ఉండదు. గతం అంతమయిందని అనుకుంటే అనంతమైన వర్తమానంలో జీవించవచ్చు.

కఠోపనిషత్తులో నచికేతునిలాగ సజీవంగా, పూర్తిగా మెలుకువగా, చైతన్యంతో ఉన్నప్పుడే మరణాన్ని అనుభవంలో పొందవచ్చు.

... జీవితం యొక్క ధ్యేయం ప్రప్రథమంగా జీవించడమే, రెండవది మనస్సు తనకు తాను విధించుకున్న బంధనాలను అధిగమించడం. దీక్షవల్లగాని, శిక్షణ వల్లగాని మనస్సుని నిశ్చలంగా చెయ్యలేం. బలవంతాన దాన్ని నిర్మూలించడం సాధ్యం కాదు. నిర్లిప్తంగా, వివక్ష లేకుండా గమనిస్తున్నప్పుడే మనస్సు నిశ్చలమవుతుంది. మనస్సు తనలోని చైతన్య స్రవంతులన్నిటినీ నిర్వికారంగా గమనిస్తున్నప్పుడు మనస్సు నిశ్చలమవుతుంది. ఆ నిశ్చలత అనుభవంలోకి రావాలి. వర్ణించడానికి వీలులేదు. దాన్ని ఏ పేరుతో పెట్టి పిలిచినా సరే – దాన్ని సత్యం అన్నా, దేవుడు అన్నా, అనంతం అన్నా, బ్రహ్మం అన్నా సరే. ఆ స్థితి మనస్సుకన్న ఉన్నతమైనది, అతీతమైనది. మనస్సుతో దాన్ని అందుకోలేరు ఎంత ప్రయత్నించినా....

మీ ఆడబిడ్డకి ఢిల్లీలో ఉద్యోగం వచ్చినందుకు సంతోషం! ఆ ఢిల్లీ మహా నగరం అంటే మీకందరికీ ఎందుకంత మోజో నాకర్థం కాదు!"

నాన్నగారు తన పుట్టిన రోజుకి టెలిగ్రాంకూడా పంపవద్దంటూనే, నా పుట్టినరోజుకి ప్రతి ఏడూ డబ్బు మనియార్డరు చేసేవారు. సంపాదనపరురాలినైన నాకు నాన్నగారు డబ్బుపంపడం – అందులోనూ ఆయనే ఒకరి మీద ఆధారపడి ఉంటూ – నాకు నచ్చలేదు. ఆ డబ్బు తీసుకోవడానికి నాకు చాలా మొహమాటంగా ఉండేది. ఈసారి ధైర్యం చేసి రాసేశాను ఇంకెప్పుడూ అలా డబ్బు పంపించవద్దని. వెంటనే ఉత్తరం రాశారు.

... నా మనస్సులో ఏముందో నీకు చెప్పదలుచుకున్నాను: ఎదుటి వారి మనస్సుని సరిగ్గా అర్థం చేసుకోవడం చాలా చాలా కష్టం. సానుభూతితో, సహనంతో అవగాహన చేసుకోవడం మరింత కష్టం. నువ్వు చదువుకున్న స్త్రీవి కాబట్టి, తక్కిన వారికంటె బాగా అర్థం చేసుకోగల వనుకుంటాను. కన్నతండ్రిగా, నేను బ్రతికున్నంతకాలం కూతుళ్ళకి ప్రతిసంవత్సరం కొత్త బట్టలకోసం కొంత డబ్బు ఇవ్వాలని నా ఉద్దేశం. నేనిచ్చేది చాలా కొంచెం – నామమాత్రమే. మీఅమ్మగారికి కూడా ఏడాదికోసారి చీరలకి ఇవ్వాలి. నాకు కావలసినది చాలా తక్కువ. నామీద నేను చేసుకునే ఖర్చు అతిస్వల్పం. నేను బ్రతికున్నంత

కాలం నీకు డబ్బు పంపించకమానను. నువ్వుకాదనలేవు. కాదనడానికి వీల్లేదు. నన్ను సంతోషపెట్టడానికైనా నువ్వు తీసుకు తీరాలి."

మళ్ళీ ఢిల్లీ ప్రసక్తి తీసుకొచ్చారు ఉత్తరంలో.

"... మీ నీళ్ల సమస్య గురించి పేపర్లో చదువుతున్నాను. "మంచి నీళ్లలో తేలు" మొదలైన వాటి గురించి లోక్‌సభలో చర్చలూ, వగైరా. ఢిల్లీ జీవితం అంటేమోజుపడే మిమ్మల్ని చూస్తే జాలివేస్తోంది నాకు. ఢిల్లీనుండి నన్ను దైవం రక్షించుగాక!..."

ఆ ఏడు శీతాకాలంలో జిడ్డు కృష్ణముర్తి గారు ఢిల్లీలో మూడు రోజులు ఉపన్యాసాలిచ్చారు. ఆవిషయం పేపర్లో చూసి నాన్నగారు నాకు రాశారు.

".... నువ్వు కృష్ణమూర్తిగారి ప్రసంగాలు వినడానికి వెళ్లావే లేదో తెలియదు. నువ్వు వెళ్లి వినలేదంటే నేను చాలా విచారిస్తాను. బుద్ధ భగవానుని తరువాత ఈ భూమి మీద అవతరించిన మహోత్తమ విశ్వబోధకుడాయన. ఆయన బోధనలు ఒక నూతన మేధస్సునీ, ఒక నూతన సమాజాన్నీ, ఒక నూతన జాతినీ సృష్టించడానికి ఉద్దేశించినవి. ఈ సమాజంలోనుంచి బయటపడాలి (మానసికంగా) - ఆయన్ని అవగాహన చేసుకోవడానికీ, ఆయన్ని అనుసరించడానికీ. డిసెంబరులో మద్రాసు వెళ్లి ఆయన్ని ఒకసారి చూడగలిగితే బాగుండునని ఉంది..."

నాన్నగారు అనుకున్నట్లుగా మద్రాసు వెళ్లలేకపోయారు. ఈలోగా అమ్మ పుట్టపర్తి వెళ్లిందిట.

".... మీ అమ్మగారూ, మరో ముగ్గురు బాదరా బందీలేని ఆడవాళ్లూ కలిసి వారం రోజుల క్రితం పుట్టపర్తికి వెళ్లారు. శ్రీ సత్యసాయిబాబా గారిని చూడటానికి. వారం పది రోజులదాకా తిరిగి రారు. బహుశా "మనశ్శాంతి" కోసం వెళ్లి ఉంటారక్కడికి - అదేదో బజార్లో కొనుక్కునే వస్తువైనట్లు! తీరాచేసి, అక్కడేవో మహిమలు చూసి, యథాప్రకారం నిరుత్సాహంగా ఇంటికి తిరిగి వస్తారు. యాత్రల వల్లా, పూజలవల్లా, జపాలవల్లా మనశ్శాంతి పొందగలరా? ఆత్మజ్ఞానం లేకుండా - మనశ్శాంతి ఎందుకు లేదో, కలత, ఆందోళన ఏ కారణాల వల్ల కలుగుతున్నాయో తెలుసుకోకుండా మనశ్శాంతి లభిస్తుందా ఎవరికైనా? అజ్ఞానం ఉన్నంతవరకూ శాంతి లభించదు" అని రాశారు నాకు.

నాన్నగారు ఆ మధ్య మూడుసార్లు రాజమండ్రి వెళ్లి వచ్చారుట. "గత ఒకటిన్నర సంవత్సరాల్లో సలహాలివ్వడం ద్వారా బాగానే సంపాదించానని చెబితే ఆశ్చర్యపోతావేమో!!! నేను నా వృత్తిని విరమించుకున్నా కొంతమంది పాతకేసుల వాళ్ళూ, ఇంకా కొందరూ నా సలహాలు తీసుకుని అడక్కుండానే డబ్బు ముట్ట చెబుతున్నారు" అని రాస్తే నిజంగానే ఆశ్చర్యబోయాను నేను.

మధ్య మధ్య మా బంధువుల గురించి వివరాలు రాస్తూండేవారు నాకు. ఎవరెలాపోతే నాకెందుకు అని నిర్లిప్తంగా, తామరాకు మీద నీటిబొట్టులా ఉండేరకం కాదు నాన్నగారు. చిన్నప్పుడు మా ఇంట్లో బంధువుల పిల్లలేకాక, వారాలబ్బాయిలు కూడా ఎంతోమంది వచ్చి మా ఇంట్లో భోంచేసి, నాన్నగారు చేసే ధన సహాయంతో చదువుకునే వారు. ఎన్నో కుటుంబాలను ఆదుకున్నారు. ఇప్పుడు కూడా, దగ్గర బంధువుల్లో కొందరు దుస్థితిలో ఉండటం చూసి - ముఖ్యంగా చదువుకుంటున్న వయస్సులో ఉన్న కుర్రవాళ్లని చూసి చాతనయిన సహాయం చెయ్యడం మానలేదు. "ఫలానా వాళ్లకి మీరు కూడా కాస్త ధనసహాయం చేస్తే బావుంటుందని" నాకూ, అన్నయ్యకూ కూడా రాస్తూండేవారు. మేము ఆయన మాట ఎప్పుడూ కాదనలేదు ఈ విషయంలో.

"మీ అమ్మగారు పుట్టపర్తి వెళ్లి 50 రోజులైంది. ఇంతవరకు రాలేదు మీ అక్కకి కూడా ఒక్క ఉత్తరం రాయలేదు. స్త్రీ స్వేచ్ఛ!!!" అంటూ రాశారు. నాన్నగారు స్వయంగా వండుకు తినేవారు అమ్మ లేనప్పుడు.

"ఇంకొకరిపై ఆధారపడటం కన్న నికృష్టమైనది మరొకటి ఉండదు. కాదంటావా? నేను ప్రతినెలా మీ అన్నయ్య దగ్గర నుంచి ఎం.ఓ. కోసం ఎదురు చూస్తూ పరాధీనుడుగా బ్రతుకుతున్నందుకు సిగ్గుపడుతున్నాను. . పిల్లలు లేనివాళ్లు అదృష్టవంతులు. పిల్లల చేతుల్లో బాధలు పడే అవసరం తప్పుతుంది.... మీ అన్నయ్యకు ఉత్తరాలు రాయడం అంటే అసహ్యం. అది మానసిక బలహీనతకి లక్షణం అంటాడు. వాడికి ఉత్తరాలు రాయాలన్నా, చదవాలన్నా అసహ్యమే. నా దురదృష్టం కొద్దీ నాకు ఉత్తరాలు రాయడం, రావాలనుకోవడం అనే బలహీనత ఉంది. నేనిక్కడ నుంచి ఎక్కడికైనా ఉత్తర ప్రత్యుత్తరాలు లేని ఏకాంత స్థలానికి వెళిపోతే నయం కదూ?" అని రాస్తే, చదివి బాధపడ్డాను.

కానీ, ఏంచెయ్యడం? ఆయన అక్కడ, మేమిక్కడ. "యోగః కర్మణ

కౌశలం" అన్న సూత్రాన్ని అందరికీ బోధించిన నాన్నగారు తన విషయంలో "సరియైన పనిని సరియైన సమయంలో సరియైన విధంగా" చేశారా అని నా అనుమానం. తన వృద్ధాప్యం ఎలా గడుస్తుందనే ముందు చూపుతో ఏమీ దాచుకోలేదు. సంపాదించినన్నాళ్ళూ వచ్చేపోయే బంధుమిత్రుల మీదా, దానధర్మాల క్రిందా ఖర్చు పెట్టేశారు. "ఎన్నాళ్లింకా ఈ సంపాదన" అనుకుని వృత్తిని విరమించుకున్నారు. పెన్షన్ వచ్చే ఉద్యోగం కాదు. ఆయన కాలంలో చేసిన జీవిత భీమా 2000 /- రూపాయలకి! ఈ రోజుల్లో అదే మూలకి! పొలం అమ్మి ఇల్లు కొన్నారు - అది పిత్రార్జితం. ఈ రోజుల్లో యువతీ యువకులకున్న ధనాశ, భావిచింతనా అప్పటి రోజుల్లో తక్కువ.

బ్రతుకు పరాధీనమైందని వార్ధక్యంలో చింతిస్తే ఏం ప్రయోజనం? ప్రకృతి సిద్ధంగా కొంతవరకు పరాధీనత తప్పదు. కానీ బ్రతికినన్నాళ్ళూ భుక్తికోసం ఒకరిపై ఆధారపడకుండా తమ భవితవ్యం గురించి తాము ఆలోచించుకుని తగిన కట్టుదిట్టం చేసుకోవడం స్వార్థం అవుతుందా? రేపు, పిల్లలు వాళ్లే చేస్తారు అనే భరోసాతో ఉన్నదీ లేనిదీ ఊడ్చిపెట్టి పిల్లలకోసం ఖర్చుచేస్తే నష్టపోయేదెవరు? పిల్లలు రేపు చెయ్యగలుగుతారు, చెయ్యలేకపోతారు పరిస్థితులెలా ఉంటాయో - మంచి, చెడు మాట అలా ఉంచి చివరికి మిగిలేది భార్య, భర్త - ఒకరికొకరు, లేకపోతే, ఒక్కరు - ఉన్నంతలో ముందు గతి కూడా చూసుకోవాలి కదా. ఇటువంటి ఆలోచనలు వచ్చినా, నాలోనే అణచివేసుకుని, నాన్నగారి మనసు మళ్లించడానికి, ఏదైనా పుస్తకం రాయకూడదా అని రాశాను. దానికి జవాబు రాశారు.

"(1) ఇంకే పుస్తకమూ రాసే అవకాశం లేదు. కారణాలు (అ) కీర్తి కోసం కాని, గుర్తింపు కోసం కాని, డబ్బుకోసం కాని ఏ కోరికా లేదు. (ఆ) ఓపిక అసలు లేదు. (ఇ) ఇక్కడ గ్రంథాలయం లేదు.

(2) ధ్యానం చేసుకోవాలనే అనిపిస్తోంది. అంతరంగ పరిశోధన, శ్రద్ధాపూర్వక పరిశీలన, దివ్యమైన అద్వైత జ్ఞానాన్ని తెలుసుకోవాలనే ప్రయత్నం.

(3) రాయాలనే తపన పోతోంది - ఉత్తరాలు రాయాలన్నా, అందుకోవాలన్నా. కొన్ని నెలలపాటు నేను రాయడం పూర్తిగా మానెయ్యవచ్చు. అదేకనక జరిగితే ఏమీ అనుకోవద్దు. నిరాశ చెందవద్దు. ఆ ఏకాంతాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి.

(4) మీ అమ్మగారు ఇంకా రాలేదు. వస్తే వస్తారు. లేకపోతే లేదు. దేవుడి దయవలన మేము ఒకరిమీద ఒకరం శారీరకంగా కాని, మానసికంగా కాని ఆధారపడం. ఒకరి కొకరం బంధం కాకుండా స్వేచ్ఛగా ఉన్నాం. నేను ఏకాంత వాసంలోకి వెళ్లాలనుకుంటున్నాను."

* * *

నేను నాన్నగారిపైన సానుభూతి చూపిస్తూ ఉత్తరం రాశాను. దానికి జవాబుగా, "నా గురించి నువ్వేమీ విచారించకు. నేను ఆనందంగానే ఉన్నాను. సోక్రటీస్ జైల్లో కూడా ఆనందంగానే గడిపాడట" అని రాశారు.

కొన్నాళ్లు పోయాక, నిజంగానే ఆనందం కలిగిందాయనకి. అన్నయ్య కుటుంబ సమేతంగా నరసాపురం వెళ్లాడుట నాన్నగారినీ, అమ్మనీ చూడటానికి. ఎక్కువరోజులు దగ్గరుండక పోయినా, అసలు వచ్చి కనిపించినందుకే తృప్తిపడ్డారు. అయితే, సరిగ్గా ఆ సమయానికే అక్కకి అనారోగ్యంగా ఉందిట. పక్కమీంచి కూడా లేవడంలేదనీ, విపరీతంగా బాధపడుతోందనీ, నీరసించి పోయిందనీ తెలిసి, కంగారు పడుతూ, మళ్లీ అక్క ఆరోగ్యం సంగతి తెలియజేయమని రాశాను. నాన్నగారు వివరంగా రాశారు.

".... మీ అక్కయ్యకి వచ్చిన వ్యాధి పేరు 'పైయేమియా' రక్తంలోకి కురుపుల చీము, మొదలైన చెడు పదార్థం చేరడంవల్ల వచ్చే వ్యాధి అది. రెండు మూడు వారాలపాటు ఉంది. విపరీతంగా బాధపడింది. మోకాలి చిప్ప, భుజమూ చాలా వాచి, జ్వరం వచ్చి, తీవ్రంగా నొప్పులు పుట్టాయి. మంచంలో కూడా కదల్లేక ఘోరమైన బాధని అనుభవించింది. మూడు నాలుగు వారాలు అయాక మెల్లిగా కోలుకుని, కొద్దిగా నడవగలుగుతోంది. హోమియోపతీ మందులే వాడుతున్నాం. ప్రస్తుతం వాళ్ల గ్రామంలో ఉంది. అక్కడ పొలాల్లో నారుమళ్లు వేస్తున్నారు. అక్కడే ఉండి, అలాగే భర్తకి వండిపెడుతూ తంటాలు పడుతోంది. ఇక్కడ మీ అమ్మగారు వాళ్ల పిల్లలందరికీ వండిపెడుతున్నారు. చాకిరీ ఎక్కువైపోయింది. నూతిలోంచి నీళ్లు తోడుకోవాలి.. అవిణ్ణి చూస్తే జాలేస్తోంది.

ఉన్న బాధలు చాలక, మీ అక్కయ్యా వాళ్ల ఇల్లు (మేము ఉంటున్నది కాదు) చాలా పాతది అవడం మూలాన్ని ముందు భాగం పెంకులు మళ్లీ వేయిస్తూండగా కూలిపోయింది. అదృష్టవశాత్తూ ఎవరికీ గాయాలు తగల్లేదు.

ఇల్లు పైకప్పు వేయించి, కొత్త పెంకులు వేయించవలసి వచ్చింది. వర్షాలకి ఇంకా ఎక్కువ నష్టం కలక్కుండా తక్షణం పని చేయించడం ప్రారంభించాను. ఇల్లు మూడొంతులు బాగుచెయ్యవలసి వచ్చింది. వంటింట్లో గచ్చు బాగు చేయించడం, గోడలికి పెచ్చులు ఊడిపోయిన చోట్ల సిమెంటు చేయించి, మొత్తం వెల్ల వేయించడం – పనంతా ఇవాళ సాయంకాలానికి పూర్తవుతుంది. ఈ వ్యవహారం నిమిత్తం బోలెడు ఖర్చయింది. అసలే క్రిందటేడు వీళ్లకి పంటలు బాగా పండలేదు. చాలా నష్టం వచ్చింది. నాకు బోలెడు పని నెత్తిన పడేసరికి శరీరం బాగా అలిసిపోయింది. కాళ్లు పీకడం, ఓపిక బొత్తిగా లేకపోవడమూను. రేపటి నుంచి పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి'' అని రాశారు.

సరే, విశ్రాంతి తీసుకోనీ, ఉత్తరాలు రాసి ఆయన్ని కదపటం ఎందుకని కొన్నాళ్లపాటు ఊరుకున్నాను. నేను అనుకోవడమేగాని, ఆయన విశ్రాంతి తీసుకునే రకం కాదు. ఊరికే కూర్చోలేరు.

''ఈ మధ్య ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీ, జువాలజీ పుస్తకాలు కూడా ఇంగ్లీషు టెక్ట్స్ పుస్తకాలతోబాటు బి.ఎ. సెకండియర్ వాళ్లకోసం, బి.ఎస్.సి వాళ్ల కోసం పెట్టినవి చదివాను. నోట్సు తయారు చేశాను అన్ని సబ్జెక్ట్సమీదా. ఇక్కడ ఇంట్లో పిల్లలకీ, చుట్టుపక్కల పిల్లలకీ సహాయం చెయ్యడానికి...'' అని నాన్నగారు రాసింది చదివి ఆయన ఓపికకీ, శ్రద్ధకీ మనసులోనే జోహారులర్పించాను.

ఆయన కలుగజేసుకోని, శ్రద్ధ తీసుకోని విషయమంటూ ఉండదు. తనకు సంబంధించినదైనా కాకపోయినా. వాళ్ల తంటాలేవో వాళ్లు పడతారులే అని ఊరుకోలేరు. అక్కయ్య కూతురు పెళ్లి నిశ్చయమైందిట. ఆ సందర్భంలో పెద్ద ఉత్తరం రాశారు తెలుగులో.

''... నీ అభిప్రాయముల కొరకు, నీ సలహా కొరకు యీ క్రింది విషయములను వివరముగా వ్రాయుచున్నాను. నీవు సైంటిస్ట్ వలె ఆబ్జెక్టివ్‌గా పరిశీలించి, సెంటిమెంట్‌కు తావివ్వక, వివేకవంతమైన సలహాను యిచ్చెదవని ఆశించుచున్నాను.

ప్రస్తుత పరిస్థితులు, ధరలు అన్నియు నీకు తెలుసును గదా. బూర్లు వండుటకు శనగపప్పు లేదు. బఠాణీ పిండి అమ్ముచున్నారు. బ్లాక్ మార్కెట్‌లో కిలో రూ. 2.25 చొప్పున అమ్ముచున్నారు. గోధుమలు కూడా అరుదే. ఉప్మా

నూక లేనే లేదు. గోధుమలు కొని విసరించి, నూక తయారు చేసుకొనవలెనుట. నూనె, మిరపకాయలు, కూరలు అన్నియు విపరీత ధరలు. నెయ్యి లేనే లేదు. డాల్డా తప్ప. బ్లాక్‌లో కొనుటకు నేను అంగీకరించను. ఇదంతయు మీ అక్కయయ కూతురు వివాహము విషయమై వ్రాయుచున్నాను. వివాహమునకు ముందు అచట పెండ్లి కొడుకుకు, ఇచట మీ అక్కయ్య పెద్ద కొడుకుకి ఉపనయ లాంఛనము తీర్చవలెను. వారి గ్రామములో ఎన్నడును వివాహము జరుగుట కుదరదు. అచట ఏ సౌకర్యము లేదు. నరసాపురంలో చేస్తే, ఆ ఊరి రయితాంగం కొన్ని వందలు వచ్చెదరు. నరసాపురంలో అంతా పాతిక సంవత్సరముల నుంచి ఎరిగి ఉన్న వారగుటచే 1-2 వందలు ఇచ్చట నుంచి వచ్చెదరు. ఈ జనమును ఎట్లు భరించుట? కాఫీ ఉప్మాలు యిచ్చుటే సాధ్యమగును. భోజనముల సంగతి తలపెట్టిన భయము కలుగును. నాలుగు వేలు అయినను చాలవు. అసలే ఆర్థిక పరిస్థితులు అట్లున్నవి. నిరుడు పంటలు నష్టపోయినవి. యీ సంవత్సరం పంటలు కూడా చాలా నష్టపోయినవి. సంసారం గడుపవలెను, ఇంటి బాపతు అప్పు తీర్చవలెను, రెండవ కొడుకు చదువు నిమిత్తమై ప్రతినెల డబ్బు పంపవలెను. వ్యవసాయపు ఖర్చులకు పెట్టుబడి కావలెను, వీటిపైని పెండ్లి ఖర్చు - ఇదంతా కేవలము అసాధ్యము.

మగపెండ్లివారు చాల సరసులు. ఎట్టి పేచీ పెట్టరు. లెక్క, గీర, ఏమియు లేవు. వీలైనంత తక్కువ ఖర్చులో ఎక్కడ చేసినను సరే అని అనుచున్నారు. స్నేహితులు, శ్రేయోభిలాషులు నరసాపురంలో చేయవద్దనిన్ని, ఇక్కడ చేస్తే మునిగిపోతారనిన్ని - ఇతరచోట - ద్వారకా తిరుమలలో చేయమని సలహా యిచ్చుచున్నారు. ముక్తసరిగా ముఖ్య బంధువులు వెళ్లి వివాహము చేసుకుని వచ్చి, ఒక టీ పార్టీ యిస్తే వ్యవహారం సుళువుగా తేలిపోవును. నాది కూడా అదే అభిప్రాయం. మీ అక్కగారు సహజముగా, సరదా, ముచ్చట అను అభిప్రాయములచే, యిచట చేయమంటున్నది. మీ బావకు కూడా యిచట చేయుట యిష్టం లేదు.

ఇక్కడ బస్సు మీద ఉదయం 5.30 గంటలకు బయలుదేరితే తిరుమలలో గుడివద్ద 11 గంటలకు దింపును. తిరిగి అచట రాత్రి 12 గంటలకు బయలుదేరితే యిచటకు సాయంత్రం 6 గంటలకు వచ్చెదరు.

అక్కడ హొటలులోనే భోజనం. తిరుమల అయితే చాలామంది బంధువులు రాలేరు. తీసుకు వెళ్లలేరు.

ఇప్పుడు అనేకమంది శ్రీమంతులు కూడా అన్నవరంలోను, తిరుమలలోను, సింహాచలంలోను వివాహములు చేసి ఖర్చులు తగ్గించుచున్నారు. కొద్ది రోజుల క్రిందటనే ఇక్కడ లోకల్ కాలేజి ప్రిన్సిపాల్ కుమార్తె వివాహం తిరుమలలో చేసిరి. ఆహ్వానాలు, డిన్నర్లు చాలామంది చాలావరకు తగ్గించుచున్నారు. కొద్ది కాలములోనే రిజిస్టర్డ్ మేరేజెస్ పరిపాటి అయిపోవునని నేననుకొనుచున్నాను.

రాజమండ్రిలో అయితే నేను కూరలు వగైరాలు సప్లయి చేసి వుందును. ఇక్కడ అది సాధ్యపడదు. నేను అతిశయోక్తి లేకుండా నగ్న సత్యము మాత్రమే వ్రాయుచున్నాను. మనము మీ అక్కయ్యకు సరియైన సలహానిచ్చి కాపాడవలసి యున్నది. అప్పులపాలయితే ఎవ్వరు ఏమియు చేయలేరు. పూర్వజన్మ కర్మ అనుట అవివేకము. అట్టి మాటల వలన లాభము లేదు. అది కేవలము ప్రస్తుతము నుండి పారిపోవుటయే. రెండవ కొడుక్కి ఇంకా 2 సం||లు, పెద్దవాడికి 1 సం|| చదువు వున్నది పెద్దవాడి భవిష్యత్తు, ఉద్యోగం అదంతా వేరే సంగతి. ఎం.ఎ. పాసైన వారికే ఉద్యోగం దొరుకుట లేదుగదా. కేవలం థర్డ్‌క్లాసు బి ఎ. (హిస్టరీ) డిగ్రీ వుంటే ఏమి లాభించును? వీళ్లు - ఇద్దరు కొడుకులు ఉద్యోగములలో ప్రవేశించినప్పుడు మీ అక్కయ్యకు, బాపకు కొంచెము తెరపి కలుగును. నేను సంపాదించుట లేదు గదా. నేను చేయగలిగినదంతయు చేయుచున్నాను.

కనుక - మగపెండ్లివారి పూర్తి సహకారము వుండును గనుక, పై సంగతులన్నియు ఆలోచించి నీవు వివేకవంతమయిన సలహా యివ్వవలెనని నా కోరిక. చాల తక్కువ ఖర్చుతో ఈ శుభకార్యం జరిపించి బయటపడుట ఎట్లు? తిరుమలలో చేయుట గురించి నీ అభిప్రాయం ఏమిటి? అక్కడ అయినచో 1000/- లేక 1500/- తో పూర్తి చేసుకొనవచ్చును. ఇచ్చట అయినచో 3000/-కు తక్కువ కాదు. ఇబ్బంది, శ్రమ చెప్పనక్కరలేదు. తుదకు వివాహము ఎచట చేసినను, శ్రమ చాల భాగము నేనే వహించవలసి వుండును. శ్రమ అయితే పడగలను, ధన సహాయము చేయుటకు అసమర్థుడను. ప్రస్తుత పరిస్థితులలో మనము చేయగలిగిన దేమిటి? ఇయ్యగలిగిన సలహా

ఏమిటి? మన కర్తవ్యమును నిర్ణయించుకొనవలెనే గాని, ఇతరులతో నిమిత్తం లేదు. నీవు తప్పక రావలెనని ఇచట అందరి కోరిక. అన్ని సంగతులు బాగా ఆలోచించి, తొందరలేదు వారం పది రోజులు ఆలోచించి, నీ సలహాను యివ్వగోరెదను...."

ఉత్తరం పూర్తి చేశాక, ఇంకో నాలుగు వాక్యాలు చేర్చారు. "ఈ ఉత్తరంలో వ్రాసిన విషయములన్నియు నీ కొరకే వ్రాయబడినవి. నీవు మీ అక్కకుగాని, మీ అమ్మగారికి గాని ఎన్నడును తెలియపరచవద్దు. జాగ్రత్త. సత్యమెప్పుడు అప్రియమేగదా. నాకు నిష్ఠురములు రానివ్వకు. నాకే జవాబు వ్రాయుము" అని రాశారు.

నాన్నగారిచ్చిన "హింట్" తీసుకున్నాను. ఈలోగా మావారికి జబ్బు చేసింది. ఎలాగూ నేను వెళ్లడం కుదరదు పెళ్లికి. ఆ మాటే రాశాను. ప్రయాణానికి ఖర్చుపెట్టే డబ్బు, బహుమతిగా ఇవ్వదలుచుకున్నదీ అంతా కలిపి పంపించాలనుకుంటున్నాని రాశాను. నాన్నగారు నా ఉత్తరానికి సంతోషించారు. కానీ, మావారి ఆరోగ్యం పాడైనందుకు బాధపడుతూ, పెళ్లి విషయమై మళ్లీ రాశారు. నేనెక్కడ మనసు మార్చుకుని, ఆయన్ని వదిలి పెళ్లికి వస్తానేమోనని భయపడుతూ రాశారు.

".... (1) నీ భర్త ఆరోగ్యం ఒక మోస్తరుగా ఉంది కదా. అతనికి నిరంతరం సేవ చేస్తూ జాగ్రత్తగా చూసుకోవలసిన అవసరం ఉంది. వారం పది రోజుల పాటైనా అతన్ని వదిలి నువ్వు రాగలవో లేదో. నువ్వు వచ్చేస్తే అతను ఏ హొటల్లోనో భోజనం చెయ్యవలసి వస్తుంది. ఉదయం నుంచి సాయంకాలందాకా అతనికి కావలిసినవన్నీ అమర్చాలి నువ్వు. అలాంటప్పుడు నువ్వు రావడానికి ఎలా వీలవుతుంది? నేనే నీ స్థితిలో ఉంటే నా భర్తని వదిలి ఒక్క రోజైనా ఎక్కడికీ వెళ్లను - బి.పి.తో బాధ పడుతున్న అతన్ని వదిలి. పెళ్లికి వెళ్లి అక్కడ అందరితో కలిసి సరదాగా కాలం గడపడం కన్న భర్తకి సేవ చెయ్యడమే ఎక్కువ ఆనందదాయకంగా భావిస్తాను నేనైతే! ఏదైనా ధనసహాయం చెయ్యాలనుకుంటే (నువ్వు అన్నట్లుగా) సంతోషంగా చేస్తాను. ఇదంతా నేను నువ్వైతే.

(2) నువ్వు క్రిందటేడు ఇక్కడికి వచ్చినప్పుడు బోలెడు ఖర్చుపెట్టి అందరికీ బహుమతులు తెచ్చి ఇచ్చావు. ప్రయాణానికి రెండు మూడు వందలకి పైగా ఖర్చుపెట్టి ఉంటావు. మొత్తం 600, లేక 700 దాకా ఖర్చయి

ఉంటుంది. ఇప్పుడు ఏంచెయ్యదలుచుకున్నావు. మళ్లీ 700 లేక 800 ఖర్చు పెడతావా?

(3) నువ్వు అంత పెద్ద మొత్తం ఖర్చుపెట్టడం నాకిష్టం లేదు. మనం అంతా సాధారణ కుటుంబీకులం. జమీందారులం కాదు. పెళ్లి అంటే సంతోషించతగ్గ సందర్భమే. కాని, దాని కోసమయే ఖర్చు మాటేమిటి?

(4) ఇప్పుడు నువ్వు కనక 400/- ప్రయాణపు ఖర్చుల కోసం, 100/- పెళ్లి కూతురికి కానుక కోసం ఖర్చు పెట్టి పెళ్లికి రావడం మానుకున్నట్లయితే – (అ) నీ భర్త దగ్గరే ఉండి అతనికి కావలసిన సేవ చెయ్యడానికి వీలవుతుంది, (ఆ) ప్రయాణపు ఖర్చులు కలిసి వస్తాయి, (ఇ) ఇంత దూర ప్రయాణాలు చెయ్యడం వల్ల కలిగే శారీరక శ్రమని తప్పించుకోవచ్చు.

(5) ఈ రోజుల్లో ప్రయాణాలు అత్యవసర పరిస్థితుల్లో తప్ప వీలైనంత వరకు తగ్గించుకుని డబ్బు ఆదా చేసుకోవడం మంచిది కాదా?

(6) రైల్వే బోర్డు వాళ్లు మళ్లీ త్వరలో రైలు ఛార్జీలు పెంచుతామంటున్నారు. ఎంత పెంచుతారో తెలియదు.

ప్రయాణాలు చెయ్యడం విషయంలోనూ, నీ భర్తని విడిచి రావడం విషయంలోనూ వ్యతిరేకిస్తూ ఇంతగా రాశాను. ఇక నీ ఇష్టానికీ, నీ భర్త ఇష్టానికీ వదిలేస్తున్నాను. నా ప్రార్థన అల్లా ఒక్కటే. నన్ను అపార్థం చేసుకోవద్దని. నీ భర్త ఆరోగ్యం గురించి నేనెంతో ఆందోళన పడుతున్నాను. అతన్ని ఒక్కరోజైనా విడిచి నువ్వు ఇక్కడికి రావడం నాకిష్టం లేదు. ఇక ఈ విషయాన్ని ఇంతటితో వదలేస్తున్నాను... నేను తండ్రిగా ఇంకా బ్రతికి ఉన్నాను కనుక నా కర్తవ్యాన్ని నేను నెరవేరుస్తున్నాను..."

నేను నాన్నగారు కోరినట్లుగానే చేశాను. ఆఫీసులో నాకు సెలవు దొరకడమూ కష్టమే. ఎవరైనా పెళ్లిళ్లకు రమ్మని బలవంత పెడితేనో, మొహమాటపెడితేనో కష్టంగాని, వెళ్లకుండా ఉండగలిగే అవకాశం ఉంటే, అంతంత దూర ప్రయాణాలు చెయ్యడం ఎవరికిష్టం ఉంటుంది? నేను పంపిన డబ్బు అందుకున్న తరవాత, నాన్నగారు వెంటనే ఉత్తరం రాశారు.

".... మధ్యాహ్నం సరిగ్గా 12.45 అయింది. పక్కమీద పడుకుని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ చదువుతున్నాను. అంతలో ఆంధ్రా బ్యాంకు నుంచి ఒక

ఫ్యాన్ వచ్చి నన్ను బ్యాంకుకి తక్షణం రావలసిందనీ, వెయ్యి రూపాయలు టెలిగ్రాఫిక్ ట్రాన్స్‌ఫర్‌లో వచ్చాయనీ చెప్పాడు. నాకు అత్యంత ఆశ్చర్యం కలిగింది. అనుకోకుండా ఆనందం కలగడమే కాదు. అత్యంతాశ్చర్యం కలిగింది. నేనింతకు ముందు నీకు రాసినట్లుగా నీ దగ్గర నుంచి మూడు వందలకన్న ఎదురు చూడలేదు. ఉదార స్వభావుడైన నీ భర్తనీ, నిన్నూ చూస్తూంటే నాకు గర్వంగా ఉంది. మీ అక్కయ్య పెద్ద కూతురు చాలా అదృష్టవంతురాలు. నువ్వూ, మీ అన్నయ్యా పంపిన డబ్బుతో సమస్యంతా తీరిపోయింది...

నేను నా పనులు మామూలుగా చేసుకుంటున్నాను - తోటపని, మొక్కలికి నీళ్లు పొయ్యడం, వగైరా. .... మీ అన్నయ్య మెక్సికో వెళ్లే సందర్భంలో వీడ్కోలు చెప్పడానికి నువ్వు ఎయిర్‌పోర్టుకి వెడతావనుకుంటాను. వాడు యూరోప్ ఇప్పటికి అయిదుసార్లు, ఇరాన్ ఒకసారి వెళ్లాడు. ఇప్పుడు అమెరికా వెడుతున్నాడు!

నిన్ను మరోసారి వేడుకుంటున్నాను. మీ అమ్మగారూ, అక్కయ్యా ఈ పెళ్లి ఏర్పాట్ల విషయంలో నాపైన నిందలు వెయ్యకుండా చూడమని. మనమధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల విషయం వాళ్ళకి ఏమాత్రం తెలియనివ్వకుండా అతి రహస్యంగా ఉంచాలి నువ్వు...... నా మనశ్శాంతి నీమీద ఆధారపడి ఉంది. వాళ్ల మంచి కోసమే ఈ బాధంతా పడవలసివస్తోంది. నా మనస్సులో ఎక్కడా కల్మషం లేదు.

ఏ తండ్రికి అంత రాతి గుండె ఉంటుంది - కొద్ది రోజుల పాటు తన కన్న కూతుర్నీ, కొడుకునీ చూసుకుని ఆనందించాలని ఏ తండ్రికి అనిపించదు ? ముఖ్యంగా వివాహ శుభ సమయంలో ? ఇదంతా ఒక విధమైన స్వార్థ త్యాగం లాగే చేస్తున్నాను. అంచేత నన్ను రక్షించు."

* * *

నాన్నగారికి మొదటి నుంచీ పెళ్ళిళ్లలో చేసే ఆర్భాటాలూ, అనవసరపు ఖర్చులూ అంటే 'ఎలర్జీ'. 'బ్లాక్' మార్కెట్‌లో వస్తువులు కొనడం అంటే కిట్టదు. ఎవరు చేసినా సహించలేరు. తన అసహనాన్ని దాచుకోలేరు. ముఖ్యంగా, మధ్యతరగతి కుటుంబీకులు "మింగ మెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగ నూనె" అన్నట్లు గొప్పలకి పోయి అప్పుల పాలవడం చూస్తే ఆయనకి అరికాలి

మంట నెత్తికెక్కుతుంది. ఆయన దగ్గరికి పెళ్లి శుభలేఖ పట్టుకుని వెళ్లి ఇవ్వడానికి బంధు మిత్రులందరికీ భయమే. వాళ్లిచ్చిన శుభలేఖ చేత్తో పట్టుకుని, దాన్ని ప్రింటు చేయించడానికి ఎంత ఖర్చు అయిందో, మొదలుకుని, కట్నం, ఆడపడుచుల లాంఛనాలు, అప్ప  ఌల బట్టలు, పానకం బిందెలు, భజంత్రీలు, షామియానాలు, పిండి వంటలు, రిసెప్షన్ ఏర్పాట్లు, హనీమూన్ - మొదలైన ఖర్చులన్నిటి గురించీ ఆరా తీసి, ఛెడామడా చివాట్లు పెట్టి ఓ సుదీర్ఘ ఉపన్యాసం ఇచ్చి పంపేవారు. నా ఇంట్లో నేను చేసే పెళ్లి కాదు కదా, నా కెందుకొచ్చిన బాధ' అనుకునే రకం కాదాయన. అన్నీ ఆయనకే కావాలి. అందరినీ సన్మార్గంలో పెట్టాలని కంకణం కట్టుకున్నట్లు తాపత్రయ పడేవారు

మొన్నామధ్య మా పుట్టింటివైపు బంధువులింట్లో ఓ పెళ్లికి వెళ్లాను. పెళ్లి హాల్లో ఓ పక్కగా పేము కుర్చీలో కూర్చున్న ఓ ముసలాయన దగ్గరికి నన్ను తీసికెళ్లి, పెళ్లి కూతురి మేనమామ నన్ను పరిచయం చేశాడు ఫలానా అంటూ ఆ ముసలాయన కళ్లజోడు మీద కనుబొమల దగ్గర అరచేతిని గొడుగులా పెట్టి నామొఖంవైపు పరికించి చూసి, బోసినవ్వు నవ్వి, "పంతులు గారి రెండో కూతురివా! ఎప్పుడో చిన్నప్పుడు చూశాను ఆ ముక్కు, మొహం అంతా మీ నాన్న పోలికే. మీనాన్న.... మహా అసాధ్యుడు... మా అబ్బాయి పెళ్లిలో బేండ్‌మేళం పెట్టించారనీ, పులిహోర చేయించారనీ ఎంత గొడవ చేశారో గుర్తుందా? నువ్వు బాగా చిన్న దానివి అప్పటికి..." అంటూ మరోసారి బోసినవ్వు వ్వారు.

"అవునండి, గుర్తుంది" అన్నాను సిగ్గుపడుతూ.

"ఇప్పుడీయన ఆ గొడవంతా ఏకరవు పెడితే గాని వదలరు. మీరు ముందు పదండి లోపలికి" అంటూ నన్ను పెళ్లి మంటపం వైపుకి మళ్లించాడు పెళ్లి కూతురి మేనమామ. పెళ్లిమంటపం ఎదురుగా, కొంచెం దూరంగా కుర్చీలో కూర్చున్నానన్న మాటేగాని, పెళ్లికూతురూ, పెళ్లి కొడుకూ సరిగ్గా కనిపించడమే లేదు. చుట్టూ విడియో కెమెరా వాళ్లూ, ఫోటోలు తీసేవాళ్లూ, విడియోలో పడాలని మంటపం చుట్టూ రంగు రంగుల పట్టుచీరల్లో ఉన్న ఆడవాళ్లూ, పెద్దా చిన్నా అని లేకుండా పంజరం ఊచల్లా నిలబడ్డారు. పెళ్లి మంత్రాలు సరిగ్గా వినిపించకుండా వెనకాల బాజాల మోత. పెళ్లికొచ్చిన అతిథులు కూడా ఎవరిమటుకూ వాళ్లు పక్కవాళ్లతో ముచ్చట్లలో పడ్డారు - చేతిలోఉన్న అక్షింతల్ని వేళ్లతో నలుపుతూ

నాపక్కన ఎవరూ తెలిసిన వాళ్లు లేకపోవడంతో నా మనస్సు ఇందాక పెళ్లికూతురి తాతగారు గుర్తుచేసిన గతంవైపుకి మళ్లింది.

అది రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులు. రేషను అమలులో ఉంది. బియ్యం దగ్గర్నుంచి బట్టలవరకూ అన్నిటికీ రేషనే. నాన్నగారికి బ్లాక్‌లో కొనడం ఎంతమాత్రం ఇష్టం ఉండేది కాదు. నాన్నగారి మేనకోడలి కూతురి పెళ్లి తణుకులో. పెళ్లి శుభలేఖ పట్టుకుని మమ్మల్ని పిలవడానికొచ్చినప్పుడు అత్తయ్య కూతురితో ముందుగానే - బ్లాక్‌లో బియ్యం వగైరా కొనవద్దనీ, పులిహోర, అరిశలూ చెయించవద్దనీ, అట్టహాసంగా భజంత్రీలు పెట్టించకుండా ఒక్క సన్నాయివాణ్ణి పెట్టమనీ మరీ మరీ చెప్పారు. అత్తయ్య కూతురు అన్నింటికీ 'అలాగే అలాగే' అంది.

నాన్నగారు, అమ్మ, చిన్నబామ్మ, అక్క, వదిన, నేను, చెల్లాయి - అందరం రైల్లో బయలుదేరి పెళ్లి సమయానికి చేరుకున్నాం. (అన్నయ్య అప్పుడు ఇంగ్లండులో పి.హెచ్.డి. చేస్తున్నాడు). లగ్నం రాత్రి ఏడుగంటల ప్రాంతంలో. పెళ్లిపందిరి, మంటపం - అన్నీ బ్రహ్మాండంగా అలంకరించారు. ఊరిజనం అంతా అక్కడే ఉన్నారా అన్నంతగా కిటకిటలాడుతోంది పెళ్లిపందిరి. బ్యాండ్‌మేళం వాళ్లు డాబుగా ముస్తాబు చేసుకుని అట్టహాసంగా వాయిస్తున్నారు. పెళ్లికూతురూ, పెళ్లి కొడుకూ జీలకర్ర, బెల్లం నెత్తిమీద పెట్టుకునే సమయానికి పురోహితుడు బాజాల వాళ్లను మరింత గట్టిగా వాయించమని పొలికేక పెట్టాడు. వాళ్లు గుండెలు దద్దరిల్లేటట్లు వాయించడం మొదలుపెట్టారు. పందిట్లో అందరికీ అక్షింతలు పంచిపెట్టారు అప్పటికే. అంగవస్త్రం అడ్డు తొలగించాక అందరినీ ఆశీర్వదించమన్నాడు పురోహితుడు ఆహూతులవైపు తిరిగి. చాలామంది కూర్చున్నచోటు నుంచే విసిరారు మంటపం వైపుకి. కొంతమంది పెద్దలు లేచి మంటపం దగ్గరకు వెళ్లి శ్రద్ధగా అక్షింతలు నెత్తిమీద జల్లి, పెళ్లి కొడుకునీ, పెళ్లి కూతుర్నీ ఆశీర్వదించారు.

నాన్నగారు లేచి, అందరిలాగే అక్షింతలు నెత్తిన వేసి, కాస్సేపు ఆపండి అన్నారు గట్టిగా. అంతా నిశ్శబ్దం అయిపోయారు. బాజాలవాళ్లని ఉద్దేశించి మళ్లీ "కాస్సేపు ఆపండి, మిమ్మల్నే" అని అరిచారు. వాళ్లు నెమ్మదించారు. అప్పుడు మొదలుపెట్టారు. "వివాహ సమయంలో మంగళ వాద్యాలు పెట్టడం ఎందుకంటే, శుభప్రదమైన తరుణం అని సూచించడానికీ, నూతన దంపతుల్ని

ఆశీర్వదించమని పైనుండే దేవతల్ని ఆహ్వానించడానికీ. అంతేకాని, వచ్చిన వాళ్ల గుండెలు అదరగొట్టడానిక్కాదు! ఇప్పుడు మనకు వినిపించినవి మంగళ వాద్యాలు కాదు. భీకర నాదాలు. ఈ భయంకర శబ్దాలు విన్నాక, ఆ దేవతలు ఇంకా వస్తారని భ్రమపడకండి. వాళ్లు హడలిపోయి ఎప్పుడో తిరుగుముఖం పట్టి ఉంటారు" అని ఉపన్యసించారు.

పెళ్లి పెద్దలంతా నిర్ఘాంతపోయి, "ఏమిటీయన అఘాయిత్యం మాటలు" అంటూ ముక్కున వేలేసుకున్నారు. పందిట్లో కూర్చున్న కొందరు ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు. భజంత్రీవాళ్లు బిక్కచచ్చిపోయి శృతి తగ్గించారు. అంతటితో అయిపోలేదు ఆ ప్రహసనం. ముఖ్యమైన పెళ్లితంతు పూర్తికాగానే భోజనాలకి లేపమన్నారు అందరినీ. వడ్డనలు ప్రారంభమయాయి పెరటివైపు పందిట్లో. నాన్నగారు వెళ్లి ఒసారి కలయజూశారు పదార్థాలన్నిటినీ. వెంటనే చరచరా నడుచుకుంటూ వెళ్లి, అత్తయ్య కూతుర్ని పిలిచి,

"నేను చెప్పిందేమిటి, మీరు చేసిందేమిటి?" అన్నారు గంభీరంగా

"ఏంచేశాం మామయ్యా?" అంది అత్తయ్య కూతురు కుంచించుకుపోతూ.

"బ్లాక్ మార్కెట్‌లో బియ్యంకొని పులిహోర చేయించొద్దన్నానా లేదా?" అంటూ నిలదీశారు లాయర్‌లాగ, తన సహజ ధోరణిలో.

"చెప్పావనుకో. కానీ, పులిహోర లేందే పెళ్లేమిటి? మొగపెళ్లివారేమనుకుంటారు? మేము కక్కుర్తి పడ్డామనీ, మర్యాదలు తెలియవనీ అనుకోరూ?" అని సాగదీసింది అత్తయ్య కూతురు.

"నేను బ్లాక్ మార్కెట్ బియ్యంతో చేసిన పులిహోర చచ్చినా తినను. నేనిక్కడ ఇంక ఒక్కక్షణం కూడా ఉండదలుచుకోలేదు" అంటూ భుజంమీంచి కండువాతీసి ఝాడించారు దుర్వాసుడులాగ.

"అయ్యో! తొందరపడకు మామయ్యా!" అంటూ బతిమాలింది అత్తయ్య కూతురు కళ్ల నీళ్లు కుక్కుకుని.

నాన్నగారు తొందర తొందరగా రెండంగల్లో వెళ్లి పెట్టెలో బట్టలు సర్దుకున్నారు. అమ్మనీ, మమ్మల్నందరినీ బయలుదేరమన్నారు. అమ్మ ఒప్పుకోలేదు.

"మీరు వెడితే వెళ్లండి, నేను అలా మొహం కండలు చెండుకుని రాలేను" అంది. అక్కకూడా కూర్చున్న చోటునుంచి లేవలేదు. చెల్లెలు మా అమ్మ ఒళ్లో దూరి కూర్చుంది. చివరికి నేను, వదిన, చిన్న బామ్మా మిగిలాం. ఎదురు చెప్పలేక, నిస్సహాయంగా ఆయన వెంట బయలుదేరాం. ఆ రాత్రికి రాత్రి తీసుకుపోయి రైలెక్కించేశారు. తెల్లతెల్లవారుతూండగా రాజమండ్రి చేరుకున్నాం. తీరా ఇంటికి వెళ్లాక చూసుకుంటే, నాన్నగారి దగ్గర ఇంటి తాళం చెవి లేదు. ఆ హడావిడిలో అమ్మ దగ్గర్నుంచి తీసుకోవడం మరిచిపోయారు. ఇక, ఇంట్లోకి ఎలా ప్రవేశించాం అన్నది – అది వేరే కథ!

అప్పటి నుంచీ బంధువుల్లో కొందరికి పంతులుగారనగానే "పులిహోర ప్రహసనం" గుర్తుకొస్తూ ఉంటుంది.

* * *

అక్కయ్య కూతురు పెళ్లి అయాక నాన్నగారు మళ్లీ ఉత్తరం రాశారు.

".... చిన్న తిరుమలలో పెళ్లి చక్కగా జరిగింది. మేమంతా నిన్నరాత్రి 7 గంటలకి క్షేమంగా తిరిగి వచ్చాం అన్నీ సవ్యంగానే జరిగాయి. నువ్వులేని వెలితి అందరికీ బాధ కలిగించింది. నువ్వు వస్తావని అందరూ అనుకున్నారు. చివరికి నిరుత్సాహం కలిగింది. కానీ, నీ పరిస్థితి గురించి వివరించి చెప్పగానే అంతా సమాధానపడ్డారు. (డబ్బు సంగతి మాత్రం చెప్పలేదు). పెళ్లికూతురు చాలా బావుంది. శనివారం రాత్రి శోభనం జరుగుతుంది.... ఇక్కడ ఎండలు చాలా తీవ్రంగా ఉన్నాయి. గాడ్పులు – వర్షాలు లేకపోవడం

మీరు ఢిల్లీ ఎండల్ని ఎలా తట్టుకుంటున్నారో తెలియదు కా ఫీ, టీ, సిగరెట్లు, పెట్రోలు, పోస్టల్ చార్జీలు, ప్రయాణం ఛార్జీలు – అన్నీ ఇదివరకు కన్న ధరలు పెరిగి పోయాయి. సిగరెట్లు కాల్చేవాళ్లు ఇప్పటికైనా మానెయ్యాలనీ, లేదా, కనీసం తగ్గించుకోవాలనీగ్రహించగలిగితే బావుండును. ఎవరైనా ఇంటికొస్తే, ఏటైములో వచ్చినా, వేళకానివేళలో వచ్చినా సరే కాఫీ ఇవ్వడం నాగరికత లక్షణమైపోయింది – పరమ దుర్లక్షణం అది. ఇప్పటికైనా నాగరికులు ఆ దుర్లక్షణాన్ని వదిలించుకోరా? అంతా కలిసి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసి (అధమం గృహిణులైనా !) ఈ ఛండాలపు నాగరిక లక్షణాన్ని వదులుకోవాలని

ఎందుకు తీర్మానించరు? నువ్వే దీనికి ఎందుకు దారి తియ్యకూడదు? కాఫీపొడి, పంచదార , పాలు – అన్నిటినీ పొదుపు చెయ్యవచ్చు...

నాకు తగని భయంగా ఉంది – నాకోసం కాదు – నేను ఈ దురలవాటుకి బానిసని కాకపోయినా – ఈ పెరిగిపోతున్న ధరలు చూస్తుంటే, నాకన్న ఎంతో దరిద్రులైన వారిని తలుచుకుంటే నాకు భయంవేస్తుంది. అప్పుడప్పుడు దుర్భరం అనిపిస్తుంది – చింతపండు ధర కిలో 3 రూ॥ లకు పైగా ఉంది!...''

ఆ పెరిగిన ధరలతో బాటు నాన్నగారికి జీవితం మీద మళ్ళీ విరక్తి పెరిగింది.

''...ఈ ప్రపంచంలో నా పని పూర్తి అయిందని పిస్తోంది. ఇప్పుడు నేను హాయిగా ఈ దేహాన్ని చాలించవచ్చు. మీఅన్నయ్యకీ, మీచెల్లెలి అత్తవారికీ, మీ అక్కయ్య అత్తవారికీ నా చాతనయిన సేవ చేశాను. నాకొక్కటే విచారం. మీ అత్తవారికి నేను ఏవిధమైన సేవా చెయ్యలేకపోయాను. ... నేను నా విల్లు రాసేశాను. నీకు కొద్ది రోజుల్లో ఒక కాపీ అందుతుంది'' అని రాశారు

''నేను అప్పుడే నాకొచ్చిన 'నూతన అవకాశం' గురించి రాయకూడ దనుకుంటూనే, నాన్నగారి మనస్సుని ఆహ్లాదపరచడానికి రాసేశాను. దానికి వెంటనే జవాబు వచ్చింది.

''... నీకు అమెరికాలో ఉద్యోగం లభించే అవకాశం ఉందని నువ్వురాయగానే నాకుకలిగిన మొట్టమొదటి భావం చెప్పడం కష్టం ముందుగా ఆశ్చర్య పోయాను. తరవాత ఒక చిత్రమైన భావం కలిగింది. తరుచుగా నేను ఎన్నోసార్లు అనుకుంటూ ఉండేవాణ్ణి – నాకు రెండవ కుమారుడు ఉండి ఉంటే మన సంసారం ఎలా ఉండేదోననీ, నువ్వు కూతురుగా కాక, కొడుకుగా పుట్టిఉంటే ఎలాఉండేదోననీ. పోయినవాళ్లంతాపోగా, ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లూ ఉంటే – ఎంతో సరి సమానంగా తులతూగుతూ ఉండేది సంసారం. మీఅమ్మగారికి రెండవ కుమారుడు ఉండాలనే ప్రగాఢ వాంఛకూడా తీరిఉండేది. నువ్వు కొడుకువై ఉంటే నువ్వుకూడా మీ అన్నయ్య అంతటి గొప్పవాడుగా అవడానికి నాశాయశక్తులా కృషిచేసి ఉండేవాణ్ణి. ఇదంతా ఊహామాత్రమే కదా! నువ్వే కొడుకువైఉంటే, నీ అమెరికా వెళ్లే అవకాశానికి చాలా సంబర పడిపోయి ఉండేవాణ్ణి. కానీ, ఇప్పుడు సంబర పడుతున్నానని చెప్పలేను. ఇది నాలోని లోపం కావచ్చును. అయినా, నీ

అమెరికా ఉద్యోగావకాశం గురించి నా స్నేహితులతో సగర్వంగా, సంతోషంగా చెప్పవచ్చుననుకో  కానీ, నేనెప్పుడూ అలా చెయ్యను. నాపిల్లల గొప్పతనాన్ని నాదిగా నేనెప్పుడూ చాటుకోను. నేనెప్పటికీ అలా చెయ్యలేను. ఇంతకీ, ఏమవుతుందో చూద్దాం. మీఅత్తమామలు ఈ విషయమై ఏమంటున్నారు? నిన్నూ, నీభర్త నీ ఆభగవంతుడు ఆశీర్వదించుగాక!" అని రాశారు.

ఇదివరకు ఉత్తరంలో నాన్నగారు "విల్లు" రాయడం గురించి చేసిన ప్రస్తావన కి ఆశ్చర్యపోయాను. ఆయన దగ్గర ఇంకా ఏంమిగిలిందని విల్లు రాయడం ? విల్లు ప్రస్తావన ఏ ముహూర్తాన తెచ్చారో, నాన్నగారికి యాక్సిడెంట్ అయిందని ఆలస్యంగా అమ్మ ఉత్తరం ద్వారా తెలిసి, తీవ్ర మనస్తాపం కలిగింది. కొంచెం కోలుకున్న తరవాత నాన్నగారే పాపం, అన్ని వివరాలతో ఉత్తరం రాశారు:

"...ఎంతో ఆప్యాయత, ఆర్ద్రతతోనిండిన నీ ఉత్తరం అందింది. నాకళ్లమ్మట నీళ్లు తిరిగాయి. ఇప్పుడు నాకు చాలా నయమైంది. మంచంమీద ఇటూ అటూ కదలగలుగుతున్నాను. ఇంకా నొప్పి కొద్దిగా తెలుస్తోంది  ఇంకోవారం రోజుల్లో పూర్తిగా కోలుకోగలుగుతాను...

అసలా ప్రమాదకరమైన సంఘటన ఇలా జరిగింది : ఎలెక్ట్రిసిటీ మీటరు రీడింగ్ తీసుకొందామనే ఉద్దేశంతో ఒకుర్చీతీసుకుని గుమ్మందగ్గర కెళ్లాను. అక్కడ పక్కనే గోడదగ్గర మడతమంచం పెట్టి ఉంది. దానిపైనే ఉంది గోడమీద మీటరు. ఆ కుర్చీ అక్కడే వదిలేసి, ఆ మడతమంచంమీదికెక్కి మీటరు చూస్తున్నాను. నా పాదాలు రెండూ మడత మంచం కమ్మీలమీద సరిగ్గాపెట్టి నిలబడలేదనుకుంటాను. హఠాత్తుగా మడతమంచం ముడుచుకుపోయి ధడాలున క్రిందపడిపోయింది. నాఛాతీ కుడిభాగం ఆ మంచం కమ్మీల మధ్యన పడి నలిగిపోయింది. నేను ఆ కుర్చీ నే ఉపయోగించి ఉంటే ఈ సంఘటన జరిగేది కాదు. జీవితంలో అటువంటి హఠాత్ సంఘటనలు అప్పుడప్పుడు తప్పవు. భగవంతుడి దయవల్ల వీపుమీద్ది కీళ్లు విరిగి పోలేదు. బాగా దెబ్బమాత్రం తగిలింది...

మళ్లీ ఎండాకాలం తిరగబెట్టినట్లుగా ఉంది. వర్షాలుపడలేదు. గత రెండు నెలల్లోనూ 2 సెంటీమీటర్ల వర్షం కూడా పడలేదు. వ్యవసాయపు పనులన్నీ నారు వెయ్యడం, మొదలైనవి బాగా దెబ్బతిన్నాయి. ఇంట్లో తోట వెనక భాగంలో

ఉన్న మొక్కలన్నీ ఎండిపోయాయి. వేసవికాలంలో సాయంకాలం పూట ప్రతిరోజూ 40 – 50 కుండల నీళ్ళు నూతిలోంచి తోడిపోసేవాణ్ణి. ఇప్పుడు నా అస్వస్థత మూలాన్ని తోట పని కూడా ఆగిపోయింది. అసలుఏపనీ చెయ్యలేక పోతున్నాను. నిన్న తిండిలో ఏదో అవకతవకవల్ల అజీర్ణం చేసింది. ఆరో ఏడో పెద్దగా నీళ్లవిరోచనాలు అయాయి. దాంతో మరింత నీరసపడిపోయాను. ఈ ఉక్క, వేడి వల్ల కూడా నీరసం ఎక్కువగా ఉంటోంది. ప్రతిసంవత్సరం ఈ మే, జూన్ నెలలు నాకు దుర్భరంగా ఉంటాయి. ఈ ఏడు మరీఎక్కువనిపిస్తోంది. నేను నీరసంగా ఉన్నప్పటికీ, నువ్వేమీ ఆందోళన పడనవసరం లేదు. వాతావరణం చల్లబడితే ఏదైనా బలానికి మందు, విటమిన్ మాత్రలూ తీసుకుంటాను. ఆగస్టునాటికి బాగానే ఉంటాననుకుంటున్నాను...

ఈ శరీరం గురించి ఇంతగా ఇన్నిసార్లు రాయవలసి రావడం నా దౌర్భాగ్యం. "దేహాత్మ బుద్ధి" ని అధిగమించాలంటే, జీవితంలో సంభవించే ఇటువంటి చిన్నచిన్న సంఘటనలకు ప్రాముఖ్యాన్నివ్వకూడదు. శారీరక అసౌకర్యాన్నీ, బాధనీ అధిగమించాలి...

వివేకవంతుడైన నచికేతుడు – కఠోపనిషత్తులోని ధీరోదాత్తుడు – మరణం గురించి ఎంత మాత్రం భయపడలేదు. జీవితం, మరణం – నాణానికి రెండు వైపులులాంటివి. మరణంలేనిదే జీవితమే లేదు. మరణం యొక్క అసలైన అర్థాన్నీ, ప్రాముఖ్యాన్నీ సరిగా గ్రహించగలిగితే 'మరణం' విచారించ వలసిన విషయమేమీ కాదు. అందుకు పూర్తిగా విరుద్ధమైన సంగతి...

జిడ్డు కృష్ణమూర్తిగారు తరుచుగా ప్రశ్నిస్తూ ఉంటారు – హాయిగా, ఆరోగ్యంగా జీవించిఉండగా మరణాన్ని అనుభవించడం సాధ్యమేనా? – అని. అసలు మరణం అంటే ఏమిటి? కేవలం ఈ భౌతిక శరీరం నశించిపోవడమే కదా? కాకపోతే మరేమిటి? ఈ భౌతిక శరీరం మరణించినప్పుడు మనసు యొక్క స్థితి (ఆలోచన కాని, జ్ఞాపకం కాని) ఎలా ఉంటుంది ? మనకి అసలు మరణం అంటే భయం ఎందుకుంటుందో తెలుసా? బంధువుగాని, స్నేహితుడుగాని, ఎవరైనా పోతే మనం ఎందుకు విచారిస్తాం? – ఇది చాలా విస్తృతమైన విషయం. దాన్ని గురించి ఇప్పుడు రాయదలుచుకోలేదు. ఒక్కటి మాత్రం కచ్చితంగా చెప్పాలి. ఈ భౌతిక శరీరం నశించడం అన్నది తప్ప మరణం గురించి ఇది అని గానీ, మరణం అంటే ఇది అని గానీ ఏమీ చెప్పలేం. నచికేతుడు యమధర్మరాజు

నుంచి తెలుసుకున్నదిదే. కఠోపనిషత్తు ఉపనిషత్తులన్నిటిలోకీ కావ్య, సౌందర్య లక్షణాలు కలిగినటువంటిది. భగవద్గీతలో ఆ ఉపనిషత్తులోని శ్లోకాలెన్నో ఉన్నాయి. అదృష్టవశాత్తు, జిడ్డు కృష్ణమూర్తి గారి ప్రసంగాలు, రచనలూ చదివాక, ఈ విషయాల గురించి ప్రగాఢంగా ఆలోచించిన తరువాత నాకు కొంత జ్ఞానోదయమైంది.... ఈ పెడదారిలో పడినందుకు మన్నించు..."

ఇదివరకొకసారి ముఖాముఖీ మాట్లాడుతూ, "మరణం అంటే భయం దేనికి? దేనికి భయం?" అని అడిగారు నన్ను.

"భయంవల్ల కాదు, బాధ కలుగుతుంది. అనుబంధాలు అంతమవుతున్నందుకు" అన్నాను. "భయపడకూడదు, దానికి కారణాలివి" అంటూ నాకు నచ్చజెప్పాలని ప్రారంభించిన నాన్నగారికి కించిత్తు నిస్పృహ కలిగినట్లు, క్షణంసేపు ఊరుకుని, "నీ సంగతి కాదమ్మా నేను చెప్పేది..." అంటూ ప్రసంగాన్ని కొనసాగించారు!

* * *

మర్నాడు పోస్టులో నాన్నగారి వీలునామా కాపీ అందింది

"మృత్యుంజయుని వీలునామా"

జూలై 27, 1967 - మృత్యుంజయుని శరీరానికి 73వ జన్మదినం. (ఈ వీలునామాలో వ్రాసిన వాటిని కచ్చితంగా అమలు జరపాలి).

1. ..... పేరున ఏసియన్ ఎస్యూరెన్స్ కం. లిమిటెడ్‌లో జమ చేసిన 2000/- రూ॥లు (పాలసీ కాగితం పేము పెట్టెలో ఉంది) జీవిత భీమా తీసుకోవలసి ఉంది. దీన్ని .... మరణానంతరం ..... తీసుకోవాలి. శ్రీమతి ..... మృత్యుంజయుని అనంతరం ఇంకా బ్రతికి ఉన్నట్లయితే ఆ 2,000/- రూపాయల్నీ ఆవిడ ఖర్చు నిమిత్తం ..... ఆమెకు అందజెయ్యాలి. ఆమె మృత్యుంజయుని కన్న ముందుగా మరణించినట్లయితే .... దాన్ని వసూలుచేసి మృత్యుంజయుని మరణానంతరం నాలుగు సమభాగాలుగా విభజించి, తన ముగ్గురు చెల్లెళ్లకూ, తన కూతురికీ ...... పంచాలి.

2. ఈ శరీరానికి ఎక్కడ మరణం సంభవించినా, ఆ శవాన్ని వీలైనంత త్వరగా

దహనం చెయ్యాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ బంధువులు వచ్చేవరకూ అట్టిపెట్టకూడదు. మరణం రాత్రిపూట సంభవిస్తే తెల్లవారగానే దహనం జరిపించాలి. మరణం పగలు సంభవించినట్లయితే, మరణించిన రెండు మూడు గంటలలోగా దహనం జరిపించాలి.

3. దహనం జరిగిన తరవాత అస్థికలను అతి దగ్గరలోనున్న నీటి ప్రవాహంలో – ఏదయినా సరే – నిమజ్జనం చేయించాలి. అంతేకాని, వాటిని వారణాసి వంటి స్థలాలకు తీసుకు వెళ్లరాదు. ఏ పవిత్ర నదీజలాన్నీ ఈ శరీరం యొక్క అస్థికల్తో అపవిత్రం చెయ్యరాదు.

4. ఏ విధమైన కర్మకాండ, మంత్ర తంత్రాలూ (హిందూ ధర్మ సంప్రదాయం ప్రకారం) జరపనవసరం లేదు. దహన సంస్కారం జరిపిన తరవాత ఏవిధమైన కర్మకాండ జరపడానికి వీలులేదు. మృత్యుంజయుని ఆత్మకి అటువంటి కర్మకాండ ఏదీ అవసరం లేదు. ఈ కర్మకాండ అనేదాని విషయంలో మృత్యుంజయుడు అన్ని నమ్మకాల్నీ, మూఢ విశ్వాసాల్నీ అధిగమించాడు. మరణం యొక్క ప్రాముఖ్యం ఏమిటో కొంతవరకు తెలుసుకున్నాడు.

5. ఆ కర్మకాండ కోసం ఎవరూ ఏమీ ఖర్చుపెట్టకూడదు. ........ గాని, అతడి భార్యగాని ఈ విషయంలో ఎటువంటి ఇబ్బందీ కొంచెమైనా పడకూడదు.

6. కర్మకాండ చేయించే బ్రాహ్మడికి గాని, చేసేవాడికి గాని ఆ మంత్రాల అర్థం తెలియనప్పుడు, ఆ కర్మకాండలో నిజంగా ఎవరికీ నమ్మకం లేనప్పుడు, యజ్ఞోపవీతాన్ని నిర్భయంగా విసర్జించినప్పుడు ఇలాంటి కర్మకాండ జరిపిస్తే, ఆ డబ్బునీ, సమయాన్నీ వృథా చెయ్యడమూ, ఆత్మవంచన, లోకవంచన అవుతుంది. అందుచేత, కేవలం గొప్పకోసం కాని, బావుండదేమో అనే ఉద్దేశంతోకాని ఇటువంటి కర్మకాండని నాటకీయంగా యాంత్రికంగా జరిపించడాన్ని మృత్యుంజయ ఎంతమాత్రం సహించడు. అసలు మృత్యుంజయ కూడా ఎనిమిది తొమ్మిది సంవత్సరాల క్రితమే యజ్ఞోపవీతాన్ని విసర్జించి, పూజలు, తద్దినాలూ మొదలైన హిందూ కర్మకాండలన్నిటినీ మానుకున్నాడు. తన అసలు పేరునీ,

డిగ్రీలనీ విసర్జించాడు. ఆ విధంగా మతపరమైన కర్మకాండలకూ, పూజలకూ అతీతుడయాడు. అందుచేత, తన శరీరం మరణించిన తరవాత, ఏవిధమైన కర్మకాండ జరిపించకూడదని ఇందుమూలంగా తెలియజేస్తున్నాడు. ఈ సూచనలను ఎవ్వరూ ఎవరైనా ఏమైనా అనుకుంటారని అతిక్రమించడానికి వీల్లేదు.

7. మృత్యుంజయుని శరీరానికి దహన సంస్కారం నిమిత్తం దాని కొరకు కేటాయించిన సొమ్మునే వాడాలి. ఇంకెవరూ దానికోసం వేరే ఖర్చుపెట్టరాదు. ఒకవేళ ఈ శరీరం అనుకోని పరిస్థితిలో ఎక్కడైనా మరణించినట్లయితే, దహన సంస్కారం జరిపించిన వ్యక్తికి తరవాత, అందుకొరకు కేటాయించిన సొమ్ముని తిరిగి ముట్టజెప్పాలి.

8. ఈ శరీరం మరణించిన తరవాత .... మరణంగానే ప్రకటించాలి. ఎందుచేతనంటే, మృత్యుంజయుని మరణంగా ప్రకటిస్తే ఇన్సూరెన్స్ కంపెనీ నుంచి డబ్బు వసూలు చెయ్యడం కష్టమవుతుంది మునిసిపాలిటీ వారినుంచి ......మరణించినట్లు సర్టిఫికెట్ తీసుకుని దాన్ని .....కి పంపించాలి. మరణించినట్లు సర్టిఫికెట్ కావాలని ఇన్స్యూరన్స్ వాళ్లు పట్టుపడతారు. అందుకని, సర్టిఫికెట్ తీసుకుని ... .కి పంపించడంలో ఎంతమాత్రం ఆలస్యం చెయ్యరాదు.

9. దహన సంస్కారం చెయ్యగా 200/- రూ॥లు మిగిలినట్లయితే, నరసాపురంలో ఉన్న కుష్ఠురోగులైన సోదరులకు భోజనాలు పెట్టడానికి ఖర్చుపెట్టాలి. చక్కని భోజనాన్ని, వీలైతే బూరెలు వండించి పెట్టాలి. మృత్యుంజయకి చేయవలసిన కర్మకాండ ఇదొక్కటే. అర్థం పర్థంలేని కర్మకాండ చేసేకన్న ఈ పనిచేస్తే మృత్యుంజయకి ఎంతో ఆనందం కలుగుతుంది.

10. మృత్యుంజయ ఉపయోగించిన బట్టలన్నిటినీ గుడ్డలు లేని పేదవారికి పంచిపెట్టాలి.

11. పేము పెట్టెని (మరీ నిరుపయోగం కాలేదు) 52 సంవత్సరాల నుంచీ మృత్యుంజయ వాడుతున్న దానిని (దాన్ని మద్రాసులో 1915 లో కొనడం

జరిగింది). ఎవరికి నచ్చితే ఆ పాతకాలపు పెట్టెని వారు తీసుకోవచ్చు. చిన్న కొత్త బల్లని మాత్రం శ్రీమతి ... కొడుక్కి ఇవ్వాలి.

12. మృత్యుంజయుని హోమియోపతీ పుస్తకాల్నీ, మందుల్నీ ఎవరికి శ్రద్ధాసక్తులుంటే వారు తీసుకోవచ్చును. అధమం ...... అయినా హోమియోపతీలో ఆసక్తి పెంచుకుని ఆ మహామేధావుల గ్రంధాలను చదివితే బావుంటుంది. లేదా, మందుల్నీ, పుస్తకాల్నీ ఏదైనా సంస్థకు దానం చెయ్యవచ్చు. జిడ్డు కృష్ణమూర్తిగారి "పెరీనియల్ ఫిలాసఫీ" అనే గ్రంధాన్నీ, తక్కిన ప్రసంగ గ్రంధాల్నీ .... తీసుకోవాలి.

13. రిస్టు వాచీ (పాతకాలపు మోడల్‌దైనా చాలా మంచిది) జెనిత్ అలారం టైంపీసూ, తక్కిన వస్తువులూ .... తీసుకోవాలి.

14. పెట్టెలో ఇంకేమైనా వస్తువులు కనిపిస్తే మృత్యుంజయుని సోదరులైన బీదవాళ్ల కెవరికైనా పంచిపెట్టాలి.

15. మృత్యుంజయ తన అనంతరం వదిలివెళ్లేది సుహృద్భావం, ప్రకృతిలోని ప్రతి ప్రాణిపట్ల ప్రేమ - అంతకు మించి మరేం లేదు.

మృత్యుంజయ

* * *

నేను ఉద్దేశపూర్వకంగానే, డబ్బు పంపించడంకోసం పెళ్లికి వెళ్లలేదని బాధపడుతూ, అక్క, అమ్మ ఉత్తరాలు రాశారు. వాళ్లని అవమానపరిచినట్లు బాధపడ్డారు. ఒకవైపు ఆయన ఆరోగ్యం ఇంకా పూర్తిగా నయంకాకపోవడం, మరోవైపు ఆఫీసులో అసంతృప్తికరమైన పరిస్థితులు - ఎంత సమాధాన పడదామనుకున్నా నిరాశ, నిస్పృహలు ఆవహించాయి నన్ను. నాన్నగారు పంపిన వీలునామా చూసి నేనేమీ వ్యాఖ్యానిస్తూ ఉత్తరం రాయనందుకు నాన్నగారు ఏమైనా అనుకుంటారేమోనని సందేహిస్తూ, నా మనస్సేమీ బావుండటం లేదనీ, ఆయన ఆరోగ్యం ఎలా ఉన్నదీ తెలియజేయవలసిందనీ క్లుప్తంగా రాశాను. దానికి జవాబుగా నాన్నగారు పెద్ద ఉత్తరం రాశారు.

"Give me nor ease nor goal
only the way,

A bit of bread and sleep
Where the white waters play,
The tall pines
The patient stars
And the New Day."

సుఖము మోక్షంబు వలదు నాకు
మార్గంబు మాత్రమున్ జాలు
అల్పాహారంబు నిదురయు
నిర్మలోదకంబులాడుచోట
ఆకసము కెగయు వృక్షములు
ఓర్పుగల తారలును
మరియు నవ్యదినము

ఇంగ్లీషులో ఆ పద్యం చాలా బావుంటుంది. తెలుగులోకి నేను చేసిన అవకతవక అనువాదం ఇది (కవుల కోసం కాదు!).

నువ్వు రాసిన ఉత్తరంలో 'జీవితం అర్ధశూన్యంగా కనిపిస్తోందనీ, నిరాశ, నిస్పృహ కలుగుతున్నాయనీ ఏదేదో రాశావు. పైన రాసిన పద్యం నీ సమస్యకి సమాధానాన్నివ్వవచ్చు. ఈవిషయం గురించి జిడ్డు కృష్ణమూర్తిగారు అనేకసార్లు ప్రసంగించారు. ఆయన ఇచ్చిన వివరణ ఎంతో జ్ఞానోదయం కలిగించేలా ఉంటుంది. ఆయన 1966లో యూరోప్‌లో చేసిన ప్రసంగాలున్న పుస్తకాన్ని నీకు కొద్దిరోజుల్లో పంపిస్తాను. అవి ఎంతో విజ్ఞానదాయకంగా ఉంటాయి. నువ్వు వాటిని చదవాలి - (ఊరికే చదివెయ్యడం కాదు) పరిశీలనాత్మకంగా అధ్యయనం చెయ్యాలి. ఇంగ్లీషులో ఆయన శైలి చాలా సరళంగా ఉన్నప్పటికీ, చెప్పిన విషయాలు మాత్రం క్లిష్టంగానే ఉన్నట్లనిపిస్తుంది. - ముందుగా కొంచెం తెలిసి ఉండకపోతే. నువ్వు తెచ్చిన ప్రసక్తి అత్యంత ముఖ్యమైనది - దాన్ని సరియైన దృక్పధంతో చూడాలి.

ప్రప్రధమంగా నువ్వు "ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్" అనే గ్రంధంలో ఉన్న (నీ దగ్గర ఒక కాపీ ఉందనుకుంటాను) 'బోర్‌డమ్' అనే విషయం గురించి చదువు. నేను చేసిన అనువాదాన్ని కూడా చూడు. 'బోర్‌డమ్' - విసుగుదల అనే అధ్యాయంలో చాలా విపులంగా ఉందా విషయమై దయచేసి చదువు.

ఇప్పుడు ఆ ప్రశ్న గురించి చూద్దాం. జీవితం అర్థశూన్యంగా ఎందువల్ల తయారైంది? చేసిందే చేస్తూ విసుగు పుట్టిస్తోంది ఎందువల్ల? ఈ నిరాశ, నిస్పృహ ఎందువల్ల కలుగుతున్నాయి?

ఇది చాలా ముఖ్యమైన, మౌలికమైన ప్రశ్న. ఆలోచించే ప్రతి వ్యక్తీ పరిశీలించవలసిన సమస్య. మనకి ఎప్పుడు విసుగు పుడుతుంది? చేసిన పనిని పదే పదే చెయ్యవలసి వచ్చినప్పుడూ, దాంట్లో ఏమీ ప్రయోజనం, ప్రాముఖ్యం కనిపించనప్పుడు - అవునా? పదే పదే చెయ్యడం అంటే, ఒకే రకమైనది కొనసాగుతూ ఉండటం అన్నమాట. గతం కొనసాగుతూ ఉండటం - గత ఆలోచనలూ, గతానుభవాలూ - ఇలా గతంలో ఉన్నవే కొనసాగుతూ ఉంటాయి. నిజానికి, అసలు వర్తమానం అనేది లేనట్లే ఉంటుంది మనకి. వర్తమానం అంటే కొనసాగుతున్న గతమే. భవిష్యత్తు అంటే గతం, వర్తమానం కలిసి కొనసాగడమే. ఇది స్పష్టమైంది కదా.

ఆలోచన అనేది ఎప్పుడూ గతంలోంచే ఉద్భవిస్తుంది - జ్ఞాపకంమీద ఆధారపడినటువంటిది. ఈ ఆలోచనే - అంటే, నిన్నటియొక్క, ఎన్నో నిన్నటిరోజుల యొక్క జ్ఞాపకమే - ఈ విసుగుదలకీ, నిస్పృహకీ కారణమవుతుంది. ఏ ఒక్క రోజూ మనకి కొత్తగా కనిపించదు

ఆ పద్యంలో ఉన్న "న్యూడే" అనేదానికి ఏమిటి అర్థం? ప్రతి ఒక్కరోజూ ఒక కొత్తరోజు అయినట్లయితే విసుగుదలకి ఆస్కారమే ఉండదు. ఆకవి ప్రతిరోజూ కొత్తరోజు కావాలని ఆకాంక్షించాడు. అది సాధ్యమవుతుందా? ప్రతిరోజూ ఒక కొత్త రోజుగా మనం జీవించడం సాధ్యమేనా? అదే ముఖ్యమయిన ప్రశ్న. ప్రతిరోజూ కొత్తరోజుగా ఎప్పుడవుతుంది? అది గతంవల్ల కల్మషంకాకుండా, తాజాగా వికసించినప్పుడే - నిన్నటి గొడవలూ, బాధలూ అంటుకోకుండా ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. 'ఈరోజు' తాజాగా, కొత్తగా ఎలా ఉంటుంది? 'నిన్న' అనేది అంతమైనప్పుడు, గడిచిన 'నిన్నటి' రోజులన్నీ అంతమైనప్పుడు, మానసిక సంబంధమైన గతమంతా అంతమొందినప్పుడు, గతించిన అనుభవాలు వర్తమానంమీద ప్రభావాన్ని చూపకుండా ఉన్నప్పుడు 'వర్తమానం' వాస్తవిక మవుతుంది, వినూత్నమవుతుంది.

అయితే, మరోప్రశ్న ఏమిటంటే - గతాన్ని అంతమొందించడం

సాధ్యమవుతుందా? అనేది. మరోవిధంగా చెప్పాలంటే, ఆలోచన అనేది ఆగిపోవడం సాధ్యమేనా? మనస్సు ఎంత ప్రయత్నించినా (మనస్సుచేసే ప్రతి ప్రయత్నమూ ఆలోచనే) ఆలోచనని అంతం చెయ్యలేదు. మరణం అంటే మరేదీ కాదు - కొనసాగుతూ ఉండే ఆలోచనా ప్రక్రియ ఆగిపోవడమే.

ఆలోచన - జ్ఞాపకం - ఇదే 'నేను', 'అహం' అనబడేవి. ఆలోచన అంతమొందడం అంటే 'నేను' అనేభావం అంతం కావడమే. మరణంతోనే పునర్జీవనం, పునరుద్భవం, పునర్నిర్మాణం, ఒక నూతన దినం. నిన్న అనే ప్రతి రోజునూ త్యజించగలిగితే 'నేడు' అనే కొత్తరోజు సాక్షాత్కరిస్తుంది. ఆ కొత్తరోజే ఆ కవి స్వప్నం, ఆదర్శం - తత్త్వవేత్తగమ్యం. కృష్ణమూర్తిగారు ఎన్నో ప్రసంగాల్లో పదే పదే సూచించారు - ఆలోచన పూర్తిగా ఆగిపోవాలంటే, పరిజ్ఞానం, అవగాహన - నిర్వివక్షతోకూడిన పరిజ్ఞానం, అవగాహన ఉండాలి - అని- చిత్తవృత్తి నిరోధః" అని యోగ సూత్రాల్లో పతంజలి వివరించినట్లుగా.

ఇలాంటి ఉత్తరంలో ఈ విషయమై ఇంతకన్న విపులంగా విశదీకరించడం నాకు సాధ్యంకాదుకదా. నువ్వు "బోర్‌డమ్"అనే అధ్యాయాన్ని చదువు. నేను పంపబోయే ప్రసంగాల గ్రంథాన్ని కూడా చదివితే నీకు సమస్య పూర్తిగా అవగాహన అవుతుంది.

ఇంకొకటి చెబుతున్నాను - గతాన్ని అంతమొందించడం - అంటే, ఆలోచనని అంతం చెయ్యడం ద్వారానే మనస్సుకి స్వేచ్ఛ లభిస్తుంది - స్వయంకృతమైన ఈ మానసికబంధాల్ని తొలగించుకోవడమే మోక్షం - ఈ మనో నిశ్చలత్వమే - ఇదే ఉన్నత యోగం. దాన్నే కొందరు దైవంఅనీ, సత్యంఅనీ అంటారు. దైవం అనేది మానసిక చైతన్యమే - మనస్సు నిశ్చలంగా ఉండి, ఎంతో చురుకుగా సమస్త విశ్వాన్నీ ఆకళింపు చేసుకుంటూ చైతన్యవంతంగా ఉండటమే.

ఇంకొకటి కూడా అర్థం చేసుకోవాలి- దైవం, ప్రేమ - అనే రెండుపదాల్ని మనిషి దురుపయోగం చేస్తూంటాడు. నిజానికి మనిషికి దైవం అన్నా, ప్రేమ అన్నాకూడా తెలియదు. మనిషికి తెలిసినది కామం - ఒక మనిషికోసం, ఒక వస్తువుకోసం, ఒకభావంకోసం మమకారం. కానీ, ఇది ప్రేమ మాత్రం కాదు. ప్రేమకూడా దైవంలాగే అవ్యక్తమైనది. స్వార్థం లేనప్పుడే ప్రేమ, దైవత్వం

ఉదయిస్తాయి. స్వార్థపరత్వం పూర్తిగా నశించినప్పుడే దైవత్వం సిద్ధిస్తుంది. ప్రేమ అనేదాన్ని ఈ లోకంలో దేనితోనైనా పోల్చగలగాలంటే - అది ఒక్క 'సూర్యకాంతి' తోనే, సూర్యకాంతిలా పవిత్రంగా, నిష్కల్మషంగా, నిష్పక్షపాతంగా ఉన్నప్పుడే అది ప్రేమ అనిపించుకుంటుంది. మనం ప్రేమ అనుకునేది కల్మషమైనది, వ్యాపార బద్ధమైనది. ఇంతకన్నరాయలేను. ఆపుస్తకాన్ని త్వరలోనే పంపిస్తాను. అర్థమయ్యే అరడజను సార్లయినా చదువు. నేను అయిదోసారో, ఆరోసారో చదువుతున్నాను. అంతాక్షేమం. నేను కోలుకుంటున్నాను. నీ అమెరికాఉద్యోగం సంగతి ఏమైంది? ..."

నా అమెరికా ఉద్యోగం సంగతి ఏమీ కాలేదు. నీళ్లమూటే అయింది. దాని గురించి నేనేమీ విచారించలేదు. ఇంకా, ఆఉద్యోగంవస్తేనే క్లిష్టసమస్యని ఎదుర్కోవలసివచ్చేది - దంపతులిద్దరం చెరోచోటా ఉండవలసివచ్చేది - అసలే ఆయన ఆరోగ్యం బావుండట్లేదు - అన్నీమనమంచికే అని ఊరుకున్నాను. నేనేదో ఊరికే ఇంట్లో ఖాళీగా కూర్చున్నట్లు, నాన్నగారు నన్ను ఊదరగొడుతున్నారు - కృష్ణమూర్తిగారి పుస్తకాన్ని అయిదుసార్లు, ఆరుసార్లు చదవమంటూ, ఇంట్లోపని, ఆఫీసులోపని, ఇదికాక, 'చైనీస్' నేర్చుకుంటున్నాను ఉద్యోగరీత్యా. ఎంతనిరాశ, నిస్పృహ మనస్సులో ప్రవేశించినా, చెయ్యవలసిన పనులు ఆగవుకదా. వీటికితోడు నాన్నగారికి ఎప్పటికప్పుడు సమాధానాలు రాసేయజ్ఞం ఒకటి!

"... చైనీస్‌వంటి కఠినమైన భాషలో - నువ్వు పరీక్షల్లో అంత బాగారాసినందుకు నీకు నా హృదయపూర్వక అభినందనలు. నీభర్త నిన్ను చూసి గర్విస్తున్నాడనుకుంటాను... మీ అన్నయ్య జర్మన్, రష్యన్ భాషల్లో డిప్లొమాలు పొందాడు. నాకు ఎందులోనూ లేదు! స్త్రీలకు చదువు చెప్పిస్తే పురుషులకన్న శ్రద్ధగా, తీవ్రంగా కృషి చేస్తారనుకుంటున్నాను." అని రాశారు నాన్నగారు.

మరోవైపునుంచి అమ్మ ఉత్తరాలు - నాదగ్గరికీ, మా అన్నయ్య దగ్గరికీ వచ్చి కొన్నాళ్లపాటు ఉండాలని ఉందంటూ. అమ్మ ఒక్కర్తీ వస్తే నాన్నగారు ఒక్కరూ వండుకుతినాలి. ఇప్పటికే అమ్మ ఎన్నోసార్లు ఇక్కడికీ అక్కడికీ వెడుతూ వచ్చింది. నాన్నగారిని ఈవయస్సులో ఒంటరిగా వదలి వెళ్లడం మంచిది కాదనిపించి, "వస్తే ఇద్దరూ కలిసి రండి" అని అమ్మకు రాశాను. అదే నాన్నగారికి కూడా రాశాను. దానికి వెంటనే సమాధానం ఇలా రాశారు:

"... (1) నువ్వు మీ అమ్మగారిని ఢిల్లీలో నీ దగ్గర ఉండటానికి తాత్కాలికంగా కాని, శాశ్వతంగా కాని ఆహ్వానిస్తే నాకేం అభ్యంతరం లేదు. మీ అమ్మగారు ఢిల్లీలోగాని, మరెక్కడైనా గాని ఆవిడకి నచ్చిన చోట ఎక్కడ ఉండాలనుకుంటే అక్కడ ఉండొచ్చును. నాకేమాత్రం అభ్యంతరం ఉండదు. మాకు ఎడబాటు కలుగుతుందన్న ప్రశ్నే లేదు.

(2) భార్యగా ఆవిడని నేను శారీరకంగా కాని, మానసికంగా కాని ఏ విషయంలోనూ ఆదేశించడం లేదు. అసలు మానసికంగా కూడా ఆవిడనిప్పుడు నేను భార్యగా పరిగణించడం లేదు. చిరపరిచితురాలిగానూ, చిరకాల స్నేహితురాలిగానూ ఆవిడతో ప్రవర్తిస్తాను. ఏవిధమైన ప్రాథమిక విషయంలో కూడా మాకు ఏకాభిప్రాయం లేదు. గృహసంబంధమైన విషయాల్లో కూడా లేదు. నాకేమీ విచారం లేదు. లోపాలున్నాయనే బాధ లేదు. ఎలాంటి లోపాలూ ఎత్తి చూపకుండా ఉన్న పరిస్థితుల్లోనే జీవితాన్ని సాగిస్తాను.

(3) నీకు తెలుసుననుకుంటాను. మా అన్నయ్య అంధుడైనా (మశూచికం వచ్చి చిన్నప్పుడే కళ్లు పోయాయి) కోరుకొండలో ఒంటరిగా బ్రతికేవాడు. పన్నెండు సంవత్సరాలపాటు ఒక్కడూ వండుకు తింటూ ఉండేవాడు. అంచేత ఇది మా వంశంలో ఉన్నదే. నాకు ఏ విధమైన ఆనందం, సౌఖ్యం కావాలని అనుకోను. వంట చేసుకోవడం, నూతిలోంచి నీళ్లు తోడుకోవడం నాకేమీ కష్టమనిపించదు. రెండు, రెండున్నర గంటలసేపు శారీరకంగా శ్రమపడతాను. 50-60 కుండల నీళ్లు తోడి మొక్కలకు పోస్తాను. అవే నా బిడ్డలు.

నేను ఏ పని చేస్తున్నా, ఆ పని అంటే ఇష్టపడతాను. ఆ పని వంటపని అయినా, తోట పని అయినా, బజారుకి వెళ్లే పని అయినా, పాకీ దొడ్డి తుడిచేపని అయినా (నేను మంచి పాకీవాణ్ణని తెలుసుగా! రాజమండ్రిలో నెల్లాళ్లకు పైగా స్ట్రైకు జరిగినప్పుడు లెట్రిన్లు నేను ఎంత బ్రహ్మాండంగా శుభ్రం చేశానో!) అంచేత, అదేమంత శ్రమ అనిపించదు నాకు. నేనే పని చేసినా ఇష్టంగా చేస్తాను. ఇక్కడ నా స్నేహితుల మనవలికి - పి.యు.సి., బి.ఎ. చదువుతున్న వాళ్లకి ఇంగ్లీషు నేర్పుతున్నాను. ఎంతో ఇష్టంగా చేస్తున్నానా పని. మీ అమ్మగారు నాకు పూర్తిగా విరుద్ధం. ఆవిడకి సుఖంగా ఉండటం, సునాయాసంగా పని చేసుకోవడం ఇష్టం. ఆవిడకి సినిమాలకి వెళ్లడం ఇష్టం. (నేను సినిమాకి వెళ్లి పన్నెండేళ్లకు పైనవుతుంది). ఆవిడకి ప్రయాణాలు, యాత్రలు - అలాంటివన్నీ ఇష్టం.

(4) ప్రతి రోజూ ఒక కొత్త రోజుగా బ్రతకడమే సూత్రంగా పెట్టుకున్నాను."

ఈ ఉత్తరం రాసిన కొద్ది రోజులకే మరో ఉత్తరం రాశారు.

"... మీ అమ్మగారు అయిదు రోజుల క్రితం కొంతమంది బంధువులతో కలిసి హైదరాబాదు వెళ్లారు. ఎందుకు వెళ్లారో నాకు తెలియదు. నేనే పగలూ, రాత్రీ వండుకు తింటున్నాను. ఎందుకంటే, నా కూతురి ఇంట్లోనయినా సరే, ఒక్క నెలరోజుల పాటయినా భోజనం చెయ్యడమంటే నాకు ఇష్టం ఉండదు..

నువ్వు ఇదివరకొకసారి "బెర్ట్ రాండ్ రస్సెల్ స్పీక్స్ హిజ్ మైండ్" అనే పుస్తకాన్ని పంపించావు కదా. దానికి నేను చేసిన తెలుగు అనువాదాన్ని నీకు పంపించాను. దాన్ని నువ్వు సరిదిద్ది, పఠనీయంగా ఎందుకు చెయ్యకూడదు ? నేను ఆ విధంగా రాయలేదు. ఎందుచేతనంటే, నాకు జి.వి. సుబ్బారావుగారు వ్యాకరణ శుద్ధమైన గ్రాంధిక భాషలోనే రాయడం నేర్పారు. ఏదైనా గ్రంథం ఇంగ్లీషులో బావుంటే, దాన్ని తెలుగులోకి అనువదిస్తే అది తెలుగులో కూడా మంచి గ్రంథంగా రూపొందుతుంది. తెలుగు అనువాదాన్ని ప్రచురించడానికి అనుమతి సంపాదించడం సాధ్యమవుతుందా? ఆ విషయమై నీ భర్త ఏమైనా ప్రయత్నించగలడా ? దాన్ని నువ్వు నీ పేరుతోనే ప్రచురించవచ్చు. నాకు ఏ కీర్తి, గుర్తింపు అవసరం లేదు. నేను చేసిన తెలుగు అనువాదం, నువ్వు సరిదిద్దిన తరువాత ప్రచురణకీ, అమ్మకానికీ అనువుగా ఉంటుందంటావా? ఈ విషయం గురించి నీకు రాసి కనుక్కోమని ఒక స్నేహితుడు సలహా ఇచ్చిన మీదట నీకు రాస్తున్నాను. జిడ్డు కృష్ణమూర్తిగారి "ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్" కి తెలుగు అనువాదాన్ని ప్రచురించడం కుదరదు. చాలా ఖర్చవుతుంది. పైగా దాన్ని కొనే వాళ్లుండరు. అనువాదం బాగానే ఉందని కొంతమంది మిత్రులు అన్నారు. నువ్వు "రస్సెల్ అభిభాషణ" గురించి ఎందుకు ప్రయత్నించకూడదు?"

ప్రస్తుతానికి నాకు అటువంటి పథకాన్ని చేపట్టడానికి తీరిక లేదనీ, వీలైనప్పుడు తప్పకుండా ప్రయత్నిస్తాననీ రాసి, అప్పటికి తప్పించుకున్నాను. ఆ ఏడు మళ్లీ జిడ్డు కృష్ణమూర్తిగారి ప్రసంగాల్ని వినడం జరిగింది. మేమిద్దరం ఆ ప్రసంగాల్ని విన్నామనీ, తరవాత కృష్ణమూర్తిగారి పుస్తకాన్ని మరోసారి చదివాననీ, ఈసారి బాగా అవగాహన చేసుకోగలిగాననీ, అయినా, ఎన్నో సందేహాలు కలుగుతూ ఉంటాయనీ రాశాను నాన్నగారికి. ఈపాటికి అమ్మ

నరసాపురం తిరిగి వచ్చి వుంటుందనుకుంటానని రాశాను. దానికి సమాధానం వచ్చింది.

"…. మీ అమ్మగారు సంక్రాంతి వెళ్లేవరకూ హైదరాబాదులోనే ఉంటారని తెలిసింది. ఆవిడ గత నాలుగు సంవత్సరాల నుంచీ కష్టపడి చాకిరీ చేశారు. ఓ రెండు నెల్లపాటు విశ్రాంతి ఆవిడకి నిజంగా అవసరమే. (అక్కడ సొంత ఇంట్లో మేడమీద గదిలో ఒంటరిగా ఉంటున్నారుట). ఇదీ మంచిదే అయింది. నాకూ ఓ విధంగా విశ్రాంతిగానే ఉంది – నా వంట నేను చేసుకుంటూ, హాయిగా స్వేచ్ఛగా ఉంది!

కృష్ణాజీ ప్రసంగాలపట్ల నీకు అభిరుచి కలుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. అంతః పరిశీలన, ధ్యానం అనే విషయాల గురించిన ప్రశ్నకి సమాధానం ఆయన గ్రంథాల్లో చాలా బాగా వివరించారు. నిరాశ, నిస్పృహ గురించి కూడా కృష్ణాజీ ఎన్నో సందర్భాల్లో ప్రస్తావించి, ఆ సమస్యా పరిష్కారం గురించి వివరించారు.

అర్థం కాలేదని తొందరపడి అసహనాన్ని ప్రదర్శించకు. కృష్ణాజీ ప్రసంగాలను మళ్లీ చదివి, ఓర్పుగా నిరీక్షించు. ఫలితం కోసం, పరిష్కారం కోసం ఎదురుచూడకు. నిదానంగా ప్రశాంతంగా చదువుతూ విత్తనాన్ని నాటు. మెల్లిగా మొలకెత్తి ఎదగనీ. భూమి – అంటే, మనస్సు – సుసంపన్నంగా, పరిశుద్ధంగా, శుభ్రంగా ఉండేటట్లు చూడు. కాల క్రమేణా ఫలితం కనిపిస్తుంది. నా ఉద్దేశం ఏమిటంటే ప్రశాంతంగా ఉన్న మనస్సు సమస్యని అవగాహన చేసుకుని పరిష్కారాన్ని చూపగలుగుతుంది. అయినా, నిస్పృహదేనికి? నువ్వేదో కావాలనుకుంటేనూ, దేని కోసమో ఎదురుచూస్తేనూ తప్ప నిస్పృహ ఎందుకు కలుగుతుంది? ఇప్పుడున్న స్థితి మారాలనీ, ఇంతకన్న మెరుగు పడాలనీ, ఇంకా ఏదో లభించాలనీ ఆశిస్తే తప్ప నిస్పృహ ఎందుకు కలుగుతుంది? జీవితం చాలా విస్తృతమైనది, వైవిధ్యంతో కూడుకున్నటువంటిది, ఎంతో సుసంపన్నమైనటువంటిది, ఎంతో సుందరమైనటువంటిది. అంటువంటి జీవితంలో నిస్పృహకి తావుండ కూడదు. నిజంగా ప్రతి దినం ఒక 'నవ్య దినం' కాగలిగినట్లయితే నిస్పృహకీ, విసుగుకీ తావే ఉండదు. ప్రతి 'నిన్న' గతించిందని గ్రహించ గలిగితే ప్రతి 'నేడు' ఒక నవ్య దినం అవుతుంది. నిత్య నవజీవనంలో నిస్పృహ అనేదే ఉండదు.

'ఉండద'ని రాసినా, అమ్మ వెంటనే తిరిగి రాలేదని నాన్నగారు నిస్పృహ చెందుతూనే ఉన్నారు !

"......మీ అమ్మగారు సంక్రాంతి వెళ్లే వరకు గాని, శివరాత్రి వెళ్లే వరకూ గాని హైదరాబాదులోనే ఉంటారనుకుంటాను. నా వంట నేనే చేసుకుంటున్నాను. బాగానే ఉన్నాను". అని ఒక ఉత్తరంలోనూ, "........మీ అమ్మగారు ఇంకా హైదరాబాదులోనే ఉన్నారు. అవిడ అక్కడ శివరాత్రి వరకూ ఉంటారో, సంవత్సరాది వరకూ ఉంటారో నాకు తెలియదు" అని మరోసారీ రాశారు. అయితే, అమ్మ త్వరలోనే హైదరాబాదు నుంచి తిరిగి వెళ్లింది. నేను ఉత్తరం రాస్తూ, అన్నయ్య అమెరికా నుంచి తిరిగి వచ్చిన సంగతి తెలియబరచాను. ఆ విషయం అయనకీ తెలిసింది. అంతేకాదు.

".......మీ అన్నయ్య దగ్గర నుంచి వచ్చిన ఉత్తరంలో (1) ఆంధ్ర ప్రదేశ్ హై కోర్టు మాజీ ఛీఫ్ జస్టిస్ అధ్యక్షతన ఏర్పడిన గంగానదీ కాలుష్య విచారణ (బరౌనీ ఆయిల్ రిఫైనరీ దగ్గర గంగానదిపై మంటలు లేవడం గురించి) సమితిలోని నలుగురు సభ్యులలో తనూ ఒక సభ్యుడిగా నియమితుడైనట్లూ, ఆ పని చాలా బాధ్యతాయుతమైనదీ, ముఖ్యమైనదనీ, (2) ఏదో ఆఫీసు పని మీద మళ్లీ అమెరికా వెళ్లి మూడు వారాల పాటు ఉండాలనీ, (3) మూడు నెలల పాటు పని ఒత్తిడి చాలా ఎక్కువగా ఉంటుందనీ, (4) భార్య, పిల్లలూ వచ్చి నరసాపురంలో ఒక వారం రోజుల పాటు ఉంటారనీ, తను ఈ ప్రాంతాలకి రాగలగడమనేది సంభవిస్తే, అది మూడు నెలల తరవాతేననీ రాశాడు.

ప్రస్తుతం నేనొక పుస్తకాన్ని తిరిగి రాసే బృహత్కార్యాన్ని నిర్వహిస్తున్నాను. కృష్ణ మూర్తిగారి "ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్" అనే గ్రంథానికి నేను చేసిన తెలుగు అనువాదం చిత్తు ప్రతిని చింపివేసే ముందు దాన్ని మరోసారి కాపీ చేస్తున్నాను. ఇది ఆరవ కాపీ. ఇంతకు ముందు హైదరాబాదులో ఉండగా అయిదు కాపీలు తయారు చేసి, నీ కొకటి, రాయలసీమలో ఒకటి, రాజమండ్రిలో టి.ఎస్.లాడ్జిలో ఒకటి, తాపేశ్వరం లాడ్జికి ఒకటి, బి.వి.ఆర్. గారికి ఒకటీ ఇచ్చాను. ఈ పుస్తకం 440 పేజీలది. ఇది నిజంగా శ్రమతో కూడుకున్న పనే. మొదలుపెట్టి పన్నెండు రోజులైంది. ఇప్పటికి 270 పేజీలు పూర్తి చేశాను. ఇంకా 170 పేజీలు

కాపీ చెయ్యాలి. శారీరకంగా శ్రమ కలిగి తీరుతుంది. ఈ అనువాదం బాగా లేదంటావా ? ఏమో మరి, నాకైతే చాలా నచ్చింది!!!

నా తోట వృద్ధి చెందుతోంది. నౌకరుని పెట్టుకునే ప్రశ్నే లేదు. ఈ శరీరానికి సుఖం, విశ్రాంతి అనేవి అవసరం లేదు.." అని రాసి, ఆ తరవాత, అలవాటు ప్రకారం బంధువుల గురించి విశేషాలన్నీ రాశారు. ఎవరెవరు ఏయే పరీక్షలు పాసైనదీ, ఫెయిలయినదీ, ఎవరికి ఎన్నో నెల గర్భమో, ఎవరికి ఏయే జబ్బు చేసిందో, ఎలా ఉన్నారో – ఇలాంటి విశేషాలు.

నేను నాన్నగారికి రాసే ఉత్తరాల్లో మా క్షేమ సమాచారాన్ని తెలిపిన తరవాత, నాన్నగారి ఉత్తరాల్లో ఉన్న ముఖ్య అంశాల గురించి ప్రస్తావించి, ఆఖరున, ఫలానా ఫలానా వాళ్లు ఎలా ఉన్నారు, ఫలానా ఫలానా వాళ్లని అడిగానని చెప్పండి – అంటూ రాసే దాన్ని (ఇన్‌లాండ్ లెటర్ నింపక పోతే ఆయనతో అదొక తంటా కదా!) – దానికి నాన్నగారు తప్పకుండా ఒక్కొక్కరి గురించే వివరాలన్నీ రాసేవారు. నేను కూడా నాన్నగారిలా వివరంగా మా అత్తవారందరి గురించీ విశేషాలు రాయాలని ఆశించేవారు. తీరిక దొరకడం లేదనే సంజాయిషీని ఆయన స్వీకరించరు.

* * *

వేసవి సెలవుల్లో, అన్నయ్య అంతకు ముందు రాసినట్టుగానే – వదిన, పిల్లలూ నరసాపురం వెళ్లి కొద్ది రోజులున్నారుట. వాళ్లొచ్చి ఉన్నందుకు నాన్నగారు చాలా సంతోషించారు. ముఖ్యంగా, అన్నయ్య కొడుకు – పన్నెండేళ్లవాడు – వాడిని చూసి సంబరపడుతూ ఉత్తరం రాశారు నాన్నగారు.

"......గత ఎనిమిది రోజులూ మీ అన్నయ్య కొడుకుతో చాలా ఆనందంగా గడిపానని చెప్పాలి. వాడు బాగా పొడుగవుతున్నాడు. చాలా చక్కని ఇంగ్లీషు మాట్లాడతాడు. తెగ చదువుతాడు. వాడికున్న విషయ పరిజ్ఞానం చెప్పుకోదగినది. చాలా ధారాళంగా మాట్లాడతాడు. వాడికి ఎన్ని విషయాల గురించి తెలుసునో – ఆశ్చర్యమనిపించింది. వివిధ ప్రదేశాల గురించీ, మనుషుల గురించీ, ఎన్నో విషయాల గురించీ సరియైన సమాచారాన్ని ఇవ్వగలడు. వాడిలో "జీనియస్" లక్షణాలున్నట్లు తోస్తోంది నాకు. ఒక్క రోజున్నరలో రెండు నవలలు – "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్ (ఆలివర్ గోల్డ్ స్మిత్‌ది), థామస్ హార్డీరాసిన "ఫార్‌ఫ్రమ్‌ది

మేడెనింగ్ క్రౌడ్'' చదివేశాడు. వాటి కథలు- ముఖ్యవివరాలన్నిటితో బాటూ నాకు చెప్పగలిగాడు. చదవడానికిక్కడ పుస్తకాలులేవంటున్నాడు. ప్రముఖ రచయితల నవలలు కావాలంటున్నాడు. ఎర్ల్‌స్టాన్లీ గార్డ్‌నర్ నవలలు కావాలంటున్నాడు. ఎర్‌స్టాన్లీ గార్డ్‌నర్ నవలలు ఎనిమిదో తొమ్మిదో, అయాన్ ఫ్లెమింగ్‌వి, జేమ్స్‌బాండ్ నవలలు ఎనిమిదో తొమ్మిదో చదివాడుట. ఇంకా ఎన్నో పుస్తకాలు చదివినట్లు చెప్పాడు. ఆర్థిక శాస్త్రం గురించి - ప్రాథమిక సూత్రాలని తెలిపే పుస్తకం ఏదైనా చదవాలని ఉందిట. షేక్స్‌పియర్ నాటకాలు, చార్ల్స్‌లాంబ్ కథలూ చదవాలని ఉందిట కానీ, అవి ఇక్కడ దొరకలేదు. వాడి గ్రంథ పఠనాసక్తిని ప్రోత్సహించాలి మనం. గ్రాడ్యుయేషన్ చేసినవాడుకూడా వీడితో అంత సులభంగా, ధైర్యంగా సంభాషించలేడు. వాడికి ఉన్న ఇంగ్లీషుస్థాయికీ, వాడికున్న విషయపరిజ్ఞానానికీ నేను నిజంగా ఆశ్చర్యబోయాను. వాడికి ఇండియన్ ఫారిన్ సర్వీస్‌కి వెళ్లాలని ఉందిట. దానికి తగిన శిక్షణ పొందుతాడుట! అది విని నాకు ఆనందాశ్చర్యాలు కలిగాయి.

నీకు నా సలహా ఏమిటంటే, వాడికి వీలైనన్ని మంచి ప్రఖ్యాత గ్రంథాల్ని (ఆర్థిక శాస్త్రం మీదకూడా) బహూకరించు. గత రెండు సంవత్సరాల్లో వాడు చాలా అభివృద్ధిచెందాడు. నేను రాసిన 6 వ కాపీని వాడికి బహూకరించాను.''

అన్నయ్య కొడుకు సమక్షంలో ఆయనకు ఆనందం కలిగినందుకు నాకూ సంతోషం వేసింది. వాడు వెళ్లిపోయిన తరవాత తోచడం లేదేమోనని, జాలిపడుతూ ఉత్తరం రాశాను. దానికి జవాబు:

''... గత రెండు నెలలుగా కృష్ణమూర్తిగారి ప్రసంగ గ్రంథాలను చదవడమే కాకుండా, షేక్స్‌పియర్ నాటకాలు - కింగ్‌లీర్, మర్చంట్ ఆఫ్ వెనిస్, మిల్టన్ రాసిన పేరడైజ్ లాస్ట్ (తొమ్మిదవ భాగం) , కార్‌లైల్‌ది ''హీరోయాజ్‌పోయెట్'' జార్జ్ ఆర్‌వెల్ రాసిన ''యానిమల్ ఫార్మ్'' - ఈ పుస్తకాలన్నీ చదివి, సవిస్తరంగా నోట్సు తయారు చేయడం, వ్యాసాలు రాయడం, వగైరా పనులతో ఎన్నో గంటలసేపు పగలూ, రాత్రీ పని చేస్తున్నాను... నాతోటపని ఉండనే ఉంది. ఇవ్వాళ పొద్దున్న నాలుగు మైళ్లు నడిచాను (రానూ పోనూ కలిపి)...

ఢిల్లీగాని డెహ్రాడూన్‌గాని రమ్మని నువ్విచ్చిన సలహా గురించి నేను చెప్పేదిదే - మీ అమ్మగారు ఎక్కడికి వెళ్లాలనుకున్నా ఆవిడకివెళ్లేందుకు స్వేచ్ఛ

ఉంది. దానికినా అభ్యంతరం ఎంత మాత్రం ఉండదు. ఇక, నా వరకు వస్తే, ఈ శరీరం మనస్ఫూర్తిగా, కావాలని ఆ ప్రదేశాల్లో ఎప్పుడూ అడుగు పెట్టదు - వింధ్య పర్వతాలు దాటి వెళ్లదు. ఆ ప్రదేశాలకు వెళ్లాలనే ఇచ్ఛ నాకెంత మాత్రం లేదు. అంతేకాదు, అవంటే నాకు నిజంగా అయిష్టం. ఇప్పుడు నాకు ప్రయాణాలంటేనే ఇష్టంలేదు. నేనొక మైలురాయిని. మీ అందరిలాగ నేను ఫస్టుక్లాసులో ప్రయాణం చెయ్యలేను. ఇతరుల డబ్బుని నా సుఖంకోసం వృథా చెయ్యడం నాకిష్టం ఉండదు. నాగురించి నేను అతి స్వల్పంగా ఖర్చు పెట్టుకుంటాను - కేవలం నేను ఆరోగ్యంగా తిరగడానికి అవసరమయినంత వరకే.

అంతేకాక, మీ "హిందీభూమి"లో, మీ ఢిల్లీ రాజధానీ నగరంలో ప్రవేశించాలనే ఇచ్ఛ నాకు లేదు. నాకు పల్లెటూరి వాతావరణంలో ఉండటమే ఇష్టం. .. మనం ఎక్కడున్నా, దాన్ని స్వర్గంగానో, నరకంగానో మార్చుకోగలిగినది మనస్సే. అంచేత నా స్వర్గాన్ని నేనిక్కడే సృష్టించుకుంటాను... మీ మామగారు అంతంతదూరం, అంత తరుచుగా ఎలా ప్రయాణించ గలుగుతున్నారో నాకు ఆశ్చర్యంగా ఉంటుంది..."

నాన్నగారు "హిందీభూమి"లో ప్రవేశించనని అన్నా, హిందీ అంటే అయిష్టత లేదు. దేశానికి స్వతంత్రం రాకముందే మమ్మల్ని హిందీ నేర్చుకోమని ప్రోత్సహించారు. అప్పటికే హిందీలో డిగ్రీ సంపాదించిన వదిన దగ్గర ఇంట్లోనే హిందీ నేర్చుకున్నాను. అదే, పెద్దయాక ఎంతో ఉపయోగపడింది.

* * *

ఆ తరవాత నేను రెండుసార్లు హైదరాబాదు వెళ్లాను. మా ఆడబిడ్డ పెళ్లికని ఒకసారి, మరెందుకో ఒకసారి. రెండుసార్లూ ఎలాగో వీలుచేసుకుని నరసాపురం కూడా వెళ్లాను ఒకటి రెండు రోజులుండటానికి. ఒక్కర్తినీ వెళ్లాను. ఆ రోజుల్లో నరసాపురం ప్రయాణం యాతనగా ఉండేది. ఇప్పట్లోలా ఎక్స్‌ప్రెస్ రైళ్లు లేవు. పాసెంజరు రైలు చీమ గంగా యాత్ర లాగ ఎంత మెల్లిగా వెళ్లేదంటే, ఒళ్లుమండి రైలు దిగి నడిచి-వెళ్లిపోదామా అనిపించేది. హైదరాబాదు నుంచి వెళ్లేటప్పుడు నిడదవోలులో దిగి అక్కడ రైలు మారాలి. ఆ రైలే స్లో పాసెంజరు! పైగా ఎప్పుడూ లేటు. ఏ అర్ధరాత్రో దిగేది నరసాపురంలో. మొదటిసారి వెళ్లినప్పుడు అంటే నా అంతట నేను మొదటిసారి వెళ్లినప్పుడు, నేను

ముందుగా రాసిన కార్డు సమయానికి అందక, ఎవరూ స్టేషనుకి రాలేదు. రైలు రాత్రి రెండింటికి దిగింది. స్టేషను ఇవతలకి వచ్చి సైకిల్ రిక్షా ఎక్కాను. ఫలానా వీధికని చెప్పాను. ఆ వీధిలో ఎక్కడికెళ్లాలి అని అడిగాడు రిక్షావాడు బేరం కుదుర్చుకునేందుకు. కరణంగారింటికన్నాను. ఏ కరణంగారని అడిగాడు. ఫలానా అని చెప్పాను. ఆరిల్లు ఎక్కడండి అని అడిగాడు. గుడి దగ్గర అని చెప్పాను – నీళ్లలో రాయి విసిరినట్టు. మళ్లీ ఏ గుడి అని అడుగుతాడేమోనని భయంవేసింది. గుడిపేరు గుర్తులేదు నాకు. బేర్గం కుదుర్చుకుని బయలుదేరాడు. ముసలివాడు కాబట్టి అంత రాత్రిపూట వెళ్లడానికి అంత జంకు పుట్టలేదు. కానీ, కాలవ ఒడ్డుమీంచి తీసుకు వెడుతూంటే – పొడుగాటి రోడ్డు – ముందేమీ కనిపించడం లేదు– ఒకవైపు కాలవ, ఒకవైపు చెట్లు – భయం వేసింది – సరిగ్గా తీసుకువెడతాడా అని. పేపర్లలో చదివిన దుర్వార్తలు కొన్ని గుర్తుకొచ్చి ఒళ్లు గగుర్పొడిచింది. అలాగే ప్రాణాలు బిగపెట్టుకుని కూర్చున్నాను. కానీ, పాపం, రిక్షావాడు సరిగ్గానే తీసుకువెళ్లాడు.

రెండోసారి వెళ్లినప్పుడు సరిగ్గా అర్ధరాత్రి దిగాను స్టేషన్లో. కొంచెం పరిచయమైంది కాబట్టి అంత భయం వెయ్యలేదు ఒంటరిగా వెళ్లడానికి. కానీ, నరసాపురం ప్రయాణం అంటేనే భయం పట్టుకుంది. ఎంత శ్రమపడాలి! అమ్మ, నాన్నగారూ అక్కడ ఉన్నారు కాబట్టి వెళ్లక తప్పదు. వాళ్లు హైదరాబాదు వచ్చేస్తే బాగుండునని ఉండేది. నేను ఢిల్లీ తిరిగి చేరుకునేసరికి నాన్నగారి ఉత్తరం వచ్చి ఉంది.

"... నువ్వీపాటికి ఢిల్లీ చేరుకుంటావనే ఉద్దేశంతో ఈ ఉత్తరం రాస్తున్నాను. రాష్ట్రపతి రాధాకృష్ణన్ మరణానికి ప్రభుత్వం సంతాపదినాలు ప్రకటించడం వల్ల నేను ఎవరికీ శుభాకాంక్షల్ని పంపించలేదు. స్థానికంగా కూడా ఏ శుభకార్యానికీ హాజరు కాలేదు. హైదరాబాదు కబుర్లేమిటి?

ఆరు సంవత్సరాల క్రితం హైదరాబాదు విడిచిపెట్టిన తరువాత దివ్యజ్ఞాన సమాజం గురించి రాయడంగాని, ప్రసంగించడంగాని మానేశాను. గత మార్చిలో ఏలూరు వెళ్లి కొంతమంది పాత స్నేహితుల్ని కలుసుకున్నాను. అప్పుడు తెలుగు ఫెడరేషను సమావేశం జరుగుతోంది. నన్ను ప్రసంగించమన్నారు. "మనలోని లోపమేమిటి?" అనే విషయం మీద ప్రసంగించాను. ఆ సమావేశకర్తలు ఆ ప్రసంగ వ్యాసాన్ని ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ కూడా అచ్చు వేయించడానికి

నిశ్చయించారు. ఇప్పుడు అచ్చవుతున్నాయి. ఆ సందర్భంలో అక్కడివాళ్లు అదే విషయమ్మై మరింత విపులంగా, మొత్తం కృష్ణమూర్తిగారి తత్త్వం గురించి రాయమన్నారు. మరో ఏడు ప్రసంగ వ్యాసాల్ని ఇంగ్లీషులో రాశాను. వాటి పేర్లు తెలుగులో (1) నిజమైన మతం ఏమిటి? (2) జ్ఞానం, దాని ఉపయోగాలు, (3) సాంఘిక మనో నిర్మాణం, (4) సూటిగా గ్రహించడం (5) పరిణామం, పరివర్తన (6) మనస్సు ప్రశాంతంగా ఉండగలదా? "కర్తవ్యం," "హోదా" అనే విషయాల మీద ఇప్పుడు మళ్లీ రాస్తున్నాను. మొత్తం తొమ్మిది ప్రసంగాలూ కలిపి 140 లేక 150 పేజీలదాకా వస్తుంది అచ్చులో "నవ్య మనస్సు" అనే శీర్షికతో.

ప్రధమంగా చెప్పాల్సిందేమిటంటే, నాకు అవి ప్రచురింపబడాలని కాని, కీర్తి రావాలని కాని ఆత్రుత లేదు. నిజానికి అటువంటివంటే నాకసహ్యం. ఈ ప్రసంగాల్లో వ్యక్తం చేసిన భావాలు సమాజ ధోరణికి విరుద్ధంగా గాని, విప్లవాత్మకంగా గాని అనిపించవచ్చు. అవి కృష్ణాజీ తత్త్వాన్నే ప్రతిబింబిస్తాయి. అయితే, వ్యక్తం చేసిన శైలి, తీరు, ఇచ్చిన ఉదాహరణలూ నావే. కొంతమంది స్నేహితులు కృష్ణాజీ అభిప్రాయాలను అందరికీ తెలియజెయ్యాలనీ, అందుకు ఇటువంటి రచనలు ప్రచురించడం అవసరమనీ అంటున్నారు. అయితే, ఏలూరులో టి.ఎస్. పెద్దలు ఆ పనికి పూనుకుంటారో లేదో తెలియదు. నేను నా అంతరాంతరాల్లో తెలిసో తెలియకో కీర్తి కాంక్షతో తాపత్రయ పడుతున్నానని కొందరనుకుంటున్నారు. అది నిజం కాదని నిన్ను ఎలా నమ్మించగలను?

నేను హైదరాబాదులో చేసిన ప్రసంగాన్ని (ఒకసారి రేడియోలో ప్రసంగించాను) 'దివ్యజ్ఞానము, కృష్ణమూర్తి' అనే ప్రసంగ వ్యాసాన్ని నీకు పంపించాను కదా. దాన్ని దివ్యజ్ఞాన సమాజం హైదరాబాదు శాఖ వారు ప్రచురించి దేశమంతటా పంచిపెట్టారు. కృష్ణమూర్తిగారి ప్రబోధాలకు ఇది అత్యుత్తమ వివరణ అని ఒక అపరిచితుడు నాకు రాశాడు! ఆ వ్యాసాన్ని చాలామంది చదివారు. ఇప్పుడీ తొమ్మిది ప్రసంగాలూ కొందరికైనా నచ్చుతాయో లేక, విసుగుపుట్టించే చెత్త అనుకుంటారో. గత రెండు నెలలుగా ఈ ప్రసంగాల కోసం చాలా కష్టపడి పనిచేస్తున్నాను. కృష్ణమూర్తిగారి తత్త్వాన్ని నాకు తోచిన రీతిలో విశదీకరించడానికి మనస్ఫూర్తిగా చేసే తీవ్ర కృషి ఇది. నా రచనల గురించి నిజంగా నిష్పక్షపాతంగా నువ్వు ఇచ్చే సలహా ఏమిటి?"

వాడుక భాషలో సరళ శైలిలో రాస్తే అందరూ సులభంగా అర్థం చేసుకుని

ఆనందించ గలుగుతారు అని జవాబు రాశాను. నాన్నగారు ఇంగ్లీషులో అయితే చాలా సునాయాసంగా, సరళగా రాసేవారు ఉత్తరాలైనా, వ్యాసాలైనా. తెలుగులో మాత్రం గ్రాంధిక శైలిలో రాసేవారు. కానీ, అక్కడక్కడ వ్యావహారికం తొంగిచూసేది. నా చిన్నప్పుడు పరీక్షల్లో తెలుగు గ్రాంధికంలో రాయడం అలవాటవడం వల్ల, తరవాత వాడుక భాష రాయడం మొదలుపెట్టినప్పుడు కొంత కలగలుపయేది. ఆ విధమైన కలగలుపు బావుండదని తెలుసుకుని, నిర్మొహమాటంగా, వెరపు లేకుండా వాడుక భాషే అంతటా వాడటం సాహితీ మిత్రుల ప్రోత్సాహంతోనూ, సలహాతోనూ అలవరచుకున్నాను. అదే నాన్నగారికీ సలహా ఇచ్చాను. నాన్నగారు సహృదయంతో నా సలహాని స్వీకరించి, సమాధానం రాశారు.

"నీ పోస్టు కార్డు అందింది. నా ఇంగ్లీషు ప్రసంగ వ్యాసాలన్నిటినీ తెలుగులోకి సరళమైన వ్యావహారిక శైలిలోనే అనువదిస్తున్నాను. ఆఖరి వ్యాసం ఇవాళ సాయంకాలంతో పూర్తవుతుంది. మొత్తం పది వ్యాసాలున్నాయి. 'ప్రేమ, మరణం' అనే దాని మీద కూడా రాశాను. ఈ పదకొండు ప్రసంగ వ్యాసాలూ ఇంగ్లీషులో 160 లేక 170 పేజీలదాకా ఉంటాయి. తెలుగులో 180 లేక 200 పేజీలదాకా వస్తాయి. ఇదివరకు రాజమండ్రిలో ఉండగా నేను రాసిన 'పరమ గురువులను చేరు మార్గము' అనే అనువాద గ్రంధాన్ని ప్రచురించిన సంస్థే ఈ వ్యాసాల పుస్తకాన్ని కూడా ప్రచురించడానికి అంగీకరించారు. ఈ పుస్తకానికి 'నవ్య మనస్సు' అని పేరు పెట్టవచ్చు. దీనిలోని ప్రధానాంశాలు : నవ్య మనస్సు, దాని అవసరం; నిర్లిప్తంగా, నిర్వివిక్షతో విషయాలను గ్రహించడం, మానవ సమస్యలకు గతంలో ప్రయత్నించిన పరిష్కారాల వైఫల్యం; గతాన్ని త్యజించడం – అంటే గతానుభూతులన్నిటినీ త్యజించడం.

ఈ పుస్తకంలోని పదకొండు అధ్యాయాలూ ఈ విధంగా ఉంటాయి. 1. మనలోని లోపమేమిటి? 2. నిజమైన మతం ఏమిటి? 3. జ్ఞానం, దాని ఉపయోగాలు. 4. సామాజిక మనో నిర్మాణం. 5. కర్తవ్యం, హోదా. 6. ప్రత్యక్షంగా గ్రహించడం. 7. ఆత్మజ్ఞానమే అత్యున్నత యోగం. 8. మనస్సు ప్రశాంతంగా ఉండగలదా? 9. ప్రార్థన అగత్యం. 10. పరిణామం, పరివర్తన. 11. ప్రేమ, మరణం.

ఈ భావాలు చాలా క్లిష్టమైనవి. వాటిని ధైర్యంగా విశదీకరించడం జరిగింది. వీటిలో కొంత పునరుక్తి ఉందేమోనని నా భయం. కానీ, ఉండి

తీరుతుంది. ఏదైనా ఒక విషయాన్ని నొక్కి చెప్పాలంటే మళ్లీ మళ్లీ చెప్పడం అవసరమవుతుంది. ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో మీ ఆయన పనిచేస్తున్న ప్రచురణ సంస్థ వాళ్లేమైనా వెయ్యడానికి వీలవుతుందో లేదో నాకు తెలియదు. ఇది నిజంగా ఆలోచించవలసిన విషయమే.

ఇది నా జీవితంలో ఒక నూతన అధ్యాయం. నా జీవిత చరమదశలో కీర్తి, గుర్తింపు, మెప్పుదల, సన్మానం పొందాలని నేనెప్పుడూ అనుకోను. నాకు భయం. ముడుచుకుపోతాను. నాకు సన్మానాలు జరపాలని ప్రయత్నాలు జరిగినా వాటిని నేనొప్పుకోలేదు. తప్పించుకున్నాను.

కాని, నా భావాలు పొందుపరచిన రచనలు ప్రచురణార్హం అయితే, అది వేరే సంగతి. వాటిని అనామకంగా కూడా ఉంచవచ్చు. అవి ఉపయుక్తమైనవి అనుకుంటే, వాటిని ప్రచురించాలేమో. నేను చాలా కష్టపడి పని చేస్తున్నాను. వీటిని నీకు పంపించాలి. నేను పంపించేది చిత్తు ప్రతి. ఒకేవైపున రాసినది కాదు. ప్రచురణకి వీలైనది కాదు. నీ దగ్గర నుంచి, మళ్లీ కబురు వినాలనుకుంటున్నాను. నీ స్వామిని సంప్రదించు. నేను అలిసిపోయాను.:"

సమాధానం ఏంరాయాలా అని మధనపడ్డాను. వాళ్ల సంస్థ ప్రచురించడం కుదరదని ఆయన స్పష్టంగా చెప్పేశారు. నాన్నగారి మనస్సుని కష్టపెట్టకుండా ఈ విషయాన్ని ఎలా తెలియజెయ్యాలా అని నా బాధ. ఇదివరకు 'ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్'కి చేసిన అనువాదాన్ని - తెలుగు పుస్తకాలకి మార్కెట్ లేదనీ, కాపీరైట్ లభిస్తేగాని ప్రచురించడం కుదరదనీ చెప్పి తప్పించుకున్నాను. ఇప్పుడు మళ్లీ ఏంచెప్పాలో తోచలేదు. రాత్రిళ్లు నిద్రపట్టడం లేదు. నాన్నగారి చరమదశలో అంత కష్టపడిన తరువాత నిరాశ కలిగించవలసి వస్తున్నందుకు బాధ, మనసులో రంపపు కోత.

ఈలోగా నాన్నగారే మళ్లీ రాశారు. "నీ దగ్గర నుంచి ఉత్తరం వస్తుందని ఎదురు చూశాను. నవ్య మనస్సు పుస్తకం ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ కూడా రాయడం పూర్తయింది... మీ అన్నయ్య మసూరీలో ఉండి కమిషన్ రిపోర్ట్ తయారు చేస్తున్నాడు. ఇక్కడ కావలసినన్ని దోమలు, విపరీతమైన ఎండలు. ఈ శరీరం బాధపడుతోంది...."

ఇంక ఆలస్యం చెయ్యడం భావ్యం కాదనిపించింది. మావారితో సంప్రదించి,

ఆయన ఇచ్చిన సలహా ప్రకారం జవాబు రాశాను. దానికి మళ్లీ నాన్నగారు రాశారు.

"... నీ సమాధానం చూసి నేనేమాత్రం నిరాశ చెందలేదు. నేనేమీ నిరుత్సాహ పడలేదు. నీ భర్త పనిచేసే సంస్థ నా పుస్తకాన్ని ప్రచురిస్తుందని నేనెప్పుడూ ఆశించలేదు. పైగా నా పుస్తకాన్ని మీ ఖర్చుతో ప్రచురించాలను కోవడం శుద్ధ బుద్ధిహీనత. అసందర్భం. ఈ పరిస్థితుల్లో నా పుస్తకం రాతప్రతిని నీకు పంపించను, పంపించనవసరం లేదు...

ఇక్కడ తణుకులోను, రాజమండ్రిలోనూ నా ప్రసంగ వ్యాసాల్ని చదవమన్నారు. జూలై, ఆగస్టు నెలల్లో ఆ పనేదో చేస్తాను. విని ఏమనుకున్నారో తెలుస్తుంది. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ మొదటి ప్రసంగాన్ని ప్రచురించాక మీకు చెరొక కాపీ పంపిస్తాను...

తెలంగాణా సమస్య గురించి పేపర్ల ద్వారా, రేడియో ద్వారా మీకు కావలసినంత సమాచారం లభిస్తోందనుకుంటాను. పేపర్లలో రాని సమాచారం ఇంకెంతో ఉంది. ప్రపంచమంతటా జరుగుతున్న ఇటువంటి సంఘటనలకు వర్తించే విషయాలు నా ప్రసంగాల్లో ఉన్నాయి. నువ్వు ఇక్కడికి వచ్చినప్పుడు ఆ వ్యాసాల్ని చదవొచ్చును..."

నేను ఆ ఉత్తరం చదివి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను. అన్నయ్య ఉద్యోగరీత్యా చేస్తున్న కృషి గురించి 'హిందూ'లో ఒక వ్యాసం వచ్చింది. దాని కటింగ్ తీసి నాన్నగారికి పంపించాను.

".... నువ్వు పంపిన పేపరు క్లిప్పింగ్ అందింది. సహజంగానే దాన్ని చూసి సంతోషించాను. మీ అన్నయ్య సాధించిన దానికి నువ్వు కూడా, సహజంగానే, గర్విస్తున్నావనుకుంటాను..." అని రాశారు నాన్నగారు. (పువ్వు-రేకు రేకు చొప్పునా వికసిస్తూంటే తన్మయత్వంతో సంభ్రమంతో చూసినట్లు మీ అన్నయ్య అభివృద్ధిని గమనిస్తున్నాను" అన్నారొకసారి నాతో).

తరవాత రెండు మూడు ఉత్తరాల్లో మళ్లీ నవ్య మనస్సు గురించీ, అందులో అధ్యాయాల గురించే రాశారు. ఎన్నిసార్లు రాశారు అప్పటికి ఆ ప్రసంగ వ్యాసాల గురించి! దీన్నే చాదస్తం అంటాం. కొంత ఆయన సహజ స్వభావానికి తోడు, వృద్ధాప్యం ప్రభావంతో, చెప్పిందే చెప్పడం, రాసిందే

రాయడం చేసేవారు. ఆయన ఓపిక్కి మెచ్చుకోవాలి! ఎదురుగా ఉన్నప్పుడు ఎప్పుడైనా ధైర్యం తెచ్చుకుని, "ఇది వరకు చెప్పారు ఆ విషయం" అని నసిగితే "చెపితే చెప్పానేమో, మళ్లీ చెబుతాను విను" అనేవారు నిష్కర్షగా. పాపం, ఆయన అన్నిసార్లు చెవులు చిల్లులు పడేలా చెప్పినా, విన్నది ఒంటబట్టేది కాదు. అందుకే కృష్ణమూర్తిగారు అనేవారు "వినడం ఒక కళ" అని. ఈ చెవిలోంచి విని ఆ చెవిలోంచి వదిలేసినట్లు కాకుండా, విని ఆకళింపు చేసుకోవడం శ్రద్ధాసక్తులు ఉన్నప్పుడే సాధ్యమవుతుంది.

నాన్నగారు తణుకు నుంచి ఉత్తరం రాశారు.

"... నేనూ, మీ అమ్మగారూ ఇక్కడికి 12వ తేదీ సాయంకాలం వచ్చాం. 13న నా ప్రసంగాలు ప్రారంభించాను. మధ్యాహ్నం 3.30 నుంచి 4.30 - 5.00 గంటల వరకూ స్త్రీల ఎదుట, 5.30 నుంచి 6.30 వరకూ పురుషుల ఎదుట ప్రసంగిస్తున్నాను. రెండు సమావేశాలకీ జనం బాగానే వస్తున్నారు. పురుషులకన్న స్త్రీలే ఎక్కువ మెచ్చుకుంటున్నారు. పురుషుల మనస్సులు అంతకు ముందు సంపాదించిన జ్ఞానంతో కిక్కిరిసిపోయి, ఎంతో నిబద్ధమయి పోయాయి. అయినా, ఒకరిద్దరు పూర్వాచార పరాయణులు తప్ప, తక్కిన వాళ్లంతా నవ్య మనస్సు గురించి నేను చేసిన ప్రసంగాలన్నిటినీ మెచ్చుకున్నారు. ఏమైనా వాళ్ల ప్రశంసలతోనూ, ఖండనలతోనూ నాకు సంబంధం లేదు. నా కర్తవ్యం, నా ప్రసంగాల్ని చదివి వినిపించి, కొన్ని విత్తనాల్ని నాటడమే. తక్కినది నా చేతుల్లో లేదు. ఆ ప్రసంగాలను అధమం ఇద్దరు ముగ్గురు సరిగ్గా అవగాహన చేసుకుని, వాటివల్ల లాభం పొందగలిగితే, నా ప్రసంగాలు బాగా జరిగినట్లూ, నా శ్రమ వృథా కానట్లూ భావిస్తాను..."

నాన్నగారు తణుకు నుంచి నరసాపురం తిరిగొచ్చాక, కుటుంబ క్షేమ సమాచారాలు తప్ప మరే విశేషాలూ తెలియలేదు. శీతాకాలం ఆరంభమైంది. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడ్డం వల్ల, తుఫాను ఆరంభమైంది. నాన్నగారు నరసాపురం పరిస్థితి గురించి రాశారు.

"... నరసాపురంలో నిన్నే భీభత్సంగా ఉంది. భీకరమైన పెనుతుఫాను గాలులు, ధారాపాతంగా వర్షం - ఒక్కరోజులో పది అంగుళాల వర్షం నిలిచింది. ఇళ్లకీ, పంటలకీ జరిగిన నష్టం కొన్ని లక్షల వరకూ ఉండవచ్చు.

ఇళ్లుకూలిపోయాయి. చెట్లు వేళ్లతో సహా పెకిలించబడ్డాయి. పెంకుటిళ్ళూ, పూరి గుడిసెలూ బాగా దెబ్బతిన్నాయి. అన్ని పంటలూ - ధాన్యం, అరటి గెలలు, తమలపాకులు, పొగాకు, కొబ్బరి కాయలు, కాయగూరలు - అన్నిటికీ విపరీతమైన నష్టం సంభవించింది. కరెంటు లేదు. ఎలెక్ట్రిక్ స్తంభాలూ, తీగెలూ రిపేరు చెయ్యడానికి నాలుగైదు రోజులు పడుతుంది. టెలిగ్రాములు లేవు. టెలిఫోన్లు లేవు. నేను కవినీ, రచయితనీ కాను - ఈ ఘోర నష్టాన్ని వర్ణించడానికి. గత 50-60 సంవత్సరాల్లో నేను ఇటువంటి పెనుతుఫాను గాలుల్ని నా జీవితంలో చూడలేదు. ఇది దుఃఖపూరితమైన సంఘటన అయినా, విజ్ఞానదాయకమైన అనుభవం...."

ఇదివరకు ఉత్తరాల్లో, నాన్నగారు పి.యు.సి., బి.ఎ. విద్యార్థులకి ఇంగ్లీషు, ఇతర సబ్జెక్ట్స్ బోధిస్తున్నట్లూ, విద్యార్థులంతా తృప్తి పొందుతూ, తన చుట్టూ మూగుతున్నారనీ రాసినప్పుడు నాకనిపించింది - నాన్నగారు లెక్చరర్ ఉద్యోగం చేసినా రాణించి ఉండేవారని. ఇప్పుడీ తుఫాను గురించి రిపోర్టు చదివాక నాన్నగారు జర్నలిస్టుగా కూడా రాణించి ఉండేవారేమో ననిపించింది. ఆయనకి ఏ విషయాన్ని రాసినా, చదివి తీవ్రంగా స్పందిస్తారు. మా అత్తవారివైపు కుర్రవాడొకడు స్కూటర్ యాక్సిడెంట్‌లో ప్రాణాలు కోల్పోయాడని రాశాను. దానికి జవాబు రాశారు :

"... ఎన్నో రోజులపాటు ఎదురుచూశాక నీ ఉత్తరం అందింది. ఆయువకుడి అకాల మరణానికి చాలా చింతిస్తున్నాను. ఎంతో వృద్ధిలోకొస్తున్న వాడి జీవితం క్రూరంగా అర్ధాంతరంగా తెగిపోయింది. అతడి తల్లిదండ్రుల దీనావస్థ, వైధవ్యాన్ని పొందిన ఆ యువతి, ఆమె పిల్లల అవస్థ దయనీయమైనది. కానీ, ఏమిటి చెయ్యడం? ఈ రోజుల్లో యాక్సిడెంట్స్‌లో ప్రాణాలు కోల్పోవడం సామాన్యమై పోయింది! ఎవరికీ రక్షణ లేదు. ఈనాటి నాగరికతా లక్షణం అది! అమెరికాలో క్రిస్‌మస్ రోజున ఎంతమంది మృత్యువాత పడుతున్నారో తెలుసా?... ఢిల్లీలో ఆ బ్రహ్మాండమైన రాజకీయ వాతావరణంలో మీరు ఎలా ఉంటున్నారో నాకు తెలియదు. ఇక్కడ బాగా చలిగా ఉంది. ఢిల్లీలోనూ, డెహ్రాడూన్ లోనూ మరింత దుర్భరంగా ఉండి ఉంటుంది.

... మీ మామగారికి ఢిల్లీ మీద ఉన్న అభిమానానికి ప్రశంసిస్తున్నాను. నా మటుకు నాకు ఢిల్లీ పేరెత్తితేనే వణుకు పుట్టుకొస్తుంది. ఢిల్లీలో నేను

ఆకర్షింపబడే అంశం ఏమీ లేదు. అంతేకాదు. ఢిల్లీకి సంబంధించిన ప్రతి విషయం నాకు ఇబ్బంది కరంగా తోస్తుంది. నాకు వెగటు కలిగిస్తుంది. ఆ అద్భుత నగరం అంటే నాకు తగని భయం. నాకే ప్రదేశమూ చూడాలని లేదు. ఎవరినీ చూడాలని కూడా లేదు. అంచేత నేను ఢిల్లీగాని, డెహ్రాడూన్‌గాని వెళ్లే ప్రశ్నే లేదు. ఈ జన్మలో నేను వింధ్య పర్వతాలు దాటదలుచుకోలేదు! నాకిక్కడే ఉండి, ఒంటరిగా గడపటంలోనే తృప్తి ఉంది...'' అని రాశారు.

నాన్నగారికి ఢిల్లీ అంటే ఎందువల్లనో - ఎందువల్లనో ఏమిటి! - మహానగర వాతావరణం నచ్చక 'ఎలర్జీ' లాంటిది ఉందని తెలుసు. కానీ మధ్యలో వింధ్య పర్వతాలు ఏంచేశాయి? నాన్నగారు పూర్వజన్మలో అగస్త్యుడేమో!!

ఒకప్పుడు వింధ్య పర్వతాలు విశేషంగా పెరిగిపోయి, సూర్యచంద్రుల మార్గానికి అవరోధం కలిగించాయి. అందువల్ల రాత్రింబగళ్లు తెలియడం కష్టమైందిట. అప్పుడు మునులు వెళ్లి తన రూపాన్ని ఉపసంహరించుకోమని వింధ్యను వేడుకున్నారుట. కానీ వింధ్య వినలేదు. అప్పుడు వారంతా అగస్త్యునితో మొరపెట్టుకున్నారుట. అగస్త్యుడు వింధ్య దగ్గరికి పోయి, తాను దక్షిణానికి పోవలసి ఉన్నది కనుక, తనకు మార్గమీయవలసిందిగా కోరాడుట. ఆయన కోరికని మన్నించి వింధ్య తన రూపాన్ని ఉపసంహరించుకుందిట. తాను దక్షిణం నుంచి తిరిగి వచ్చేవరకూ అదే స్థితిలో ఉండవలసిందని చెప్పి వెళ్లాడుట అగస్త్యుడు. కానీ, అతడు తిరిగి ఆ మార్గాన రాలేదు. వింధ్య అలాగే ఉండిపోయిందిట. ఇది భారతంలో కథ.

పూర్వజన్మ సంస్కారం వల్ల నాన్నగారు - కొడుకూ, కూతురూ ఉత్తర ప్రాంతంలో ఉన్నా, వారి మీది మమకారాన్ని కూడా అణచిపెట్టుకుని "వింధ్య పర్వతాలు దాటి వెళ్లనని శపథం తీసుకుని ఉంటారని నా అనుమానం! పునర్జన్మ సిద్ధాంతం మీద నాకు నమ్మకం ప్రత్యేకంగా లేకపోయినా, నిజం కావచ్చునన్న అనుమానం కలుగుతోంది. ఇప్పుడు నా ఉత్తరంలో ఆ ప్రసక్తి తీసుకొస్తే ఇంకా భీష్మించుకుని కూర్చుంటారనిపించి, కొన్నాళ్లపాటు ఉత్తరం రాయలేదు నేను. నాన్నగారే మళ్లీ చాలా రోజుల తరవాత రాశారు కొంచెం బాధపడుతూ.

"... చాలా రోజులుగా నీ దగ్గనుంచి ఉత్తరం లేదు. బహుశా నీకు తీరిక లేదనుకుంటాను. గొప్పవాళ్లు, ఆఫీసర్లు, ఆఫీసర్ల భార్యలు - వాళ్లు ఉత్తర

ప్రత్యుత్తరాలు రాయరు. అలా రాయడం వారి హోదాకి తగదనుకుంటాను. నావంటివాళ్లే, సామాన్య స్థితిలో ఉన్నవాళ్లు మాత్రమే క్రమం తప్పకుండా సకాలంలో ఉత్తరాలు రాస్తూ ఉండాలి...” అని రాస్తే, నేను తప్పు చేసినట్లు బాధపడ్డాను. ఏవో కాన్ఫరెన్సులూ, రిపోర్టులూ, మొదలైన వాటితో తీరిక చిక్కలేదనీ, క్షమించమనీ రాశాను.

నేను వెంటనే ఉత్తరం రాస్తే, తక్షణం జవాబు వస్తుంది. మళ్లీ రాయాలన్న భయం! అప్పుడప్పుడు అశ్రద్ధ చేసినా, సాధారణంగా వెంట వెంటనే ఉత్తరాలు రాస్తూనే ఉండేదాన్ని. కానీ, ఒక్కొక్కప్పుడు రాయబుద్ధేసేది కాదు. కానీ, రాసేదాకా మనసులో ములుకులా గుచ్చుకుంటూనే ఉండేది - రాయలేదన్న సంగతి. మళ్లీ నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం రాకపోతే మనసు పరి పరి విధాల పోయేది.

ఈసారి రెండునెల్లపాటు నాన్నగారి దగ్గర నుంచి ఉత్తరాలు లేవు. ఆయన ఆరోగ్యం గురించి ఆందోళన పడుతూ నేనే రాశాను. దానికి జవాబుగా -

“.... (1) ఈ మధ్య నాకుడికాలు వాపు, సలుపుతో బాధపెట్టింది. ఇప్పుడు బాధ తగ్గింది. బాగా నీరసంగా ఉంది. హోమియో మందు తీసుకుంటున్నాను. ఒకటి రెండు వారాల్లో కోలుకుంటాను.

(2) 21వ తేదీ, శనివారం నాడు నా కుడికన్ను చూపు మందగించినట్లు కనిపెట్టాను. మసక - గుడ్డుపైన పొగమంచు కమ్మినట్లు సన్నని పొరలా ఉంది. ఎడమ కన్ను బాగానే ఉంది. కుడికన్ను చూపే మసగ్గా ఉంటోంది. ఎడమ కన్ను మూసేస్తే కుడికన్నుతో చదవలేక పోతున్నాను కంటి డాక్టరు చూసి ఒక ఏడాదిలోనో, ఎప్పుడో కేటరాక్ట్ (శుక్లం) రావచ్చునన్నాడు. ఇప్పుడింక చెయ్యగలిగిందేమీ లేదు. దాని గురించి ఇప్పుడు ఆందోళన పడక్కర్లేదన్నాడు. హోమియో మందులు వాడి చూస్తాను. ఆ పొర ఏమైనా కరుగుతుందేమో.

ఇప్పటి వరకూ చాలా గర్వపడుతూ ఉండేవాడిని. ఈ వయస్సులో కూడా (75 ఏళ్లొచ్చినా) చూపు, వినికిడి, మేధాశక్తి, జ్ఞాపకశక్తి, నడక - అన్నీ దెబ్బ తినకుండా లక్షణంగా ఉన్నాయని. కానీ, ఇప్పుడు మొట్టమొదటిసారిగా విఘాతం కలిగింది. దాని గురించి నేనేమీ బాధపడటం లేదు. ఏంజరిగినా చిరునవ్వుతో స్వీకరించాలి...

కృష్ణమూర్తిగారి గ్రంథాలు - యూరోప్‌లో ప్రసంగాలు 3 సంపుటాల్ని ఒక స్నేహితుడు నాకు పంపించాడు...

నువ్వొక సంగతి కనుక్కుని రాయగలవా? కళ్లకి ఉపయోగించే నల్లని కాటుక పొడి 'సుర్మా' అంటారు తెలుసునా? మా నాన్నగారు దాన్ని వాడుతూ ఉండేవారు. ఈ ప్రాంతాల్లో మంచి సుర్మా దొరకదు. ఉత్తర భారతంలో, ముఖ్యంగా ఢిల్లీలో యునానీ వైద్యం - ముస్లిమ్ సంస్కృతి ఇంకా బాగా ఉన్న ప్రదేశం కాబట్టి అక్కడ, మేలురకం సుర్మా లభించవచ్చు. అక్కడ, ఢిల్లీలో ఎక్కడైనా దొరుకుతుందేమో కనుక్కోగలవా? అక్కడ దగ్గర్లో ఏదైనా హకీమ్ అజమల్ ఖాన్ స్టోర్స్ ఉన్నదా? సుర్మా వాడితే ఈ పొర కరిగిపోయి మసక తగ్గుతుందనుకుంటాను. ఏమైనా, అది వాడినందువల్ల నష్టం లేదు. అంచేత, మంచి సుర్మా కనుక దొరికితే, 1/8 తులం పంపించు. ఒక చిన్న సీసాలో ఇస్తారు. ఈ కష్టం స్వీకరించడానికి నీకు తీరిక ఉంటుందా? ఇక్కడే కనక దొరికితే నేను నీకు శ్రమ కలిగించి ఉండేవాణ్ణి కాదు. ఇక్కడ స్థానికంగా ఏదో చేస్తారు గాని, దాన్ని అంత నమ్మలేము. ఆపరేషన్లవీ లేకుండా ఈ బాధ పోగొట్టుకోవాలను కుంటున్నాను. హోమియో మందులు కొంత ఉపశమనాన్ని కలగజేయగలవనుకుంటున్నాను. ప్రయత్నించి చూడాలి. ఈ విషయంలో నువ్వు చెయ్యగలిగిన సహాయం చెయ్యి. వీలైనంత త్వరలో.."

ఆ ఉత్తరం వెనువెంటనే మరో కార్డొచ్చింది - "ఒక ముఖ్య విషయం. రెండు రకాల సుర్మాలున్నాయి. నలుపు, తెలుపు. నల్లది చల్లదనం కోసం ఉపయోగిస్తారు. తెల్లదాన్ని మసకల కోసం, పొరలు పోవడం కోసం ఉపయోగిస్తారు. అంచేత నాకు తెల్ల సుర్మాయే అవసరమవుతుంది. ఆ దుకాణం వాళ్లని అడిగి కనుక్కోవాలి. తెల్లది చేసే గుణం ఏమిటో, నల్లది చేసే గుణం ఏమిటో. వాళ్ల సలహా ప్రకారం (బహుశా తెల్లదే అయి ఉంటుంది) మసకలు, పొరలూ పోవడానికి తగిన సుర్మా పంపించు. నాకున్న సమస్య - కుడికంట్లో పొగ కమ్మినట్లు సన్నని పొర ఏర్పడింది..."

నేను ఈ విషయం మావారితో చెప్పాను. ఆయన వెంటనే నన్ను చివాట్లేశారు. అలా అడ్డమైనవీ వాడితే కళ్లుపోతాయి - అంటూ. అయినా, ఆయన్ని బ్రతిమాలాను. ఒక్కసారి అజ్‌మల్‌ఖాన్ రోడ్‌లో ఏదైనా అటువంటి యునానీ మందుల షాపుంటే కనుక్కు రమ్మని.

ఆ సాయంకాలం వెళ్లి అడిగితే, ఆ షాపులో ఉన్న వైద్యుడు కూడా అదే చెప్పాడుట దాదాపు – తెల్ల సుర్మా ఉంది గాని, పేషంట్‌ని చూడకుండా, వ్యాధి లక్షణాలు ప్రత్యక్షంగా పరిశీలించకుండా మందివ్వడం మంచిది కాదన్నాడుట. నాన్నగారికి ఆ సంగతి తెలియజేస్తూ ఉత్తరం రాశాను. ఆయన దగ్గరనుంచి ప్రత్యుత్తరం వచ్చింది.

"... నీ ఉత్తరం ఇప్పుడే అందింది. ప్రస్తుతం నేను రోజుకి మూడు, నాలుగు గంటలపాటు చదవగలుగుతున్నాను. నొప్పి, అలసట, నీళ్లు కారడం వంటివేమీ లేవు. హోమియోపతి మందులు వాడుతున్నాను. మీ సుర్మా నాకేమీ వద్దు. దాని గురించి ఇక ఆలోచించవద్దు. నీకు శ్రమ ఇచ్చినందుకు మన్నించు. మేము కులాసాగానే ఉన్నాం... నీకు ఇన్‌లాండ్ లెటర్స్ అంటే అసహ్యం, జుగుప్స కలుగుతుందా? నువ్వెప్పుడూ ఇరవై నయాపైసల కవర్లే వాడతావెందుకు? నేను ఎప్పుడోగాని వాటిని వాడను..."

నాన్నగారికి కోపం వచ్చిందేమోనన్న అనుమానం వేసింది. భయం కూడా వేసింది – సుర్మా పంపించడానికి అశ్రద్ధ చేశామనుకుని బాధపడ్డారేమోనని! మళ్లీ మావారిని బతిమాలి యునానీ మందుల షాపుకి పంపించి తెల్ల సుర్మా తెప్పించాను. మా బంధువులావిడ ఒకరు నరసాపురం వెడుతూంటే, ఆవిడ చేతికిచ్చి పంపించాను. మందు అందిన తరవాత నాన్నగారు ఉత్తరం రాశారు.

"నీ ఉత్తరం, నువ్వు శాస్త్రిగారి అక్కగారి ద్వారా పంపించిన సుర్మా సీసా అందాయి. ఆవిడ ద్వారా మీ అత్తవారి విశేషాలన్నీ తెలిశాయి... నాకు కోపం వచ్చిందేమోనన్న అనుమానాన్ని నువ్వు వ్యక్తం చెయ్యడం చూసి ఆశ్చర్యపోయాను. కోపం దేనికి? నువ్వు అటువంటి నిర్ణయానికి రావడానికి నా ఉత్తరంలో ఏముంది అలాంటిది? నిజంగా చిత్రంగా ఉంది. కించిత్తు కూడా కోపం అనేది కలగలేదు. నాకసలు కోపం ఎందుకు రావాలి? నువ్వు, మీ ఆయనా అంత శ్రమ తీసుకున్నందుకా? ఇక్కడ నేను హోమియో మందులు – మింగడానికి మాత్రలు, కంట్లో చుక్కలు వేసుకోవడానికి "సినెరేనియా" అనే మందు వాడుతున్నాను. అందువల్లనే సుర్మా గురించి అంత పట్టించుకోలేదు నేను...

ఒక సంగతి చెప్పాలి నీకు. ఢిల్లీలో ఆ మందుల దుకాణం అతన్ని నేను చాలా ప్రశంసించాను. గౌరవం కూడా కలిగింది – రోగిని స్వయంగా పరీక్షించకుండా

మందు అమ్మడానికి నిరాకరించినందుకు. అంతటి నిజాయితీ ఉన్న పెద్ద మనిషి ఒకడైనా ఉన్నాడా ఈ రోజుల్లో అనుకున్నాను. అటువంటి వాళ్లు ఎంతమంది ఉంటారు? ప్రతి వ్యాపారీ డబ్బు కోసం ఏదో విధంగా తన సరుకుని అమ్మెయ్యాలనుకుంటాడు. నిజానికి, ఆ దుకాణదారుని గురించి ఎంతో ప్రశంసా పూర్వకంగా చెప్పాను ఇక్కడ నా స్నేహితులందరితోనూ. అందుకే ఇక ఆ మందు గురించి ప్రయత్నించి లాభం లేదనుకున్నాను. అందుకే ఇక దాని గురించి శ్రమ పడవద్దని రాశాను. నీకు సంతృప్తి కలిగిందనుకుంటాను! నాకు కోపం రాకపోవడమే కాదు. పైగా నాకు చాలా సంతోషం కూడా కలిగింది.

అమ్మాయీ, చాలాకాలంగా నాకు కోపం రావడమనేది జరగడం ఆగిపోయింది. ఇకముందు కూడా నాకు దేనికీ కోపం రాదనుకుంటాను. సరియైన అవగాహన ఉంటే, కోపం తెచ్చుకోవలసిన అగత్యమే ఉండదు..."

నా చిన్నతనంలో నాన్నగారికి దుర్వాసుడి కున్నంత కోపం ఉండేది. ఆయన మాటని ఏమాత్రం కాదన్నా అసహనం ప్రదర్శించేవారు. అలాగని, ఆయనకి విశాల హృదయం, ఔదార్యం, కరుణ, హాస్య ప్రియత్వం లేవని కాదు. కాని అసహనం, కోపం తక్కిన లక్షణాలన్నిటినీ కప్పివేసేవి. అటువంటి నియంత "సరియైన అవగాహన ఉంటే కోపం తెచ్చుకోవలసిన అగత్యమే ఉండదు" అని గ్రహించ గలిగినంత సౌమ్యంగా మారారంటే, అందుకు జిడ్డు కృష్ణమూర్తిగారి ప్రసంగాలు, పుస్తకాల ప్రభావం అనే చెప్పాలి. వాటిని అంత దీక్షగా అధ్యయనం చేశారాయన.

నేను ఉద్యోగరీత్యా బెంగుళూరు వెళ్లవలసి వచ్చింది. వెళ్లబోయే ముందు ఉత్తరం రాశాను నాన్నగారికి – తిరిగి ఢిల్లీ వెళ్లేటప్పుడు దారిలో నరసాపురంలో దిగి ఒకరోజు ఉండటానికి ప్రయత్నిస్తానని. నా ఉత్తరం చూశాక "మీ అమ్మగారికి అసంతృప్తి కలిగింది. కోపం రాలేదు! నువ్వు ఒక్కరోజు ఉండటానికి ఎలాగో వీలు చేసుకుని నరసాపురం రావడానికి ప్రయత్నిస్తానని రాసినందుకు – ఒక్కరోజు ఉండటం కోసం అంత శ్రమపడి ఎందుకంత దూరం నుంచి రావడం అన్నారావిడ. అంటే ఆ మాత్రమయినా మామీద దయ చూపకూడదని కాదు. అదంతా నీ ఇష్టం" అని రాశారు.

తీరా చేసి, వెళ్లడానికి కుదరనే లేదు. వెళ్లలేకపోయినందుకు బాధపడుతూ,

ఏమీ అనుకోవద్దని రాశాను. దానికి నాన్నగారు రాసిన సమాధానం లోని విషయాలు చదివి మరింత బాధపడ్డాను వెళ్లి చూడలేకపోయిందుకు.

"... నువ్వు రానందుకు మేము విచారించలేదు. ఎందుకంటే, నువ్వు ఈ వేసవిలో ఇంతదూరం ఈ మారుమూల ప్రదేశానికి వస్తావని అనుకోలేదు. ఏమీ బాధపడటం లేదు. ఈ ఏడు మీ అన్నయ్య ఇటువైపుకి రావడం లేదు. సెలవులు డెహ్రాడూన్‌లోనే గడుపుతున్నాడుట.

గత వారంలో విపరీతమైన ఎండలుండటం వల్ల నాకు రెండు రోజులపాటు జ్వరం వచ్చింది. ఇవాళే పథ్యం పుచ్చుకున్నాను. వృద్ధాప్యం మూలాన్ని చాలా నీరసంగా అనిపిస్తోంది. కొద్ది రోజుల్లో మామూలుగా అవుతాను. ఈ వేసవి సెలవుల్లో మీ అన్నయ్య ఇటువైపుకి రావడం లేదు. కనుక నిన్ను ఒకటి అడుగుతున్నాను. ఇక్కడ ఎండబెట్టిన పళ్లు దొరకవు. నీకు తోచినవి ఎంచి, ఏమైనా మంచి ఎండుపళ్లు ఎవరైనా ఇటువైపు వచ్చేవాళ్లుంటే పంపించవలసిందిగా కోరుతున్నాను. హైదరాబాదులో, సుల్తాన్ బజారులో మంచి అల్లం మురబ్బా కొనేవాడిని. ఇక్కడ అటువంటిదెక్కడా దొరకదు. నీకు శ్రమ ఇస్తున్నానేమో. మీ అమ్మగారికి శ్లేష్మం ఉంటోంది. ఈ మురబ్బా కొంతవరకు ఉపశమనం కలిగించవచ్చు. నీకు చాతనయినది చెయ్యి ఈ విషయంలో...

ఇక ముందు ఉత్తర ప్రత్యుత్తరాలు రాయడం తగ్గించివేయదలుచుకున్నాను. నా జీవితంలో ఆఖరి అధ్యాయం ప్రారంభమైంది. ఇంకా ఎన్ని పుటలు ఉన్నాయో తెలియదు. ఎప్పుడు ఆఖరవుతుందో ఎవరికి తెలుసు? త్వరలో సంభవిస్తుందన్న భయమేమీ లేదు..." అని రాశారు.

ఇది ఆఖరి అధ్యాయం కాదనీ, ఇంకో నూతన అధ్యాయం ఆరంభమవుతుందనీ అప్పట్లో ఆయనగాని, మరెవరుగాని ఊహించలేదు. భవిష్యత్తులో ఎటువంటి సంఘటనలనెదుర్కోవలసి ఉంటుందో ఏ జ్యోతిష్కుడూ సూచించలేదు. నాన్నగారికి కూడా జ్యోతిష్యం వచ్చు. సాముద్రికం తెలుసు.

నరసాపురంలో ఉంటే, మాకు వాళ్లని చూడటానికి ఇబ్బంది అవుతోందనీ, హైదరాబాదులో ఉంటే తరుచు అన్నయ్యగాని, నేను గాని పనిమీద వెళ్లినప్పుడు అమ్మనీ, నాన్నగారినీ చూడటానికి వీలవుతుందనీ రాశాను. అమ్మకి కూడా హైదరాబాదు వచ్చెయ్యాలని ఉందనీ, నరసాపురంలో ఉండి, ఆ నూతి నీళ్లు

తోడుకోలేక బాధపడుతోందనీ కూడా రాశాను నాన్నగారికి. పైగా, నాన్నగారికి కేటరేక్ట్ ముదురుతోంది. ఇంకా హోమియో మందులేే వాడుతున్నారు.

"…. మీ అమ్మగారు బాగానే ఉన్నారు. హైదరాబాదు వెళ్లిపోయి స్వగృహంలో ఉండాలని పట్టు పడుతున్నారు. నాకు అటువంటి అనుబంధం ఏమీ లేదు. ఆ ఇంట్లోనే ఉండాలనే కోరిక నాకెప్పుడూ లేదు. నా మెడకి తాడువేసి నన్ను అక్కడికి లాక్కు వెళ్లాలని చూస్తున్నారు" అని రాశారు నాన్నగారు.

నేను కొంచెం ధైర్యం చేసి మళ్లీ రాశాను – ఇద్దరూ వృద్ధులైపోయారు, ఆరోగ్యం క్షీణిస్తోంది, కంటిచూపు కూడా తగ్గిపోతోంది. నలుగురికీ వీలుగా ఉండేలా హైదరాబాదులో ఉండటం గాని, డెహ్రాడూన్‌లో అన్నయ్య దగ్గర ఉండటం కాని ఈ వయస్సులో మంచిది" అని రాయగానే నాన్నగారు గంభీరంగా సమాధానం ఇచ్చారు.

"…. ఈ ఉత్తరాన్ని కొంత సందేహిస్తూ, కొంత బాధపడుతూ రాస్తున్నాను. నీకు కోపం రావచ్చును. కాని నిజాన్ని స్పష్టంగా చెప్పినట్లయితే, కోపం తెచ్చుకోవడానికి ఆస్కారం ఉండదు. పైగా అర్థం చేసుకోవడానికి వీలవుతుంది. ఈ ఉత్తరం రాయడానికి ముఖ్య కారణం మీ అన్నయ్యగాని, నువ్వుగాని ఇక ముందెప్పుడూ డెహ్రాడూన్‌కిగాని, ఢిల్లీకిగాని నన్ను రమ్మని రాయకుండా ఉండాలనే. నిజం చెప్పాలంటే, 'ముట్టు, అంటు' ఆచారాలను పాటించని ఆడది చేసిన వంట తినడం నాకూ, మీ అమ్మగారికీ కూడా ఇష్టం లేదు. ఇది నా మూర్ఖత్వం, మూఢ విశ్వాసం, పిచ్చి నమ్మకం అని నువ్వనుకుంటే అనుకోవచ్చు. ఇటువంటి విషయాల్లో ఇతరులకున్నపాటి జ్ఞానం నాకుండవచ్చు, ఉండకపోవచ్చు. నా వయస్సు ఇప్పుడు 76. ఈ వయస్సులో నేను మైలపడదలుచుకోలేదు. నన్ను క్షమించి, నా వయస్సునీ, నా మూఢ విశ్వాసాలనీ గౌరవించు. మీ అన్నయ్యకు కూడా ఇదే విషయాన్ని రాయదలుచుకున్నాను. మీ అందరికీ కోపం వచ్చినా నాకు ఫరవాలేదు…

అయితే, మేము ఈ ఊరి నుంచి మకాం ఎత్తేసి ఇంకో నెలా పదిహేను రోజుల్లో హైదరాబాదుకి వెళ్లిపోవడానికి నిశ్చయించుకున్నాం. రాజమండ్రి నుంచి నన్ను హైదరాబాదుకి ఈడ్చుకు వెడుతూంటే ఊరుకున్నాను (అప్పటికింకా బాగా దృఢంగా, ఆరోగ్యంగా, చురుకుగా ఉన్నప్పటికీ నా ప్రాక్టీసు మానేశాను).

మళ్ళీ హైదరాబాదు నుంచి నరసాపురానికి ఈడ్చుకు వెడుతూంటే ఊరుకున్నాను. ఇప్పుడు మళ్ళీ హైదరాబాదుకి ఈడ్చుకు వెడుతూంటే ఊరుకుంటున్నాను. ఈ శరీరం చివరికి అంబర్‌పేటలో అంతం కావాలనే నా కోరిక. ఇంక ఎక్కడికైనా ఈడ్చుకు పోబడటంకన్న ఈ జీవితాన్ని అంతం చేసుకోవడం నయం. ఈ మార్పులతో నాకు విసుగొచ్చేసింది. నాకు కావలసిందల్లా మనశ్శాంతి, విశ్రాంతి. ఇంతకన్న మరే సుఖమూ అవసరం లేదు....

ఆప్యాయత పేరుతో ఎవరూ నన్ను బాధపెట్టడం నాకిష్టం లేదు. నాకెక్కడికీ వెళ్ళాలని లేదు. నాకెవరినీ చూడాలని లేదు. అదంతా అయిపోయింది. ఈ ఆఖరి రోజులు (అంతం ఎంతో దూరం లేదని నా ఆశ) ప్రశాంతంగా ఏ గొడవలూ లేకుండా గడిచిపోనివ్వండి. ఇంత నిర్మొహమాటంగా చెబుతున్నందుకు మన్నించు. నా కన్ను మరింత పాడైంది. కేటరాక్ట్ ముదురుతోంది. చాలా త్వరగా ముదురుతున్నట్లుంది. ఇంతకాలం జీవించినందుకు వృద్ధాప్యాన్నీ, దాని ఫలితాలనీ అనుభవించక తప్పదు. కొద్ది సంవత్సరాల క్రితమే పోయి వుంటే ఈ బాధ తప్పి ఉండేది.

మేము ఆఖరిసారి మకాం మార్చే ప్రయత్నంలో ఉన్నాం..." అని రాశారు. "ఇక ఈ ఊరి నుంచి ఉత్తరాలు రాయడం ఉండదు" అని కూడా రాశారు.

* * *

నాన్నగారు హైదరాబాదుకి చేరుకున్నాక మళ్ళీ ఉత్తరం రాశారు. "...మేమిక్కడికి నిన్న పొద్దున్న 8.30కి క్షేమంగా చేరుకున్నాం (రాత్రంతా నిద్రలేకపోయినప్పటికీ). ఈ కొత్తచోట సామాన్లవీ సర్దుకుంటున్నాం..." అని.

నాన్నగారి మనస్సు కూడా మెల్లిగా సర్దుకుంటుంది లెమ్మని ఊరుకున్నాను. అనుకున్నట్లుగా అమ్మ ఆనందంగానే ఉంది కానీ, నాన్నగారికి మాత్రం నరసాపురమే ఎక్కువ నచ్చినట్లు ఆయన ఉత్తరాన్ని బట్టి తెలిసింది. తన సహజ ధోరణిలో రాశారు :

"... నువ్వు రాశావు గుర్తుందా.. నరసాపురం దూరం, ప్రయాణ సౌకర్యం లేదు. అని. అయ్యో! పాపం! నరసాపురం ఏంచేసింది? అక్కణ్ణించి ఇక్కడికొచ్చి మూడు నెల్లయింది. పాపం, ఆ నరసాపురం గురించీ, అద్భుతమైన ఈ

హైదరాబాదు నగరం (మన రాజధానీ నగరం) గురించీ మంచి, చెడూ ఎంతో నిష్పక్షపాతంగా, న్యాయంగా నా అభిప్రాయాలను రాస్తున్నాను.

హైదరాబాదులో నచ్చిన అంశాలు :

(1) మంచి చుక్కల అరటిపళ్లు దొరుకుతాయి న్యాయమైన ధరకి. ఇంకోటేమీ లేదు చెప్పడానికి.

నచ్చని అంశాలు :

(1) బియ్యం, పాలు, బొగ్గులు, నూనె, కూరలు ఖరీదులు ఎక్కువ. (2) మంగలి, చాకలి, పనిమనిషి ఖర్చు మరీ ఎక్కువ, (3) లోకల్ రైళ్లు, లారీలు, కార్లు, స్కూటర్లు, పాలవాన్లు, తదితర వాహనాలూ తెరపి లేకుండా చేసే దుర్భరమైన చప్పుళ్లు, (4) దోమలు చెప్పలేనన్ని, (5) భరించలేని చలి (6) తరుచు వచ్చేపోయే అతిథులు, వాళ్లకి ఏ వేళప్పుడొచ్చినా కాఫీ ఇవ్వడం – ఛండాలమైన దురలవాటు (7) రవంత నిఃశ్శబ్దంగా, మనశ్శాంతిగా, ప్రశాంతంగా ఉండదు, (8) దూరాలు– ఓయి భగవంతుడా! పెరుగుతున్న ధరలతో బస్సులు, రిక్షాలు, టాక్సీలు, ఎక్కలేని (నాబోటి) వాళ్లు నడవాలంటే ఎంతెంత దూరాలు – సుల్తాన్‌బజార్, నాంపల్లి, హనుమాన్ టెకిడీ, నారాయణగూడా, హిమాయత్‌నగర్, మలక్‌పేట, ఇంకా ఎన్నోచోట్లు. బీదవాణ్ణి. ఆ దేవుడే రక్షించాలి. రోడ్లమీద వచ్చేపోయే రద్దీ ఎంత ఉంటుందంటే, వెళ్లిన మనిషి ఇంటికి తిరిగి భద్రంగా వచ్చేదాకా భయమే!

నరసాపురంలో అయితే (1) బ్రతకడానికి ముఖ్యంగా కావలసిన బియ్యం, పాలు, కూరలూ, మొదలైనవన్నీ చవక (2) పనిమనిషి, చాకలి, మంగలి చవగ్గానె దొరుకుతారు (3) పట్టణంలో లభించే సామాన్య సౌకర్యాలతోబాటు, పల్లెటూరి జీవనంలా ఉంటుంది (4) హాయిగా, ప్రశాంతంగా ఉంటుంది. (5) గోదావరి కాలవ ఒడ్డున ఉదయం, సాయంకాలం షికారుగా నడిచి వెళ్లడానికి బ్రహ్మాండంగా ఉంటుంది. నాలుగైదు మైళ్లు అయినా హాయిగా నడిచిరావచ్చు. (6) ఏ పనికైనా ఎంతో దూరం నడిచి వెళ్లక్కర్లేదు. అన్నీ దగ్గర.

... అంత మంచి నరసాపురాన్ని వదిలిపెట్టి ఈ మహానగర భాగ్యానికేనా 76 ఏళ్ల వృద్ధుణ్ణి ఇక్కడికి ఈడ్చుకురావడం? ఎంత విచిత్రం? ఆడవాళ్లకి నగర జీవితం అంటే ఎంత గాఢమైన వ్యామోహం! ఇది మాత్రం తిరుగులేని సత్యం.

మగవాడు మాత్రమే – ఒక్క మగవాడు మాత్రమే హాయిగా, ప్రశాంతంగా ఉండే పల్లె జీవనాన్ని కోరుకుంటాడు. నగరాల్లోని రకరకాల ఆకర్షణలనీ, పైపైకి కనిపించే సౌఖ్యాలనీ కాదని, పల్లెటూరి జీవితాన్ని కోరుకునే ఏ స్త్రీ గురించీ ఇంతవరకు వినలేదు నేను. అటువంటి స్త్రీని చూడలేదు నేను. పురుషుడు స్త్రీకి లొంగిపోయి తీరాలి. పురుషుడి స్థానం, అభిప్రాయాలు, ఆధిక్యత, చివరికి వ్యక్తిగత కష్టసుఖాలూ అన్నీ పోతాయి – మొత్తం మీద తుడిచి పెట్టుకుపోతాయి. పురుషుడి మీద తరతరాల నుంచీ పేర్చుకున్న కక్ష తీర్చుకుంటోంది స్త్రీ! మహిషాసుర మర్దిని చిత్రంలోలాగ పురుషుడు స్త్రీ అరికాలి కిందపడి నలుగుతున్నాడు. కాదంటావా?...”

అవుననలేదు, కాదనలేదు. ఉత్తరం చదివి నవ్వుకున్నాను. నాన్నగారు ఎదురుగా ఉంటే నవ్వడానికి కూడా భయమే! త్వరలోనే నాకు హైదరాబాదు వెళ్లే అవసరం పడింది. మేమిద్దరం మా మరిది పెళ్లికి వెళ్లాం. అమ్మనీ, నాన్నగారినీ కూడా చూశాను. నేను పెళ్లి హడావిడిలో ఉండటం వల్ల ఎక్కువ సమయం వాళ్లతో గడపలేకపోయాను. అయినా, ఆ కాస్తకే ఆయన మురిసిపోతూ ఉత్తరం రాశారు.

“... మీ ప్రయాణం సుఖంగా సాగి, మీరు క్షేమంగా చేరినందుకు సంతోషం నువ్వు మీ అత్తవారి ఆదరాభిమానాలను పొందగలిగినందుకు నేను నిజంగా ఆనందిస్తున్నాను. మన కుటుంబంలో అత్తవారి ఆదరాభిమానాలను నీ అంతగా పొందగలిగిన వాళ్లెవరూ లేరు. ఇందుకు నీ మృదు స్వభావం, సంస్కృతి, విశాల హృదయం కొన్ని కారణాలనుకుంటాను. ఇదివరకు ఎందరో అన్నట్లుగానే, మొన్న మా ఇంట్లో ఉండగా నిన్ను చూసిన నా మిత్రుడు అదే అన్నాడు. “మీ అమ్మాయిని చూసి ఎం.ఏ. పాసైందనీ, వెయ్యి రూపాయలు నెలకి సంపాదిస్తోందనీ అంతకన్న ఎక్కువ సంపాదించే ఆఫీసరుకి భార్య అనీ అసలు అనిపించలేదు. అంత సాధారణంగా, అంత నిరాడంబరంగా ఉంది” అని. నీకు నా ఆశీస్సులు. ఇక నా ఆరోగ్యం విషయం – ఇప్పుడిక కొత్త బియ్యం తినడం లేదు కాబట్టి క్రమంగా నయం కావచ్చు. నిన్న రాత్రి నుంచి రోజా గోధుమ అన్నం తింటున్నాను. ఇది వరకులా చపాతీలు తినలేకపోతున్నాను.

... తూర్పు బెంగాల్‌లో ఇంకా విషమంగానే ఉంది కదా. ఒకవైపు 75 మిలియన్ల ప్రజలు నానా బాధలూ పడుతూ, అనేక విధాలైన చిత్రహింసలు

భరిస్తూ, నిశ్శబ్దంగా ఆక్రోశిస్తూంటే నేనెలా వాటిని విస్మరించి ఉండగలను? అదీకాక, వరదల భీభత్సం, పంటలు, ఆస్తులూ నాశనం కావడం, బీహార్‌లో, బెంగాల్‌లో, యు.పి.లో, రాజస్థాన్‌లో, ఒరిస్సాలో - ఎక్కడ చూసినా జననష్టం మాటేమిటి? బాహ్యంగా జరిగే ప్రతిదాన్నీ నేను పట్టించుకోకుండా, నా మటుకు నేను మీ అన్నయ్యకొన్న ఇంట్లో మేడమీద ఓ మూలగదిలో కూర్చుని హాయిగా నా బ్రతుకేదో నేను బ్రతకాలా? సున్నితంగా స్పందించగల ఏ మానవుడికైనా ఇది సాధ్యమేనా? తనకు సంబంధించని ఏ బాహ్య విషయానికీ స్పందించకుండా, సంకుచితమైన, స్వార్ధపూరితమైన జీవితాన్ని అటువంటి జీవితాన్ని గడపటంలో అర్ధం ఉందా? తోటి మానవుల బాధల్లో, కష్టాల్లో, ఆవేదనలో పాలుపంచుకోవడం కన్న నిజమైన ఆనందం ఉందా? అదొక బాధామయమైన ఆనందం కావచ్చు! కానీ, వ్యక్తిగతమైన చైతన్యాన్నీ, తను వేరు అనుకునే భావాన్నీ తుడిచిపెట్టేసినప్పుడే ముక్తి అనేది సంభవమవుతుంది. స్వల్పమైన ఆ నేను అనేది లేనప్పుడు విశ్వమంతా నేను అవుతుంది. అందరి కష్టసుఖాలూ నీవే అవుతాయి. మానసికంగానైనా సరే, అందరితోబాటూ బాధపడటం నయం - సంకుచితమైన, స్వార్ధపూరితమైన వ్యక్తిగత జీవితంలో సంతోషాన్ని అనుభవించేకన్న. నా చిరకాల మిత్రుడు, సోదరుడు టి.ఆర్. పోయినందుకు నేను అమితంగా బాధపడుతున్నాను. ఆయన లేని లోటు తీర్చలేనిది...''

ఆ బాధలో ఉండియేమో, నా పుట్టిన రోజుకి శుభాకాంక్షలు తెలుపుతూ అలవాటు ప్రకారం ఉత్తరం రాయలేదు నాన్నగారు. నేను కొంచెం నిరుత్సాహపడ్డాను. నిజానికి, నిరుత్సాహం కన్న ఆశ్చర్యమే ఎక్కువ కలిగింది. ఒకవేళ ఆయన ఆరోగ్యం బావుండలేదేమోనన్న అనుమానం కూడా వేసింది. నేనే నా పుట్టిన రోజునాడు నాన్నగారికి ఉత్తరం రాశాను. దానికి సమాధానం రాశారు ఇలా :

``.... నా ఆరోగ్యం బాగానే ఉంటోంది. మొన్న ఆదివారంనాడు ఆర్.ఆర్. లాబ్స్ దాకా నడిచి వెళ్లి (ఆరో ఏడో మైళ్ళుంటుంది రానూ పోనూ) తిరిగి నడిచి వచ్చాను. ఊరికే, నా శారీరక దార్ఢ్యం ఎలా ఉందో పరీక్షించుకుందామని. నేను బాగానే ఉన్నాను. కొత్త బియ్యం కొనకుండా జాగ్రత్త పడుతున్నాను.

నీ పుట్టిన రోజుకి శుభాకాంక్షల్ని పంపలేకపోయినందుకు నన్ను మన్నించు. మా కోసం నువ్వెన్నో మంచి మంచి బహుమతులు పంపిస్తూ ఉంటావు. అలాంటి

బహుమతులు నేనివ్వలేను. ఈ ఉత్తరంతోబాటు జత చేసిన కాగితంలో 13 సూక్తులున్నాయి. నా ఉద్దేశంలో అవి ఎంతో శ్రద్ధగా ఆలోచించవలసిన సూక్తులు. వాటిని నేను పంపే బహుమతిగా స్వీకరించవలసిందని కోరుతున్నాను. నీ జన్మదిన సంఖ్యకు సరిగ్గా సరిపోయేటట్లు 13 సూక్తులు! నీ పుట్టినరోజు గడిచి పోయింది కాబట్టి, వీటిని దీపావళి కానుకగానైనా స్వీకరించు.

1. వర్తమానానికి అతీతమైన అనంతమైనదాన్ని తెలుసుకోవడమే జీవిత పరమార్థం.

2. నాగరికుడైన వ్యక్తి తన కోసం ఎవరినీ అర్థించకూడదు. తన కోసం దేనినీ వాంఛించకూడదు. ఇది నాగరికుడైన, సంస్కారి అయిన వ్యక్తి ప్రథమ కర్తవ్యం. తను ఒక ప్రతీకగా నిలవాలి. అంతర్వాణిని అనుసరించాలి. సంపూర్ణ సహనశీలియై ఉండాలి. నాగరికత, సంస్కారం ఉన్న వ్యక్తి దేనికీ భయపడనవసరం లేదు.

3. అహంభావాన్ని పూర్తిగా వదులుకోవడంలోనే, 'నేను' అనే భావాన్నీ, దాంతో వచ్చే బాధల్నీ, ఒంటరితనాన్నీ, విషాదాన్నీ, ఆవేదనల్నీ, భయాల్నీ పూర్తిగా త్యజించడంలోనే అందం ఉంది.

4. 'నేను' అనేది కేంద్రంగా ఏర్పడే మానసిక స్థితి అంతం కావాలి.

5. అవలోకించడమే అత్యద్భుతమైన ప్రక్రియ. సంపూర్ణ ధ్యానంతో అవలోకించడం తప్ప మరేమీ చెయ్యనక్కర్లేదు, (చిత్త చాంచల్యమే అన్ని అవక తవకలకూ మూలం) – ఆలోచనే జ్ఞాపకం, అనుభవం, జ్ఞానం – అదంతా కొనసాగుతున్నప్పుడు శ్రద్ధగా, నిరాటంకంగా అవలోకిస్తే చిత్రంగా ఉంటుంది. కానీ ఉద్దేశపూర్వకంగా శ్రద్ధ వహిస్తే అది అశ్రద్ధగా పరిణమిస్తుంది. అసలైన శ్రద్ధ అవదు. మనస్సు నిశ్చలంగా ఉన్నప్పుడు, ఆలోచనా ప్రక్రియ ఆగిపోయినప్పుడే నిజమైన సంపూర్ణమైన శ్రద్ధ ఏర్పడుతుంది.

6. సంప్రదాయ మార్గాన్ని వీడి, అసత్యమైన మతాలనుంచి తప్పించుకుని, నిజమైన మతం అనే మార్గాన్ని అనుసరించడం అవసరం (నిజమైన మతాన్ని అవలంబించే మనస్సు స్వేచ్ఛగా ఉంటుంది. దురాశ, అత్యాశ, స్వార్థపరత్వంగాని, కూడబెట్టుకునే గుణం గాని లేకుండా ప్రేమ పరిమళంతో నిండి ఉంటుంది ఆ మనస్సు).

7. అవలోకనంలో శ్రద్ధ లేనప్పుడే అవలోకించేవాడు ఉత్పన్నమవుతాడు. సంపూర్ణమైన శ్రద్ధ ఉన్నప్పుడు పరిపూర్ణమైన నిశ్శబ్దత ఉంటుంది. అందులో అవలోకించేవాడు అనీ, అవలోకింపబడేది అనీ ఎటువంటి ద్వైదీభావం ఉండదు.

8. ఆలోచనకి మూలం సుఖం. ఆ అనుభవం యొక్క జ్ఞాపకం, అటువంటి సుఖానుభూతిని మళ్లీ పొందాలనే కోరిక.

9. ఆలోచన అనేది కూడబెట్టుకునే లక్షణం, గతానుభవాలు, జ్ఞాపకాలు, స్వయం కల్పిత స్థితిగతులు, సమకూర్చుకున్న జ్ఞానం - ఇవే ఆలోచనలను వృద్ధి చేస్తాయి.

10. ఆలోచన అనేది ప్రధానంగా ఆత్మరక్షణ కోసమే. ఆలోచనలతో నిండిన మనస్సు కోరేది రక్షణ, రక్షణ రక్షణ - ఏ స్థితిలోనైనా (శారీరకంగా కాని, మానసికంగా కాని ఆఖరికి ఆధ్యాత్మికంగా కాని) ఆలోచన సృష్టించే వివిధ రూపాలు లేకుండా అవలోకించినట్లయితే ఆ రూపాలు అంతమైనట్లయితే, మనస్సులో మార్పు తేవాలని ప్రయత్నించకుండానే విప్లవాత్మకమైన మార్పు సంభవిస్తుంది.

11. ఈ ప్రపంచంలో విషపూరితమైన అత్యాశ లేకుండా జీవించడం సాధ్యమే. కానీ, ఆలోచన ఆవిర్భావాన్నీ, ఆలోచన సృష్టించే ద్వైదీభావాన్నీ - అవలోకించేవాడు, అవలోకింపబడేది అనే వైవిధ్యాన్నీ అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే అది సాధ్యమవుతుంది.

12. ఆలోచన ఒక స్థాయిలో పనిచేసి తీరాలి - వైజ్ఞానికంగా, సాంకేతికంగా, భౌతిక, వాస్తవిక స్థాయిలో. కానీ, మానసిక స్థాయిలో ఆలోచనాప్రక్రియ ఆగిపోవాలి. మానసిక స్థాయిలో నిశ్శబ్దంగా ఉండాలి. సంఘర్షణ జరిగినప్పుడే ఆలోచనా ప్రక్రియ జరుగుతుంది. ఆలోచన సంఘర్షణకి హేతువు అవుతుంది. మానసిక సమస్యల్ని ఆలోచన ఎప్పటికీ పరిష్కరించలేదు. మనస్సు స్తిమితంగా, నిశ్శబ్దంగా ఉన్నప్పుడే మానసిక సమస్యలు పరిష్కృతమవుతాయి.

13. స్వేచ్ఛ అనేది ఒక్కటే - సముపార్జిత జ్ఞానం నుంచి పొందే స్వేచ్ఛ అంటే ఆలోచన నుంచి, మానసిక గతం నుంచి, గతానుభవాల జ్ఞాపకం నుంచి, జ్ఞానం నుంచి. అటువంటి స్వేచ్ఛ కోసం పాటుపడటమే ముఖ్యం"

జిడ్డు కృష్ణమూర్తిగారి ప్రసంగాల్లోని సారాంశాన్నే వీటిల్లో పొందుపరిచారు నాన్నగారు. చదివి, దాన్ని భద్రంగా దాచాను ఫైల్లో. కానీ, ఆ సూక్తుల గురించి నా అభిప్రాయాలేమిటో, నేను ఎలా స్పందించానో ఏమీ రాయలేదు నాన్నగారికి. వాటి గురించి వ్యాఖ్యానించగల ఆత్మస్థైర్యం అప్పటికింకా లేదు. ఊరికే, క్లుప్తంగా, అటువంటి విశిష్టమైన పుట్టినరోజు కానుకని పంపించినందుకు కృతజ్ఞతలు తెలుపుతూ ఒక కార్డు రాశాను. రాయడానికి విశేషాలు ఇంకేమీ తోచలేదు. మళ్లీ ఇన్‌లాండ్ లెటర్ రాస్తే అందులో మూడువైపులా ఏవో విశేషాలతో నింపాలి. నింపకపోతే అదొక తంటా! అందుకని కార్డే రాశాను. మామూలుగా అయితే సంతోషించే వారేమో కాని, అంతటి అమూల్యమైన సూక్తుల గురించి నేను ఒక్క ముక్క కూడా రాయకపోవడం నాన్నగారిని నిరుత్సాహపరిచి ఉంటుంది. ఎందుకంటే, ఆ తరవాత ఆయన వద్ద నుంచి ఉత్తరమే అందుకు నిదర్శనం.

".... ఇకముందు నుంచీ పోస్టు కార్డుల మీదే ఉత్తరాలు రాయి. 20 పైసల ఇన్‌లాండ్ లెటర్ల మీదకాని, 25 పైసల కవర్లలో గాని రాయద్దు. మనం ఆర్థిక మంత్రి చేతుల్లో కీలుబొమ్మలు కావద్దు. నిరాడంబరంగా ఉండటం మనకు చాతనవును..." అని రాస్తూనే తను మాత్రం ఇన్‌లాండ్ లెటర్‌లోనే రాశారు!

మా అత్తవారింటికి వెళ్లి చూసివచ్చారుట. ఆ మధ్య స్వల్ప అస్వస్థతతో బాధపడ్డారుట మామగారు. ఇప్పుడు బాగానే ఉన్నారని రాశారు. తక్కిన బంధువుల గురించీ, పిల్లల గురించీ, పెద్దల గురించీ వివరాలు రాసిన తరువాత దేశ పరిస్థితి గురించి రాశారు :

"... (6) ఈ నెలలో పాకిస్థాన్‌తో యుద్ధం వచ్చేట్టు కనిపిస్తోంది - ప్రధాన మంత్రి తిరిగి వచ్చిన తరువాత. ప్రస్తుత ప్రపంచ పరిస్థితులు చూస్తూంటే ఆశ్చర్యం వేస్తోంది. ఈనాటి మానవ స్థితిగతులను చూస్తూంటే మరింత ఆశ్చర్యం వేస్తోంది. అమెరికా చూపించే అహంకారం, దౌర్జన్య ధోరణి (రాజకీయంగా, ఆర్థికంగా, సైనికంగా) - వాషింగ్‌టన్‌లో అధిష్ఠాన వర్గం వాళ్ల దౌర్జన్య ధోరణి నిజంగా విచిత్రంగా ఉంది. బ్రిటిష్ వాళ్లు, ఫ్రెంచి వాళ్లు, జర్మన్లూ అధోగతిని చవిచూసి, తమ స్థాయి ఏమిటో తెలుసుకున్నారు. అమెరికా ఎప్పుడు ఎలా అధోగతి పాలవుతుందో ఎవరికి తెలుసు? ఆ లెక్కన ఆయుధాలు తయారు చెయ్యడం, విదేశాలకు ఎగుమతి చెయ్యడం, ప్రపంచంలో ఎవరి మాటా

వినకుండా విగ్రహీగడం, తక్కిన ప్రపంచాన్ని అంత చిన్న చూపు చూడటం నిజంగా ప్రపంచ శాంతి ఏర్పడకుండా పట్టి పీడిస్తోంది. రష్యా, చైనా దేశాలు అమెరికా అడుగు జాడల్లో నడుస్తున్నాయి. అంతా ఒక చిత్రమైన చదరంగం!

(7) అవును గానీ, నీ ఉద్దేశం ఏమిటో చెప్పు. (1) ఒకడు కొండల కింద చీకటి లోయల చుట్టూ ఎప్పుడూ ఏదో తడుముకుంటూ, లొడ లొడ వాగుతూ, సణుక్కుంటూ, అష్టకష్టాలు పడుతూ, సంపాదిస్తూ, పోగు చేసుకుంటూ ఉంటాడు. మరొకడు మేఘాలు లేని ఆకాశంలోకి దూసుకుపోయి అత్యున్నత పర్వత శిఖరాగ్రాల కింకాపైన ఏ విధమైన ఆటంకాలూ ఎదురవని చోట, ప్రగాఢమైన పరిపూర్ణ నిశ్శబ్దత, ప్రశాంతత ఆవరించి ఉన్నచోట తేలుతూ ఉంటాడు. ఈ ఇద్దరి మధ్య ఉండే వ్యత్యాసం గురించి నీకేమనిపిస్తోంది?

అమ్మా, మనం మన గూళ్లలో నివసిస్తూనే, మబ్బుల్లేని అనంతాకాశంలో తేలుతూ, వర్ణనాతీతమైన ఆనందాన్ని చవి చూడటం సాధ్యం అంటావా, కాదంటావా?

(2) నువ్వు కృష్ణాజీ ప్రసంగాలను కొన్ని విన్నావు. కానీ, ధ్యానం గురించి ఆయన చెప్పిన దాన్ని అర్థం చేసుకున్నావా? నువ్వూ, మీ ఆయనా ఎప్పుడైనా అలా ధ్యానం చెయ్యడానికి ప్రయత్నించారా? ఈసారి ఎప్పుడైనా ధ్యానం గురించి రాస్తాను..."

హైదరాబాదులో చలి చాలా ఎక్కువగా ఉంటోందనీ, భరించడం కష్టంగా ఉందనీ, అమ్మ ఉత్తరం రాసింది. దానికి జవాబుగా అమ్మకి నేను రాసిన విషయం గురించి విని, నాన్నగారు రాశారు నాకు.

"... మీరు ఢిల్లీ చలి తట్టుకోవడానికి వాడుకునే రోజాయిలు లాంటివి మాకు కావాలంటే పంపిస్తానని రాశావుట. మీ అమ్మగారు నాతో చెప్పారు. నీకు పుణ్యం ఉంటుంది. అటువంటి రొజాయిలు నాకు మాత్రం పంపించకు. నాకే రొజాయీ అక్కర్లేదు. నాకు మంచి బనీను, స్వెట్టరు, శాలువ, ఖద్దరు దుప్పటీ ఉన్నాయి. నువ్విచ్చిన శాలువ కూడా ఉంది. నాకింకేమీ వద్దు. ఇంకా ఇచ్చి నామీద భారం పెంచకు. నాకున్న పాటైనా లేని వాళ్ల గురించి ఆలోచించు. వాళ్లు ఎలా బాధలు పడుతున్నారో గమనించు. ఏసుక్రీస్తు చెప్పిన మాటల్ని మనం మరిచి పోకూడదు. "నీ దగ్గర రెండు కప్పుకునే దుస్తులుంటే ఒకటి అసలు

లేనివాడికి ఇయ్యి." నన్ను ఇలా సాదాగా, నిరాడంబరంగా ఉండనీ..."

నేను రోజాయిలు పంపే ప్రయత్నాన్ని విరమించుకున్నాను. ఇండియా-పాకిస్థాన్ యుద్ధం ముగిసింది. తరవాత నాన్నగారు ఆ విషయమై రాశారు ఉత్తరంలో.

"... తూర్పు పాకిస్థాన్ ప్రజల కష్టాలు, పడిన బాధలు, చిత్రహింస ఈనాటికి తీరినందుకు నాకు ప్రాణం కుదుటపడినట్లుగా ఉంది. నేను కోరుకోకపోయినా, పాకిస్థాన్‌కి కలిగిన ఈ పరాభవం జరగవలసిందే - వాళ్లు చేసిన దానికి..."

అమ్మ వంట చేసుకుంటూంటే, మరుగుతున్న నీళ్ల గిన్నె చేతిలోంచి జారి నీళ్లు కాలిమీద ఒలికి పోయి, అమ్మ కాలు బాగా కాలిబొబ్బలెక్కిందిట. చాలా బాధపడుతోందని రాశారు. అలాగే, కుంటుతూ పనులు చేసుకుంటోందిట.

ఇది కాక మరొక విషాద వార్త గురించి రాశారు. మా నాన్నగారి మేనకోడలి భర్తకి పురుషాంగం మీద కేన్సర్ అని తెలిసిందిట. ఆపరేషన్ జరిగిందనీ, ప్రమాదం తప్పిందనీ రాశారు నాన్నగారు రోజూ ఆసుపత్రికి వెళ్లి అయిదారు గంటలసేపు ఆయన దగ్గరుండి వస్తున్నారుట. ఆయన పిల్లలంతా వచ్చి దగ్గరున్నారనీ, ఆదుర్దా పడుతున్నారనీ, ఆయన్ని ఇంటికి తీసుకువచ్చాక అధమం ఒక నెల్లాళ్లపాటైనా ఆయనకు సేవ చెయ్యవలసి ఉంటుందనీ రాశారు.

తరవాత అమ్మ కోలుకుంటున్నట్లు తెలిసి సంతోషించాను. అంతకుముందు నేను హైదరాబాదు వెళ్లినప్పుడు అమ్మ నాకు రెండు పాత పట్టు చీరలిచ్చి వెలిసిపోయిన రంగుల్ని మళ్లీ కొత్తగా వేయించి పెట్టమని అడిగింది. హైదరాబాదులో చేయించి పెట్టేవాళ్లెవరూ లేరంది. అక్కడుండి చేయించడం నాకూ కుదరదు కాబట్టి ఢిల్లీ పట్టుకొచ్చి, ఇక్కడ రంగులు వేయించాను. వాటిని ఎవరో స్నేహితులు హైదరాబాదు వెడుతూంటే వాళ్ల చేతికిచ్చి పంపించాను. అవి అందిన తరువాత, నాన్నగారు ఉత్తరం రాశారు.

"... నువ్వు పంపిన పేకెట్ అందింది. మీ అమ్మగారికి చీరలు నచ్చాయి. పాత చీరలు కొత్త రంగుల్లో! నావంటి ముసలి వాళ్లని - కళ్లు, పళ్లు, చెవులూ అవీ సరిగా లేని వాళ్లని మళ్లీ యౌవన వంతులుగా, ఉత్సాహవంతులుగా చెయ్యగలవా?!!! నువ్వు చెయ్యగలిగినా, మారాలనే కోరిక నాకు లేదుస్మీ!...

మీ అమ్మగారికి జలుబు చేసి భారంగా ఉంది. చీటికీ మాటికీ మడీ, దడీ అంటూ స్నానాలు ఎక్కువై. కంగారు పడవలసిందేమీ లేదు..."

ఉత్తరాల్లో ఉన్న హాస్య ధోరణి ముఖాముఖీ సంభాషణలో ఉండదు నాన్నగారికి. కంచుకంఠంతో, గంభీరంగా ముఖంపెట్టి మాట్లాడేసరికి, జోక్ వేసినా నవ్వడానికి జంకు పుడుతుంది. హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావుగారు కూడా అంతే. రాజమండ్రిలో నాన్నగారి స్నేహితుడే ఆయన. నాకు వీరేశలింగం హైస్కూల్లో టీచర్ కూడా. ఆప్షనల్ మేథమేటిక్స్, ఇంగ్లీషు-తెలుగు అనువాదం క్లాసులూ తీసుకునేవారు. క్లాసులోగాని, స్టేజిమీద గాని చతురోక్తులు విసిరేటప్పుడు యమ గంభీరంగా ఉండేవారు. పొరపాటున కూడా ముఖం మీద చిరునవ్వు తొంగిచూసేది కాదు. కాని జనం మాత్రం పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వేవారు ఆయన మాటలకి. నేను ఇంట్లో ఏదైనా అవకతవక పని చేస్తే, 'అపసవ్యం' అని నీలాంటి పాత్రని సృష్టించి నాటకం రాయమని కామేశ్వర రావుగారితో చెబుతానని బెదిరించేవారు నాన్నగారు. నాకు లెక్కల్లో మార్కులు తక్కువొచ్చేవి ఎంత సాధన చేసినా. మా అన్నయ్యకి 100 కి 125 వచ్చేవిట మార్కులు - అంటే - ఛాయిస్ కూడా తీసుకోకుండా అన్ని లెక్కలూ కరెక్టుగా చేసేవాడుట! అందుకే నాకు కామేశ్వర రావుగారి ఎదుట పడాలంటే భయంగా ఉండేది. ఆయన అనువాదం క్లాసులో చెప్పిన సూత్రం ఒక్కటే నాకు పట్టుబడింది. 'మహాచెట్టు' వంటి దుష్ట సమాసాలు వాడకూడదనీ, అనుమానం, అవసరం వచ్చినప్పుడల్లా నిఘంటువు చూడటం అలవరచుకోవాలనీను.

'మతిమరుపు' నాలోని మరో లోపం. గతాన్ని మరిచిపోవాలని కృష్ణమూర్తి గారు చెప్పడంలో అర్థం - నాలాగ ముఖ్యమైన విషయాలూ, నిత్య జీవితంలో అవసరమయే విషయాలూ మరిచి పోవాలని కాదు. సుఖ దుఃఖాలకు సంబంధించిన గతానుభూతుల్నీ, గతానుభవాల్నీ జ్ఞాపకాలుగా పదిలంగా దాచుకోకుండా ఉండాలనీ, అటువంటి జ్ఞాపకాలే వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ మరింత దుఃఖానికి హేతువవుతాయని గ్రహించాలనీ చెప్పారు. నాదంతా అపసవ్యం - నాన్నగారన్నట్లు.

ఇంతకు ముందు నాన్నగారు నరసాపురంలో ఉండగా కృష్ణమూర్తిగారి ప్రబోధాల ననుసరించి నవ్య మనస్సు అనే పుస్తకాన్ని పన్నెండు అధ్యాయాలతో రాశారనీ, దాన్ని ప్రచురించే విషయం గురించి మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరిగాయనీ ఎలా మరిచిపోయానో తెలియదు!

తీరి కూర్చుని, గిల్లి కజ్జా తెచ్చినట్లు చేశాను. కృష్ణమూర్తిగారి ప్రబోధాలను విశ్లేషిస్తూ ఏమైనా రాయకూడదా అని రాశాను నాన్నగారికి! (కృష్ణమూర్తి గారికి ఇతరులు అలా విశ్లేషణలు చెయ్యడం ఇష్టం ఉండేది కాదని, తరవాత మేరీలుట్యెన్స్ రాసిన కృష్ణమూర్తిగారి జీవిత చరిత్ర చదివాక తెలిసింది). నా ఉత్తరానికి నాన్నగారు రాసిన సమాధానం :

".... జిడ్డు కృష్ణమూర్తిగారి ప్రబోధాలపై వివరణలు రాయకూడదా అని రాశావు. నీకు గుర్తుందో లేదో మూడేళ్ల క్రితం ఏలూరులో నేను చేసిన చిన్న ప్రసంగాన్ని పుస్తక రూపంలో (ఇంగ్లీషులో) ప్రచురించారు. నీకు ఒక కాపీ పంపాననుకుంటాను. ఆ ప్రసంగాన్ని చాలా మంది మెచ్చుకుని నన్నభినందించారు. అందుకనే దాన్ని ప్రచురించడం జరిగింది. నరసాపురంలో ఒక స్నేహితుని సలహా మేరకు మరో పదకొండు ప్రసంగ వ్యాసాలు రాశాను. ఈ విషయం కూడా నీకు రాశాను (గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించు: 1) మనలోని లోపమేమిటి?, 2) నిజమైన మతం ఏమిటి?, 3) జ్ఞానం వల్ల ఉపయోగాలు, 4) సమాజం యొక్క మానసిక నిర్మాణం, 5) కర్తవ్యం, హోదా, 6) సూటిగా గ్రహించడం, 7) మనస్సు ప్రశాంతంగా ఉండగలదా?, 8) ఆత్మ జ్ఞానమే యోగం, 9) ప్రార్థన అగత్యం,, 10) ప్రేమ, మరణం, 11) పరిణామం, పరివర్తన, 12) ఆధ్యాత్మిక ప్రజాస్వామ్యం.

ఈ పన్నెండు ప్రసంగ వ్యాసాలూ 180-190 పేజీల దాకా వచ్చాయి. ముందు ఇంగ్లీషులో రాసి, తరవాత తెలుగులోకి అనువదించాను. ముందు చిత్తు ప్రతులనూ, తరవాత వాటిని తిరుగ రాయడం జరిగింది. అన్నింటికీ కలిపి 'నవ్య మనస్సు' అని పేరు పెట్టాను. అందులో జె.కె.గారి బోధనలనూ, భావాలనూ నేను అవగాహన చేసుకున్న రీతిలో, అనుభవాన్ని పొందిన రీతిలో వివరించాను. అవి చాలా విలువైన వ్యాసాలనే నా ఉద్దేశం. కానీ, ఏం లాభం? నా నరసాపురం స్నేహితుడు ఆ ప్రసంగ వ్యాసాలను చదివి వినిపించే అవకాశాన్ని కలగజేస్తానని ఓ ఏడాదిపాటు ఎన్నోసార్లు చెప్పినా, ఇంతవరకు ఏమీ చెయ్యలేదు. తణుకులో ఉన్న మిత్రులు ఎలాగో తణుకులో చదివి వినిపించే ఏర్పాటు చేశారు. కొంతమంది స్త్రీలకి - మీ అమ్మగారితో సహా - తెలుగు ప్రసంగాలు వినిపించాను. ఆ స్త్రీలు నేను చెప్పినది గ్రహించే శక్తి తమకు చాలదన్నారు. ఇంకా అంత ఎత్తు ఎదగలేదన్నారు. ఇంగ్లీషులో విన్న మగవాళ్లు అంత

సుముఖంగా కనిపించలేదు. సంప్రదాయ బద్ధమైన, సంకుచితమైన మనస్సులు వారివి. మతాలలో మునిగిపోయి, మూఢ విశ్వాసాలతో, మానసిక దౌర్బల్యాలతో మూసుకుపోయిన మనస్సులతో విన్నారు. ఇద్దరు ముగ్గురు మాత్రం వాటిని అర్థం చేసుకుని తమ ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ ప్రకటించారు. పొగడ్తగాని, ఖండనగాని, విమర్శగాని, విముఖతగాని ఏదీ నేను పట్టించుకోను. రాజమండ్రిలో కొందరు స్నేహితులు ప్రయత్నించారుగాని, ఆ ప్రసంగాలను వినేందుకు సమావేశాలను ఏర్పాటు చెయ్యలేకపోయారు.

మేం ఇక్కడికొచ్చి మూడేళ్లు కావొస్తోంది. ఇక్కడ థియొసాఫికల్ లాడ్జి సభ్యులు ఆ ప్రసంగాలను వినిపించడానికి సమావేశం ఏర్పాటు చేస్తారేమోనని ప్రయత్నించి చూశాను. వాళ్లు ఏమీ చెయ్యలేకపోయారు. ఒక ఏడాదిపాటు ఎదురు చూశాను. అలమారులో పై అరలోంచి ఆ ప్రసంగ వ్యాసాల కట్టలు నాకేసి గుడ్లు మిటకరించి చూస్తూండేవి.

అప్పుడు నన్ను నేనే ఇలా ప్రశ్నించుకున్నాను : (1) నా ప్రసంగ వ్యాసాల్ని ఎవరికైనా చదివి వినిపించాలనీ, ఎవరైనా వినాలనీ, విని నన్ను అభినందించాలనీ నేనెందుకు కోరుకోవాలి?

(2) వాటిని ప్రచురింప జేయాలనీ, అవి గుర్తింపు పొందాలనీ ఎందుకు కోరుకోవాలి? అచ్చు వేయించాలని ఎందుకీ ఆదుర్దా?

(3) ఈ రోజుల్లో రెండు మూడు వేలు ఖర్చుపెట్టి వాటిని ఎవరు ప్రచురిస్తారు? అయినా, ప్రచురించాలనీ, గుర్తింపు పొందాలనీ, అభినందనల నందుకోవాలనీ, నలుగురికీ తెలియాలనీ ఎందుకీ దురద?

అందుకే ఓరోజు పొద్దున్నే ఆ కాగితాలన్నిటినీ 380 పేజీలుంటాయి – అన్నీ చింపి పారేశాను. అంతటితో ఆ వ్యవహారం ముగిసి, మనస్సు నిశ్చింతగా, ప్రశాంతంగా ఉంది. నేను చేసిన పనికి నేను ఎప్పుడూ చింతించలేదు. ఇప్పుడూ బాధపడటం లేదు. ఆ విషయంలో కొత్తగా మళ్లీ ప్రయత్నించ దలుచుకోలేదు. నన్ను మన్నించు..."

నేను అంత వివేకహీనంగా ఎలా రాశానో నాకర్థం కాలేదు. కేవలం నా నిర్లక్ష్య భావమే. నా ఆఫీసు గొడవల్లో నేనుండి, ఆయన రాసే విషయాలను శ్రద్ధగా చదివి జీర్ణించుకోకుండా, కేవలం ఉత్తరాల్లో ఏదో ఒకటి రాసి ఆయన్ని

తృప్తి పరచాలనుకోవడం తప్ప, ఆయన చేస్తున్న కృషిని అర్థం చేసుకున్నట్లు ప్రవర్తించలేదు. లేకపోతే, అన్నిసార్లు ఆయన పదే పదే తన ప్రసంగాల గురించీ, ప్రచురణ గురించీ రాసిన విషయాలను పట్టించుకోకుండా, మూడేళ్లు తిరక్కుండా, ఏమీ ఎరగనట్లు, ఏదో సరికొత్త సలహా ఇస్తున్నట్లు నేను అదే విషయాన్ని మళ్లీ రాయమనడం ఏమిటి? ఆయన మనస్సు ఎంతగా గాయపడి ఉంటుందో ఊహించుకుని నా మనస్సు కుంచించుకు పోయింది. ఆయన నామీద ఏర్పరచుకున్న సదభిప్రాయాన్ని ఛిన్నాభిన్నం చేసేశాను. అయినప్పటికీ, నాన్నగారు వెలితిపడలేదు. నన్ను పల్లెత్తు మాట అనలేదు. బాగా గుర్తు చేసుకో అన్నారంతే. నేను స్వయంగా కలుసుకున్నప్పుడు కూడా ఏమీ చర్చించలేదు. అది కృష్ణాజీ ప్రభావం వల్ల ఆయనలో వచ్చిన సాత్వికతో, లేక పితృ వాత్సల్యమో చెప్పలేను. చిన్నప్పుడు పుత్రికకంటే వాత్సల్యం లేక కాదు నన్ను తనకు మానసికంగా, శారీరకంగా దూరం చేసుకున్నది. అప్పుడు క్రమశిక్షణ, అసహనం ఆయన చర్యల్ని శాసించాయి. ఇప్పుడు ఒక విధమైన పరిణామం వచ్చినట్లూ, నాన్నగారు తన స్వభావాన్ని చాలావరకు మార్చుకున్నట్లూ ఒప్పుకోవాలి అధమం నా విషయంలో. నా స్వతంత్ర ప్రతిపత్తిని గౌరవించడం, తండ్రిగా తన పరిధిని గుర్తించడం కనిపిస్తుందాయన ప్రవర్తనలో.

* * *

మళ్లీ ఎవరో స్ఫూర్తినిచ్చి ఉంటారు కృష్ణమూర్తిగారి బోధనల గురించి వ్యాసాలు రాయడానికి. కొన్నాళ్ల తరువాత మళ్లీ రాసి పంపించారు.

"....... ఈ ఉత్తరంతోబాటు కొన్ని వ్యాసాల్ని కొంచెం సంకోచంతోనే పంపిస్తున్నాను. మీ దంపతులిద్దరికీ, మీకున్న సాహిత్యాభిలాషతో, ఆధునిక అభిరుచులతో ఈ వ్యాసాలు నచ్చుతాయో లేదో! నీకు పంపిస్తున్న ఈ వ్యాసాలు 8వసారి కాపీ చేసినవి. కొంత శారీరకంగా శ్రమ అయిందనుకో కొంతమంది స్నేహితులు నామీద ఉన్న ఆప్యాయత, సదభిప్రాయం కొద్దీ (నేనందుకు తగిన వాణ్ణి కాకపోయినా) నన్ను ఆకాశానికెత్తేస్తూ అభినందించారు. 88 ఏళ్ల ఒక స్నేహితుడైతే, తన్మయత్వం చెందాడు. నా వ్యాసాల్ని ఆయన స్వయంగా కాపీచేసి, మద్రాసులో ఉన్న తన స్నేహితులు కొందరికి పంపించాడుట. ఏడుగురు స్నేహితులకి కాపీలు తయారుచేసి ఇచ్చాను. నీకు కూడా ఒక సెట్ ఇవ్వకపోతే నా కర్తవ్యాన్ని నిర్వర్తించని వాడనే అవుతాను. నీకు పంపించనంతటి

నిర్దయుణ్ణి కాలేను. కొంతమంది టి.ఎన్. సోదరులు ఆ వ్యాసాల్ని పారాయణం చేస్తున్నట్లు కూడా చెప్పారు. అవి అంత విలువైనవి అంటున్నారు. ఏమో నాకు తెలియదు. జిడ్డు కృష్ణమూర్తి గారి ప్రబోధాలపట్ల అభిరుచి ఉన్నవారికి ఈ వ్యాసాలు నచ్చుతాయనుకుంటాను. పైకి చూస్తే, ఎంతో క్లిష్టంగానూ, వింతగానూ తోచవచ్చు. కాని వాటిని శ్రద్ధగా, ధ్యానంతో చదవాలిగాని, ఆషామాషీగా చదవకూడదు. వీటిని మళ్లీ మళ్లీ చదివి వాటి గురించి తీవ్రంగా అదే పనిగా ఆలోచించు.

నీ పుట్టిన రోజు వస్తోంది కదా, నేను పంపుతున్న ఈ వ్యాసాల్ని నీ పుట్టిన రోజు కానుక అనుకో. బ్రహ్మాండంగా లేదూ! అమ్మాయీ, జీవితం గురించి ప్రధానమైన, గంభీరమైన ఇటువంటి విషయాల గురించి నువ్వు ఆసక్తి పెంపొందించుకోవాలని నా అభిలాష. జిడ్డు కృష్ణమూర్తిగారు మహా ప్రవక్త. ఈనాడు మానవాళికి అత్యవసరమైన ఒక నవ్య మనస్సు ప్రావిర్భావానికి ఆయన కృషి చేస్తున్నారు. నా ప్రయత్నమల్లా ఆయన్ని అర్థం చేసుకోవాలనీ, నాకు అర్థమైనదాన్ని తోటి మానవులు కొందరితోనైనా పంచుకోవాలనీను..."

నాన్నగారు నా పుట్టినరోజుకి పంపిన అమూల్యమైన ఆ కానుకని సంతోషంగా స్వీకరించానని రాసి, ఢిల్లీలో నీటి ఎద్దడి గురించి రాశాను. నిత్య జీవితంలో ఎదుర్కొనే ఈతి బాధల గురించి గుర్తు చేస్తున్నట్లు.

హైదరాబాదులో పరిస్థితి కూడా అలాగే ఉందని రాశారు. అన్నయ్య ఆస్ట్రేలియా నుంచి తిరిగి వచ్చాడో లేదో తెలియలేదనీ, ఢిల్లీలో హాస్టల్స్‌లో ఉండి చదువుతున్న అన్నయ్య కొడుకు, కూతురూ తనకు ఎప్పుడూ ఉత్తరాలు రాయరనీ, "అక్కడి సంగతులన్నీ తక్షణం నువ్వైనా రాయవలసిందని కోరుకున్నాను" అనీ రాశారు నాన్నగారు.

హైదరాబాదులో రాజకీయాల గురించి కూడా రాశారు : "ఆంధ్రా, తెలంగాణా ప్రాంతాల్లో బస్సులు, రైళ్లూ ఆపివెయ్యడం, రిలే నిరాహార దీక్షలూ, స్ట్రైకులూ, బంద్‌లూ అన్నీ ముమ్మరంగా సాగుతున్నాయి. ఫలితాలు ఎలా ఉన్నా, ఆంధ్రా, తెలంగాణాలు వేరు వేరు కావాలనే ప్రజాభిప్రాయంలా తోస్తోంది. ఆంధ్రా వాళ్లలో జుగుప్స, నిస్పృహ పేరుకుపోయాయి..."

ఢిల్లీలో మా ఇద్దరికీ ఫ్లూజ్వరం వచ్చి కోలుకుంటున్నామని అన్నయ్య

ఉత్తరం ద్వారా తెలిసిందిట. మా ఆరోగ్యం గురించి తెలియజేయమంటూ, ఆంధ్రా తెలంగాణా పరిస్థితి గురించి మళ్లీ రాశారు.

"...మీరు వింటూనే ఉండి ఉంటారు. ఇక్కడ ఎంత ఆస్తినష్టం, ఎంత జననష్టం సంభవిస్తోందో. రైళ్లను ధ్వంసం చేస్తున్నారు! ముల్కీ రూల్సు గురించి ఈ ఉద్యమం అంతా! ఏం విపరీత ఉన్మాదం! ప్రజాస్వామ్యంట! ఇదేనా సత్యం, అహింసలకు నిలయమనుకునే గాంధీగారి దేశం! ఎంత అద్భుతమైన మలుపు! ఈ దేశానికీ, ఈ ప్రపంచానికీ ఎటువంటి భవిష్యత్తు ఉంటుందో ఊహించ లేకపోతున్నాను. ఎటువంటి అభిప్రాయాన్నీ వెలిబుచ్చలేనంతగా నా మనస్సు విభ్రాంతి చెందుతోంది... మూడు రోజుల నుంచి మబ్బు పట్టినట్లుగా ఉంది. ఇవ్వాళే కాస్త ఎండ వచ్చింది. శీతాకాలం ప్రారంభమైంది. వయస్సులో ఉన్నవాళ్లకన్న వయస్సు మళ్లిన వాళ్లకి చలి ఎక్కువనిపిస్తుంది కదా...."

నాకు ఉద్యోగంలో ప్రమోషన్ వచ్చింది. నాకు లభించిన ఉన్నత పదవి గురించి నాన్నగారికి తెలియజేశాను. నాన్నగారు వెంటనే నాకు హృదయపూర్వక అభినందనలు తెల్పుతూ, "... ఉద్యోగంలో అంత ఉన్నత పదవి నీకు లభించడం గర్వకారణమే. నీ చిన్నతనంలో గాని, ఎం.ఎ. పాసైన తరవాత గానీ ఎప్పుడైనా, ఎవరమైనా, కలలోనైనా అనుకున్నామా నువ్వు ఉద్యోగం చేస్తావనీ, ఉన్నత స్థానానికి చేరుకుంటావని? నీ జాతకం మంచిదని నాకు తెలుసుననుకో. నీ భర్త నిన్ను చూసి గర్వపడుతున్నాడనుకుంటాను. నీకు సంతానం కలగనందుకు మాత్రం మేము కొంత నిరాశ చెందిన మాట వాస్తవం. మనం ఏంచెయ్యగలం?. అని రాశారు.

నాన్నగారి కుడికంటిలో కేటరాక్ట్ బాగా ముదిరిపోయి, కన్ను నిరుపయోగ మయిందనీ, ఒక్క ఎడమ కన్నుతోనే తంటాలు పడుతున్నట్లూ రాశారు. ఆంధ్రా-తెలంగాణా పరిస్థితి ఇంకా విషమిస్తోందని రాశారు : "... ఆంధ్ర దేశమంతా భీకరంగా, అల్లకల్లోలంగా ఉంది. జనాన్ని తండోప తండాలుగా ఎరెస్టు చేస్తున్నారు. జైళ్లలో పడేస్తున్నారు. జననష్టం, ప్రభుత్వ, ప్రజా సంబంధితమైన ఆస్తులు నాశనమవుతున్నాయి. స్ట్రైకులూ, బంద్‌లూ - ఎన్నో వారాల నుండి విద్యుచ్ఛక్తి సరఫరా లేదు. పాలూ, నీళ్లూ లేవు. ప్రయాణాలు అత్యంత ప్రమాదకరంగా పరిణమించాయి. ప్రభుత్వ యంత్రాంగం పనిచెయ్యడం లేదు. ఆంధ్రా, తెలంగాణా, కేంద్ర, రాష్ట్ర నాయకులంతా బెదిరింపు ధోరణుల్లో

ఉన్నారు. ప్రధానమంత్రి, రాష్ట్ర ముఖ్యమంత్రి కూడా తాము పట్టిన పట్టు విడవటం లేదు. పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా దుర్భరంగా ఉన్నాయి. 1973 సంవత్సరం ఆంధ్రులకు ఎంతో దురదృష్టకరంగా, విషాదమయంగా ఉండేట్లు కనిపిస్తోంది..." అంటూ వాపోయారు నాన్నగారు.

అంతకు ముందు పురుషాంగానికి కేన్సర్ వచ్చి, ఆపరేషనయి, కోలుకుంటున్న నాన్నగారి మేనకోడలి భర్తకి ఆరోగ్యం మళ్లీ విషమించిందిట. "పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. కోమాలో ఉన్నారు. చూపు లేదు. మాట లేదు. ఆహారం లేదు. బ్రెయిన్ కేన్సరో, సెరిబ్రల్ థ్రోంబాసిస్సో తెలియదు. వారం రోజులైంది. మళ్లీ కబురు రాలేదు. కోలుకుంటారన్న ఆశలేదు. ఆ వ్యాధి అంత ప్రమాదకరమైనది. నా మేనకోడల్ని తలుచుకుంటే జాలేస్తుంది. ఏ క్షణాన మరణ వార్త వింటామో, వెళ్లవలసి రావచ్చు. చాలా ఆందోళనగా ఉంది. ప్రయాణాల రాకపోకల సందిగ్ధ పరిస్థితి..." అని రాశారు.

నాన్నగారు అనుకున్నట్లుగానే, రోగి మరణ వార్త అందింది. తణుకు వెళ్లి పరామర్శ చేసి రెండు రోజులుండి, బయలుదేరి తిరిగి వచ్చారుట హైదరాబాదుకి. తిరుగు ప్రయాణం ఎలా జరిగిందో, అక్కడ ఏమేం జరిగిందో అన్నీ వివరంగా రాశారు.

"... రైలు 5 గంటలు లేటు. మధ్య మధ్య తాడేపల్లి గూడెంలో గంటసేపూ, విజయవాడలో 4 గంటలసేపూ ఆపేశారు. నిన్న కనక మేము తిరిగి వచ్చి ఉండకపోతే, తిరిగి రావడానికి కొన్ని వారాలు పట్టునేమో. అక్కడ పరిస్థితి తీవ్రంగానూ, ప్రమాదకరంగానూ ఉంది. కాల్పులు, కర్ఫ్యూలు - బస్సులూ, స్టేషన్లూ, రైలుపెట్టెలూ, ఆఫీసులూ, అన్నీ ధ్వంసం చేస్తున్నారు. చాలా విషాదకరం. కానీ, మనం ఏంచెయ్యగలం...?

అక్కడ తణుకులో వేళతప్పిన భోజనాలు, మధ్యాహ్నం 3 గంటలకి, రెండు గంటలకి - రెండున్నర గంటలకి ఎప్పుడో అప్పుడు.. రాత్రిళ్లు నిద్రలేక పోవడం, దోమల వల్ల, సరియైన పడక సదుపాయం లేకనూ - ఈ చిక్కిన ముసలి దేహం పడుకోవడానికి రైళ్లలో ప్రయాణ సుఖం లేకనూ, ఇవన్నీ ఈ దేహం మీద వాటి ప్రభావాన్ని చూపించాయి. కోలుకుని మామూలుగా అవడానికి కొన్నాళ్లయినా పడుతుంది...

మీ అక్కయ్య ఇంకా తణుకులోనే ఉంది. ఆయనకి ఏమీ బాగా లేదని తెలిసి, ఒకసారి చూసి, ఒక రోజుండి వెళ్లిపోవాలనుకుని వచ్చిందిట. ఆ రోజే ఆయన పోయారుట. దాంతో, పన్నెండు రోజులూ అక్కడే ఉండి, ఆ దుఃఖ సమయంలో వాళ్లందరికీ ఎంతో సేవ చేస్తోంది. మన కుటుంబం తరఫున మీ అక్కయ్య అక్కడ ఉండి, ఆ కష్ట సమయంలో వాళ్లందరికీ సహాయపడుతూ సేవ చేస్తున్నందుకు మాకు సంతోషంగా ఉంది. బంధువులంతా మీ అక్కయ్యని మెచ్చుకున్నారు.

మీ అక్కయ్య చాలా ఉత్తమురాలు. విశాల హృదయం కలది. దయా ధర్మ గుణాలు మూర్తీభవించిన స్త్రీ. మీ అక్కయ్యకి కేవలం అదృష్టం కలిసిరాక, ఆర్థిక స్తోమత లేక, దాని వ్యక్తిత్వం పరిపూర్ణంగా వికసించలేక పోయింది. దాని వ్యక్తిత్వం బంధీకృతమై, వెలుగులేక వసివాడిపోయింది. దాని ఆత్మాభిమానం ప్రగాఢమైన విఘాతానికి గురైంది. నీతోనూ, నీ చెల్లెలితోనూ పోలిస్తే తన ఆర్థిక పరిస్థితి అంత బాగాలేదని తెలిసినప్పటికీ, ఆ విషయమై ఎప్పుడూ తన మనసులోని మాటని బయట పెట్టదు. మౌనం వహిస్తుంది. నిమ్మకి నీరెత్తినట్టుగా, హుందాగా ఉంటుంది. కానీ, దాని కష్టాలూ, బాధలూ అన్నీ దాని ముఖం మీద స్పష్టంగా కనిపిస్తూనే ఉంటాయి. శారీరకంగా బాగా క్షీణించి పోయింది. దాన్ని చూసి నేనూ, మీ అమ్మగారూ చాలా బాధపడుతున్నాం. దాని నిర్లిప్తత చూసి మేము గిల గిల్లాడిపోతున్నాం. కానీ, దానికున్నంతలోనే అది ఎంతో ఔదార్యంతో అందరికీ సహాయపడుతుంది... దాని సంసారంలో ఎన్నో ఇబ్బందులు... గత మూడు సంవత్సరాల నుంచీ పంటలు పండలేదు. ఈ ఏడు కూడా పంట అంత బాగా రాలేదు. పైగా, స్ట్రైకుల వల్లనూ, కాలేజీలు మూసివేయడం వల్లనూ విద్యార్థులెవరూ ఇంట్లో గదులు అద్దెకు తీసుకోవడానికి రావడం లేదు... రెండో పిల్ల పెళ్లికి ఎదిగింది. సంబంధం కుదిరి సిద్ధంగా ఉంది. పెళ్లి చెయ్యాలి. మీ అక్కయ్య కూతురి పెళ్లి గురించి బెంగ పెట్టుకుంది... నా దురదృష్టం కొద్దీ నేనింకా బ్రతికే ఉన్నాను. తండ్రిగా, ఎంత ఆధ్యాత్మిక 'ధోరణి ఉన్నా, ఎంత వేదాంతం నేర్చినా, నేను దానికోసం బాధపడకుండా ఉండలేకపోతున్నాను. నాకేదైనా చెయ్యాలని ఉంది. నేను బ్రతికుండగా ఈ వివాహం జరిగేటట్లు చేస్తే, నేను సునాయాసంగా మరణించగలను. మనశ్శాంతితో మరణించగలను... ఇటువంటి విషయాల్లో స్త్రీకి ఆత్మాభిమానం, ఆత్మ గౌరవం ఎంత దెబ్బతింటాయో

నేనెరుగుదును. కానీ, నేనింకా బ్రతికే ఉన్నాను కాబట్టి నా కూతురి కోసం ఏదైనా చెయ్యాలని ఉంది... ఇలా రాయవలసి వస్తున్నందుకు నేను విపరీతంగా బాధపడుతున్నాను. నా కలం అడుగడుక్కీ, అక్షరం అక్షరానికీ తడబడుతోంది... నా మనస్సు విప్పి నీ ముందుంచాను... ఇక నేనేం రాయలేను...

ఇలా రాస్తున్నప్పుడు నాన్నగారి కంటి నుంచి నీటి చుక్కలు రాలి ఉత్తరం మీద పడ్డాయేమో, కొన్ని అక్షరాలు అలుక్కుపోయినట్లున్నాయి. పెన్నుతో బలవంతంగా నొక్కి రాయడానికి ప్రయత్నించడం వల్ల కాబోలు ఒకచోట చిన్న చిల్లు పడింది కూడా. అక్కయ్య సహనం, సేవా తత్పరతా నాకు తెలుసుననీ, తను మట్టిలోని మాణిక్యం లాంటిదనీ, తన పరిధిలోనే తను మదర్ థెరిస్సా వంటిదనీ రాశాను నాన్నగారికి. నాన్నగారు ఏంచెయ్యదలుచుకున్నా నేను చాతనయినంతవరకు తోడ్పడతానని హామీ ఇచ్చాను.

* * *

అన్నయ్యకి 'పద్మశ్రీ' బిరుదు ప్రదానం చేస్తున్నట్లుగా ఎప్పల ప్రకటితమైంది – రిపబ్లిక్ డే సందర్భంగా. మార్చి రెండవ వారంలో నాన్నగారు ఉత్తరం రాశారు. "... రాష్ట్రపతి భవన్‌లో మీ అన్నయ్యకి 'పద్మశ్రీ' బిరుదు ప్రదానం చేసే సభకి నువ్వు కూడా వెడుతున్నావనుకుంటాను.... నిన్నటి 'హిందూ'లో మధ్య పేజీలో ప్రముఖ స్థానంలో 'మన సైంటిస్టులు' అనే శీర్షికన 'విశ్వ విఖ్యాతిగాంచిన ఆయిల్ టెక్నాలజిస్ట్' అంటూ మీ అన్నయ్య గురించి రాసిన వ్యాసం నువ్వూ చదివే ఉంటావు... రాజమండ్రి వాళ్ళూ, ఆంధ్రా యూనివర్సిటీ వాళ్ళూ, సోదరిగా నువ్వూ వాడు సాధించిన ఘనతకి గర్వపడాలి. ." అని. అంతేకాని, నిజానికి తను లోలోపల ఉప్పొంగిపోతున్నట్లు మాత్రం బయటపడనివ్వరు! రాష్ట్రపతి భవన్‌కి వెళ్ళి కొడుక్కి రాష్ట్రపతి సత్కారం కళ్ళారా చూడాలనే కోరికని గుండె లోతుల్లో అణచిపెట్టేసుకుని, నన్ను మాత్రం వెళ్ళి చూడమన్నారు.

* * *

నాన్నగారి కంటి బాధ ఎక్కువయింది. "... పూర్తిగా కనిపించడం మానేసిన నా కుడికన్ను పదిహేను రోజుల నుంచీ దురద పెట్టడం, నీరు కారడం, కంట్లోనూ, కనుబొమలమీద, కణతమీద విపరీతంగా నొప్పి పెట్టడం మొదలైంది.

డాక్టరుకి మూడు రోజుల క్రితం చూపించాను. 'హైటెన్షన్' ఏర్పడటం వల్ల అలా బాధ కలుగుతోందన్నాడు. నిద్ర పోతున్నప్పుడూ, కదలకుండా విశ్రాంతి తీసుకున్నప్పుడూ నొప్పి ఉండటం లేదు. కదిలితే బాధ భరించడం కష్టంగా ఉంటోంది. డాక్టరు రెండు రకాల మాత్రలూ, రెండు రకాల కంటిమందులూ ఇచ్చాడు. మళ్ళీ రేపు రమ్మన్నాడు. అదికాక, ఈ బాధ మందులికి పూర్తిగా తగ్గదనీ, ఆపరేషను చెయ్యవలసి ఉంటుందనీ, హడలగొట్టాడు. 5 రోజులు ఆసుపత్రిలో ఉండాలిట. నాకు కుదరదు. నన్ను ఆసుపత్రిలో ఉంచితే నాకు సాయం చెయ్యడానికి ఎవరూ లేరనీ, 5 రోజులపాటు ఆసుపత్రిలో ఉండి, గుడ్డి కన్నుకి ఆపరేషను చేయించుకోవడం నాకిష్టం లేదనీ చెప్పేశాను. దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. దేవుడనే వాడు ఉండి, ప్రార్థనలను విని కనికరించగలిగే మాటయితే, ఆ దేవుణ్ణి ఈ 79 సంవత్సరాల ముసలి దేహాన్ని ఈ బాధల నుంచి విముక్తి కలిగించమని ప్రార్థిస్తున్నాను... కానీ, నా ఆదుర్దా ఒక్క విషయంలోనే – మీ అక్కయ్య రెండవ కూతురి పెళ్లి విషయం...." అని రాశారు.

నేను హైదరాబాదు వెళ్లాలా... ఎలా వెళ్లాలి... అన్నయ్య వెళ్లకూడదా. మనసులోనూ, ఇంట్లోనూ తర్జన భర్జనలు .. మొత్తం మీద, సానుభూతి చూపిస్తూ ఉత్తరం రాశాను. అవసరమైతే నేను రావడానికి ప్రయత్నిస్తాననీ, ఆపరేషను చేయించుకోవడం మానుకోవద్దనీ రాశాను. రాశాను గాని, వెళ్లగలనన్న ధైర్యం లేదు. ఈలోగా, మా చెల్లెలి అత్తగారు పక్షవాతం వచ్చి పోయారుట. అమ్మ, నాన్నగారూ అక్కడికి వెళ్లి, తిరిగి హైదరాబాదు వచ్చాక ఉత్తరం రాశారు నాన్నగారు.

"... సామర్లకోట వెళ్లి ఇవ్వాళ ఉదయమే 5.25కి తిరిగి వచ్చాం. అక్కడ అన్నీ యధావిధిగా జరిగిపోయాయి. మీ అక్కయ్య కూడా వచ్చిందక్కడికి. అన్ని పనుల్లో మీ చెల్లెలికి సహాయం చేసింది.....

ఇక నా కంటి గురించి – (1) కుడి కన్ను పూర్తిగా గుడ్డిదైపోయింది. దాని కోసం ఇక ఏ వైద్యం చేసినా ప్రయోజనం లేదు. చూపు రాదు. (2) సామర్లకోటలో డాక్టరు చూసి, నా కంటికి గ్లకోమా వచ్చిందని అన్నాడు. (3) ఇక చెయ్యగలిగిందీ, చెయ్యవలసిందీ (అ) ఎడమ కన్ను చూపు పోకుండా జాగ్రత్త పడటం, (ఆ) రెండు రకాల మాత్రలూ, రెండు రకాల కంటిమందులూ గత రెండు వారాలుగా వాడుతూంటే బాధ కొంచెం తగ్గినట్లు సూచన ఉండటం వల్ల, ఆ మందుల్ని ఇంకా

కొన్నాళ్లు పుచ్చుకుంటూ బుద్ధిగా మసులుకుంటూ, శ్రమ పడకుండా, సూర్యరశ్మి కంటికి తగలకుండా చూసుకోవాలి. ఆపరేషన్ వల్ల ఫలితం ఏమీ ఉండదు. ఢిల్లీ వెళ్లినా, డెహ్రాడూన్ వెళ్లినా ప్రయోజనం ఉండదు. నేనిక్కడే ఉంటాను. నా కర్మని సహనంతో సంతోషంగా అనుభవిస్తాను. నాకింకా నీరసంగా ఉంటోంది..."

అసలు సంగతి – తన ఆపరేషను కోసం ఎవరి చేతా ఖర్చు పెట్టించకూడదనీ, ఎవరి మీదా ఆధారపడకూడదనీ ఆయన మనసులో ఉంది. డాక్టరు విశ్రాంతి తీసుకోమంటాడు. చెప్పడం సులభమే. కానీ, ఎలా కుదురుతుంది – అమ్మకైనా, నాన్నగారికైనా? అమ్మకి ఇంట్లో చాకిరీ, నాన్నగారికి వీధిలో పనులూ, తోట పనులూ తప్పవు. పని మనిషిని అంట్లు తోమడానికీ, ఇల్లు తుడవడానికీ పెట్టుకోవడానికే గగనమై పోతోంది. ఇక వేరే నౌకర్లని ఎలా పెట్టుకోగలరు? చుట్టుపక్కల బంధువులున్నా, ఎవరి తాపత్రయాల్లో బాధల్లో వాళ్లుంటారు. పూర్వం అమ్మ, నాన్నగారూ అందరికీ చేసినట్లు ఇప్పటి వాళ్లకి చెయ్యడానికెలా కుదురుతుంది? ఆ ఓపికలూ లేవు. ఆ [illegible]మత, స్వార్థ రాహిత్యం లేవు.

అనుకోకుండా, కొడుక్కేదో సంబంధం చూడటం కోసం అక్క హైదరాబాదు వచ్చిందట. దాని అండ ఉందన్న ధైర్యంతో మొత్తం మీద ఆపరేషను చేయించుకున్నారు హాస్పిటల్లో ఉండి. కానీ, నాన్నగారు హాస్పిటల్ నుంచి ఇంటికొచ్చాక, డాక్టర్ సలహా పాటించకుండా, ఎండలో తిరగడం, తోటపని చెయ్యడం, మొదలైన పనులన్నీ చేసేవారుట. చెయ్యకపోతే, ఎవరు చేస్తారు? అని ఆయన ప్రశ్న. ఆపరేషన్ సరిగ్గా చెయ్యకపోవడం వల్లనో, ఆపరేషను తరువాత సరియైన విశ్రాంతి తీసుకోకపోవడం వల్లనోగాని, మొత్తం మీద కంటి ఆపరేషను అయింతరువాత, ఆ కంటికి అద్దం మార్చనే లేదు డాక్టరు. ఆ కుడికన్ను నిరుపయోగమయి పోయింది. ఇక రెండవ కంటితోనే కాలక్షేపం చేస్తున్నారు. మళ్లీ ఉత్తరాలు రాయడం మొదలుపెట్టారు.

నేనేదో కాగితం నింపడం కోసం మా అత్తవారి విషయాలు కూడా రాస్తూండేదాన్ని క్లుప్తంగా. మా అత్తగారికి ఒంట్లో బాగాలేదని విన్నాననో, ఆడబిడ్డ అస్వస్థతగా ఉన్నారని తెలిసిందనో రాస్తే చాలు, అయిదారు మైళ్లు నడిచి వెళ్లి వాళ్లని చూసొచ్చి వాళ్ల క్షేమ సమాచారాలు నాకు తెలియజేస్తూ ఉండేవారు. లేకపోతే, తనంతట తనే వెళ్లి వాళ్లని కలుసుకుని, అన్ని విశేషాలూ సేకరించి నాకు రాస్తూండేవారు.

"... ఇవ్వాళ పొద్దున్న మీ అత్తవారింటికి వెళ్లి అందరినీ చూసి వచ్చాను. మీ పెద్ద ఆడబిడ్డకి ఒంట్లో కొంచెం అస్వస్థతగా ఉంది - తిరుపతి ప్రయాణం చేసి రావడం వల్ల. మీ ఆఖరి మరిదికి సంబంధాలు చూస్తున్నారు... మీ చెల్లెలి భర్త గురించి ఒక శుభవార్త. అతని జీతం పెంచారుట. నెల నెలా జీతం కాక, ఇల్లు, నీళ్లు, కరంటూ ఊరికే ఇస్తారు. అదికాక, ఏడాదికి ప్రయాణపు ఖర్చులు, మందుల ఖర్చులు, కారుకి పెట్రోలు ఖర్చు, ఇవికాక బోనస్ వగైరాలు! ఈ ఏడు వచ్చిన బోనస్‌తో ఫ్రిజ్ కొన్నారుట. కారు కూడా కొనుక్కోవాలనుకుంటున్నారుట త్వరలోనే. మీ చెల్లెల్ని అభినందిస్తూ ఉత్తరం వ్రాస్తావనుకుంటాను... ఢిల్లీలో కర్ఫ్యూ విధించారుట కదా. మీరు క్షేమంగా ఉన్నారని తలుస్తాను" అని రాశారు.

నాన్నగారికి అందరి విషయాలూ వివరంగా కావాలి. క్రాస్ ఎగ్జామిన్ చేస్తున్నట్లు అడుగుతారు. ఊరు నుంచి వెళ్లగానే, నన్ను గుమ్మంలోనే కూర్చోబెట్టి (ఆయన ఎప్పుడూ డ్రాయింగ్ రూములో తలుపు దగ్గరే పేము కుర్చీ వేసుకుని కూర్చునేవారు. ఆ పక్కనే ఆయన మంచం ఉంటుంది. లోపలికెవరైనా వెళ్లాలంటే ఆయన కంటపడకుండా వెళ్లలేరు. ఎప్పుడైనా సినిమాకి గాని, షాపింగ్‌కి గాని వెళ్లాలంటే దొడ్డి గుమ్మంలోంచి చాటుగా వెళ్లేవాళ్లం. వెళ్లమా? అని అడిగితే లెక్చరిచ్చేవారుగాని, అడక్కుండా వెళ్లిపోతే ఏమీ అనేవారు కాదు. పైగా ఏం సినిమా, ఏం కథ అంటూ వివరాలడిగే వారు, వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తూండేవారు) లోపలికి వెళ్లనివ్వకుండా ఆపేసి, క్విజ్ ప్రోగ్రాంలోలాగ టకటకా ప్రశ్నలు గుప్పించేవారు. ఢిల్లీ వాతావరణం గురించి, ఆరోగ్యం గురించి, నా ఉద్యోగం, జీతం వివరాలు - బేసిక్ పే, టి.ఎ., డి.ఎ. పి.ఎఫ్., ఇన్‌కంటాక్స్ డిడక్షన్, హౌస్ రెంట్ ఎలవెన్స్, కరంటు, వాటర్ ఖర్చులు, ఇతర సేవింగ్స్, ఢిల్లీలో వస్తువుల ధరలు - మినపప్పు దగ్గర నుంచి ములక్కాడల దాకా మైపు కొట్టినట్లు టకటకా అడుగుతూంటే నేను గుండె దడ దడలాడుతూ సమాధానాలు చెప్పేదాన్ని. ఆయన దగ్గరకు వెళ్లేముందు ఐ.ఎ.ఎస్. ఇంటర్వ్యూకి వెడుతున్నట్లు ప్రిపేర్ అయ్యేదాన్ని.

ఓసారి, వెన్న ఖరీదెంత అక్కడ? అని అడిగారు. ఎందుకో ఆ ప్రశ్నకి ప్రిపేరవలేదు నేను. ధర మరిచిపోయాను. నోటి కొచ్చినట్లు 30 /- అన్నాను. "ఏమిటి? కిలోయే?" అన్నారు, నోరంతా తెరిచి - బాలకృష్ణుడు తల్లికి విశ్వ రూపాన్ని చూపిస్తున్నట్లు - ఆయన ఆశ్చర్యాన్నంతా కనపరుస్తూ. ఆయన

అంత తెల్లబోయేసరికి నా మనసులో సందేహం సముద్ర తరంగంలా పొంగింది. నేను ఏదో అందామని ప్రయత్నించేలోపునే ఆయన "ఇది విన్నారా?" అంటూ ఓ పొలికేక పెట్టారు వంటింట్లో ఉన్న అమ్మని ఉద్దేశించి. అమ్మ పరుగెత్తుకుంటూ వచ్చింది కంగారు పడుతూ. నాకేసి, నాన్నగారికేసీ భయం భయంగా చూసింది సంగతి అర్థంకాక. "ఢిల్లీలో వెన్న కిలో 30 /- రూపాయల్ట!" అన్నారు. 30 ఒత్తి పలుకుతూ. అమ్మ బుగ్గలు నొక్కుకోలేదు. "అవును మరీ, ఇక్కడే పదహారు రూపాయలన్నారుగా! మరి, ఢిల్లీలో ఆమాత్రం ఉండదూ!" అంది అతి తేలిగ్గా. నేను అమ్మయ్య అని మనసులోనే నిట్టూర్చాను. ఒకవేళ అసలు ధర ఏ 22 రూపాయలో అయినప్పటికీ నేను తిరిగి వెళ్లేసరికి ఆమాత్రం పెరక్కుండా ఉంటుందా అని నాకు నేను నచ్చజెప్పుకుని మళ్లీ నాన్నగారి ముఖంలోకి 'నెక్ట్స్ క్వెశ్చన్?' అన్నట్లు చూశాను. "సరే, లోపలికి వెళ్లి కాళ్లు కడుక్కో" అని పంపించేశారు. నాన్నగారింకా ఆ విభ్రాంతి నుంచి తేరుకోలేదనుకుంటాను.

భోజనం చేస్తూ అన్నారు. "అనవరసరంగా బోలెడు ఖర్చుపెట్టి బోలెడు డ్రైఫ్రూట్స్ పట్టుకొస్తూ ఉంటావు. ఎవరైనా వస్తూంటే పంపిస్తూ ఉంటావు. అంత ఖరీదైన వాటిని తీసుకోవడానికి నాకు మొహమాటంగా ఉంటుంది. నాకోసం ఏదైనా పంపించాలనీ, పట్టుకు రావాలనీ పట్టుదలగా ఉంటే అంజూర తప్ప ఇంకేమీ కొనకు" అన్నారు. నేను "అలాగే" అని ఊరుకున్నాను. వాదించడం ఆయనకి నచ్చదు. చిన్నప్పుడు నాన్నగారు అంజూరపళ్లు (ఎండువి) కొని, తన గదిలో పెద్ద సీసాలో పెట్టుకుని అప్పుడప్పుడు మాకు పెట్టి, తనూ తింటూండేవారు. ఆయన గదిలో లేనప్పుడు అప్పుడప్పుడూ నా అంతట నేను ఒకటో రెండో తీసుకుని చడీ చప్పుడు కాకుండా తినేదాన్ని. అవంటే నాకు చాలా ఇష్టం. అడగాలంటే మొహమాటం, భయం. అలా చాటుగా తిన్నానన్న బాధతో, నేను సంపాదన మొదలుపెట్టాక నాన్నగారి కోసం ఎప్పుడూ అంజూరపళ్లు కొని పంపించేదాన్ని. వెళ్లేటప్పుడు పట్టుకెళ్లేదాన్ని. అది నాలోని రహస్యం.

* * *

ఢిల్లీలో వెన్న ధర నాన్నగారి మనస్సులో ఇరుక్కుపోయినట్లుంది. నేను వెళ్లాక ఓ ఉత్తరం రాశారు.

"... ఢిల్లీలో ముఖ్యావసర వస్తువుల ధరలు ఒక్కసారిగా తెగ పెరిగి

పోయాయని 'హిందూ'లో ఢిల్లీ విలేఖరి రాశాడు. ఇక్కడ కూడా ఈ మధ్య ధరలు విపరీతంగా-పెరిగి పోయాయి. పేపర్లలో చదువుతూ ఉండే ఉంటావు. ఉద్యమాలూ, ఊరేగింపులూ, దోపిడీలూ, దుకాణాల్లో వస్తువులు దాచిపెట్టి ధరలు పెంచి అమ్మడాలూ, రాష్ట్రమంతా అల్లకల్లోలంగా ఉంది. రాబోయే రెండు నెలల్లో పరిస్థితులు ఇంతకన్న విషమించవచ్చునంటున్నారు. అందరం ఈ పరిస్థితుల్లో నిస్సహాయంగా ఇరుక్కుపోయాం. మధ్య తరగతి వాళ్లంతా అంతకంతకి పెరిగిపోతున్న ధరల బరువు కిందపడి నలిగిపోతూ బాధపడుతున్నారు..." అని గిలగిల్లాడారు.

తరవాత కొన్నాళ్లకి, అక్కయ్య కొడుక్కి సంబంధం నిశ్చయమైందని తెలియజేశారు. "... పిల్ల ఏదో బ్యాంకు పరీక్ష పాసైందిట. పిల్ల తండ్రికి ఇంకా మూడేళ్ల సర్వీసుంది. మంచి గౌరవ ప్రదమైన కుటుంబం. అడక్కుండానే నాలుగు వేల కట్నం ఇస్తామన్నారుట. వీళ్లు అదనంగా ఇంకేమీ అడగలేదుట. అదో సుగుణం. ఈ రోజుల్లో కట్నం తీసుకోకుండా ఏ తండ్రీ కొడుకుల పెళ్లిళ్లు చెయ్యడం లేదు. అంతా నాలాగ, మీ మామగారిలాగ ఉండరుకదా..." అని రాశారు.

పెళ్లి ముహూర్తం కూడా నిశ్చయమైంది. ఇంక నెల రోజులు కూడా లేదు. ఓ వారం పది రోజుల్లో శుభలేఖలు పంపుతారని తెలియజేస్తూ, "దూరాలూ భారాలూ అయిన ఈ మహాపట్నంలో ఏ చిన్న పని చెయ్యాలన్నా కష్టమే. వీధిలో గాడిద చాకిరీ చెయ్యడం ఈ 80 ఏళ్ల ముసలివాడి వంతు, ఇంట్లో రోజల్లా వచ్చేపోయే అతిథులకూ, బంధువులకూ వండి పడ్డించడం 70 ఏళ్ల మీ అమ్మగారి వంతు. ఎన్నో నెలల నుంచీ ఆవిడ విశ్రాంతి తీసుకోవలసిన అవసరం ఉన్నా బొత్తిగా కుదరడం లేదు...

పెళ్లికి ప్రతి బంధువూ రావాలని అందరికీ ఉంటుంది. కానీ, నన్ను అపార్థం చేసుకోకు. కనీసం నువ్వైనా నన్ను సరిగ్గా అర్థం చేసుకోగలవనుకుంటాను. ఈ మధ్య కొన్నేళ్ల నుంచీ నేను పిసినారినై పోతున్నాను. ఖర్చులంటే భయం పట్టుకుంది. ముఖ్యంగా ప్రయాణం ఖర్చులు. పెళ్లికి వస్తే నిన్ను చూడాలని నాకూ ఉంది. కానీ, నీకయ్యే ఖర్చు తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. రెండు మూడు వందలదాకా టిక్కెట్టుకే అవుతుంది రానూ పోనూ. అదికాక, పెళ్లికి రావడానికీ వెళ్లడానికీ నాలుగు రోజులు, పెళ్లికి కనీసం ఒకరోజైనా ఉండాలి కదా

– నీకు బోలెడు ఆఫీసు పని వుంటుంది. ఈ ఒక్కరోజు పెళ్లికోసం వారం రోజులు సెలవు పెట్టాలి నువ్వు...

ఈ గడ్డు రోజుల్లో, అన్నిటిధరలూ ఆకాశాన్ని అంటుతున్న సమయంలో, ఎంతో అత్యవసరమనిపిస్తే తప్ప ఇటువంటి దూర ప్రయాణాలు పెట్టుకునే ముందు దూరం ఆలోచించాలి. నా అభిప్రాయం తప్పు కావచ్చు. ఇటువంటి విషయాల్లో నువ్వూ, మీ ఆయనా ఎలా ఆలోచిస్తారో నాకు తెలియదు. ఏది ఉత్తమమో మీరే నిర్ణయించుకోండి. నామీద ఎటువంటి నిందా వెయ్యకండి...

అన్నట్లు, మీ అమ్మగారి పాదం మీద బరువైన కుర్చీ పీట పడింది వారం రోజుల క్రితం. పాదానికి గట్టి దెబ్బే తగిలింది. ఇప్పుడు నొప్పి కొంచెం తగ్గింది. వాపు పూర్తిగా తగ్గలేదు. పాపం, అలాగే చాకిరీ చేస్తున్నారు. తప్పదు కదా! పెళ్లికి కావలసిన గోంగూర పచ్చడి, అప్పడాలూ, వడియాలూ, పప్పులూ, వగైరా అన్నీ తయారు చేస్తున్నారు... పెళ్లి కూతురి తండ్రి కట్నం డబ్బు ముందుగానే ఇచ్చేశాడు. మంచివాడు పాపం" అని రాశారు నాన్నగారు పెళ్లి విశేషాలన్నీ.

పెళ్లికి నేను హైదరాబాదు వెళ్లలేదు. పెళ్లి బాగా జరిగిందనీ, అన్నయ్య తరఫున నాన్నగారు పెళ్లి కొడుక్కి ఉషా ఫేన్‌నీ, నా తరఫున ఒక చిన్న స్టీల్ అలమారానీ బహూకరించినట్లూ, అందరూ వాటిని మెచ్చుకున్నట్లూ రాశారు. మా చెల్లెలూ, భర్తా పెళ్లికి హాజరయారుట. "మీ అమ్మగారూ, నేనూ చాలా అలిసిపోయాం" అని రాశారు.

మా ఆఖరి మరిదికి సంబంధాలు చూస్తున్నారనీ, ఇంకా ఏదీ నిశ్చయించలేదనీ రాశారు. "పిల్ల నచ్చడం పెద్ద క్లిష్ట సమస్య అయిపోయింది. అందం, చదువు, ఉద్యోగం, వయస్సు, శాఖ, కుటుంబ గౌరవం, వినయం, వగైరా వగైరా!!! పిల్ల ఉద్యోగం చేస్తున్నదైతే ఉద్యోగం మానుకుని భర్త ఉన్న ఊరికి వెళ్లగలదా? ఉద్యోగం మానేస్తే ఎలాగ? ఈ లెక్కన అన్ని విధాలా నచ్చిన పిల్ల దొరకడానికి ఎంత సమయం పడుతుందో మరి! ఈ రోజుల్లో ఎదిగిన యువకులకు పిల్లని చూడటం చాలా కష్టమైపోతోంది..." అంటూ బాధపడ్డారు, తనకున్న బాధలకి తోడు.

చలికాలం వచ్చేసరికి బాధలెక్కువవుతాయి వృద్ధాప్యంలో. "... చలి విపరీతంగా, దుర్భరంగా ఉందిక్కడ. ఈ వయస్సులో ఈ చలి భరించడం

మాకిద్దరికీ కష్టంగానే ఉంది... మీ అన్నయ్య ఎప్పుడూ హడావిడిగా పనుల మీద దేశాలు తిరుగుతూ ఉంటాడు. మమ్మల్ని చూడటానికి తీరికే చిక్కడం లేదు. ఫిబ్రవరిలో ఆఫ్రికా వెడతాడుట. లిబియాలో ట్రిపోలిన్‌లో యు.ఎన్.ఓ. ఎనర్జీ రిసోర్సెన్ మీద ఏదో కాన్ఫరెన్సు ఉందిట – పది రోజుల పాటు. మద్రాసు మీదుగా వెడతాడుటగాని, ఇటు రావడానికి వీలుండదని రాశాడు... ఇక్కడ దోమల బాధ విపరీతంగా, దుస్సహంగా ఉంది... ఈ మధ్య కోతుల బాధ కూడా ఎక్కువైంది... అంటూ పాపం, తన బాధలన్నీ రాయడం కాక, మా అత్తవారింటికి వెళ్ళి, వాళ్ళని చూసి, "మీ మామగారికున్న బాధలు (1) చూపు సరిగ్గా లేదు, (2) సరిగ్గా రాయలేకపోతున్నారు (చెయ్యి వణుకుతున్న మూలాన్ని) – ఎందరికో బోలెడు ఉత్తరాలు రాయవలసి ఉందిట. రాయలేకపోతున్నారు. (3) దగ్గు, అజీర్ణవ్యాధి, నరాల బాధ – మొత్తం మీద బాగానే ఉన్నారు. కంగారు పడక్కర్లే" దని రిపోర్టు రాశారు.

* * *

మెడికల్ బోర్డ్ వాళ్ళు నాకు హైపర్ టెన్షన్ ఉందని రిపోర్టు రాశారు. దాంతో, నా ప్రమోషన్ టెంపరరీగా నిలిచిపోయింది. ఆరోగ్యం బావుందని మూడునెల్ల తరువాత సర్టిఫికెట్ ఇస్తేగాని, కన్‌ఫర్మ్ చెయ్యరు. ఈ విషయం నాన్నగారికి రాశాను. చాలా బాధపడ్డారు. "ఈ రోజుల్లో ఢిల్లీ వంటి మహానగరాల్లో ఒక్క గేదెలకీ, ఆవులికీ మాత్రమే హైపర్ టెన్షన్ లేకుండా ఉంటుంది!" అని మావారు వ్యాఖ్యానించారు! ఏమైనా, ట్రీట్‌మెంట్ తీసుకోక తప్పలేదు – వ్యాధి లక్షణాలు నాకు లేవనిపించినా. మూడు నెలలు అయాక మెడికల్ బోర్డ్ నేను ఆరోగ్యంగా ఉన్నానని సర్టిఫికేట్ ఇచ్చిన తరువాత నా ప్రస్తుత పదవిలో నిలదొక్కుకున్నాను. ఆ విషయం వెంటనే నాన్నగారికి రాశాను.

"... నీ ఉత్తరం ఇప్పుడే అందింది. చూశాక చాలా సంతోషం కలిగింది.... (1) నీ ప్రస్తుత ఉద్యోగ స్థానంలో కన్‌ఫర్‌మేషన్ పొందినందుకు అభినందనలు. నీ ఆరోగ్యానికి ఇప్పుడు ఏ విధమైన లోపం లేదనుకుంటాను. నీ ఆరోగ్యం విషయమై శ్రద్ధ వహించు.

(2) మీ అమ్మగారు వారం రోజుల క్రితం మీ చెల్లెలి దగ్గరికి వెళ్లారు – మీ చెల్లెలి అత్తగారి సంవత్సరికాలకని చెప్పి. ఇంకో పది రోజులు పోతేగాని తిరిగి

రారు. అంతా ఆవిడ ఇష్టం. ప్రస్తుతం నేనే వండుకు తింటున్నాను. నేను తోటలో రోజూ నీళ్లు పోసి నా పిల్లల్ని సంరక్షించుకోవాలి. నా మొక్కల్ని విడిచి నేను వెళ్లలేను.

(3) మీ అక్కయ్య కొడుకూ, కోడలూ కులాసాగానే ఉన్నారు. ఆ అమ్మాయి బ్యాంకులో పని చేస్తోంది.

(4) రెండవ కొడుకు ఎటుపడితే అటు ఎగిరే గాలిపటం లాంటివాడు. తెడ్డూ, ఒడ్డూ లేని నావ వంటివాడు.

(5) మీ అక్కయ్య రెండవ కూతురి వివాహం ఎక్కడ చేస్తారో తెలియదు. చిన్న తిరుపతిలో కావచ్చును. హైదరాబాదులో మాత్రం కాదు. నేను మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ హైదరాబాదు విడిచి వెళ్లగలిగేది లేదు. నేను ప్రయాణాలు చెయ్యలేను. ఇంకెక్కడికీ వెళ్లలేను..." అని రాశారు నాన్నగారు.

* * *

అన్నయ్యకి ధన్‌బాద్‌లో ఉద్యోగం అయింది. అది ప్రధానమంత్రి నియమించిన పదవి. ధన్‌బాద్‌లో అన్నయ్య పనిచెయ్యవలసిన సంస్థలో పరిస్థితి అల్లకల్లోలంగా ఉంది. దాన్ని అదుపు చెయ్యడానికే అన్నయ్యని ప్రత్యేకం నియమించడం జరిగింది. చల్లని అందమైన తోటలోంచి తీసికెళ్లి కీకారణ్యంలో పడవేసినట్లయింది. డెహ్రాడూన్ వాతావరణానికీ ధన్‌బాద్ వాతావరణానికీ అంత తేడా ఉంటుంది. ధన్‌బాద్‌లో ఎండలు విపరీతం. పనివాళ్లు దొరకరు. దొరికినా సరిగా పనిచెయ్యరు. గూండాయిజమ్ రాజ్యమేలుతున్న ఊరు. వెనుకపడిన ప్రదేశం. అన్నయ్య పిల్లలకి కూడా తోచేది కాదు ఆ ఊళ్లో. అన్నయ్య చీటికీ మాటికీ విదేశాలకు వెళ్లవలసి వచ్చేది. ఒకసారి ఫ్రాన్స్, ఒకసారి జపాన్, ఒకసారి జర్మనీ. ఈసారి రష్యా వెళ్లాడు. అనుకోకుండా అర్జంటుగా వెళ్లవలసి వచ్చిందనీ, మళ్లీ రష్యా నుంచి రాస్తాననీ రాశాడుట నాన్నగారికి. వాడి దగ్గరనుంచి ఉత్తరం రాలేదని కంగారు పడుతూ, నాన్నగారు నాకు రాశారు ఏ సంగతీ కనుక్కోమని.

నేను ఎం.ఫిల్ చేస్తున్నానీ, ఈ మధ్య తీరిక బొత్తిగా ఉండటం లేదనీ, అన్నయ్య కూతురు ఢిల్లీలోనే న్యూట్రిషన్‌లో డిప్లొమా చేస్తోందనీ రాశాను. అన్నయ్య రష్యానుంచి వచ్చేశాడనీ, మావారు కూడా రష్యా వెళ్లబోతున్నారనీ

(ఇతర జర్నలిస్టులతో కలిసి రష్యన్ ప్రభుత్వ ఆహ్వానం మీద) పదిహేను రోజులపాటు అక్కడ పర్యటించి వస్తారనీ రాశాను. నాన్నగారు వెంటనే నేను రాసిన విశేషాలపై వ్యాఖ్యానిస్తూ ఉత్తరం రాశారు.

"…. (1) ఇప్పుడు నువ్వు ఎం.ఫిల్. చెయ్యడం ఏమిటో? మాస్టర్ ఆఫ్ ఫిలాసఫీయా? 41 సంవత్సరాల వయస్సులో ఎందుకీ మాస్టర్స్ డిగ్రీ కోర్స్ చెయ్యడం? అది డాక్టరేట్ డిగ్రీ కాదనుకుంటాను. నీకున్న ఇంటి బాధ్యతలు, ఆఫీసు బాధ్యతలతోబాటు ఎందుకీ అదనపు భారం? ఎందుకీ అవస్థ? నాకేమీ బోధపడటం లేదు. నీ ఉద్యోగంలో అది నీకు ఏవిధంగా ఉపయోగపడుతుంది? నా అజ్ఞానాన్ని తొలగించు!

(2) కూతురి వివాహం గురించి మీ అన్నయ్య ఆలోచించడం లేదా? ఇప్పుడీ డిప్లొమాలో చేరడంలో ఉద్దేశం ఏమిటి? వివాహం చెయ్యదలుచుకుంటే మళ్లీ ఢిల్లీలో ఉంచి చదువు చెప్పించడం దేనికి? పెళ్లి సంబంధం కుదిరేవరకూ చదువు కొనసాగుతుందిలే అనుకోకూడదు. ఇదీ నా ఉద్దేశం. నీ ఉద్దేశం, నీ మేనకోడలి ఉద్దేశం ఏమిటి?

(3) మీ అన్నయ్య తరుచు విదేశాలకు వెడుతూ ఉండటం - అధమం నెలకోసారైనా వెడుతూండటం చూస్తూంటే నాకు చాలా ఆందోళన కలుగుతూ ఉంటుంది. ధన్‌బాద్ వంటి దూరప్రదేశంలో మీ వదిన నిత్యం ఒంటరిగా ఉండవలసి రావడం తలుచుకుంటే నాకు చాలా ఆందోళన కలుగుతోంది. కానీ, మేమేం చెయ్యగలం? ఇప్పుడు మేమిద్దరం వెళ్లి ధన్‌బాద్‌లో ఉండలేము కదా. ఈ వయస్సులో నేను ప్రయాణాలు చెయ్యలేను. ధన్‌బాద్‌లాంటి ప్రదేశంలో ఉండనూ లేను.

(4) ఈ శరీరానికి 80 సంవత్సరాలు ఈ రోజుతో పూర్తవుతాయి. 81వ సంవత్సరంలో ప్రవేశించింది. ఎందుకోసమో నాకైతే తెలియదు. ఇవాళ కారప్పొడి, అల్లం పచ్చడి, చారూ వేసుకుని అన్నం తిన్నాను. ఇంకేమీ తినలేదు. అంతకన్న అవసరమైనవీ, రుచికరమైనవీ ఇంకేముంటాయి?

(5) మీ అన్నయ్య కొడుక్కి - ఆ జీనియస్‌కి - ఆ అద్భుతమైన యువకుడికి తన తాతగారు ఇంకా బ్రతికి ఉన్నారన్న విషయం గుర్తుండి ఉండదు.

(6) ఢిల్లీ గురించి ఎన్నో గుండెలదిరే విషయాలు - ఆహార పదార్థాల్లో, మందుల్లో కల్తీలూ, దొంగ వ్యాపారాలూ, సరుకులు దాచిపెట్టి నల్ల బజార్లలో అమ్మకాలూ, మోసాలూ ఇంకా ఎన్నెన్నో వింటూంటే మనస్సు ఆశ్చర్యంతో, ఆవేదనతో కుంచించుకుపోతుంది."

నాన్నగారి ఉత్తరానికి రాసిన జవాబులో నా ఎం.ఫిల్ చదువు గురించీ, నా ఉద్యోగంలో దాని ఆవశ్యకత గురించీ రాస్తూ, నేనిదివరకు చదివిన చైనీసు భాష సాధన లేక మరిచిపోయాననీ, దాన్ని ఎం.ఫిల్ కోసం మళ్లీ చదవాల్సి ఉంటుందనీ రాశాను. దానికి నాన్నగారు వెంటనే రాశారు.

"... నువ్వు మళ్లీ చైనీసు భాష నేర్చుకోవడం నాకెంత మాత్రం ఇష్టం లేదు. నీకు పుణ్యం ఉంటుంది. చైనీసు భాష నేర్చుకోవడం విషయం విరమించు. నీ సమయాన్నీ, ధనాన్నీ, శక్తినీ చైనీసు భాష నేర్చుకోవడం కోసం వృథా చెయ్యకు. ఇదివరకు దాన్ని నేర్చుకున్న సమయమంతా సంస్కృతం నేర్చుకుని ఉన్నట్లయితే ఎంతో ప్రయోజనకరంగా ఉండేది. ఎంతో మనో వికాసాన్నీ, ఆనందాన్నీ పొందగలిగి ఉండేదానివి. ఇహం, పరం రెండూ దక్కేవి. చైనీసు భాష నేర్చుకోవడం అర్థం లేని పని. వ్యర్థం. ఆ భాషలో ప్రావీణ్యం సంపాదించడం అసాధ్యం. ఉన్నత మానసిక ఆనందాన్ని ఎన్నటికీ పొందలేవు. ఆ సంగతి దయచేసి వదిలిపెట్టెసెయ్యి...."

నాన్నగారి సలహా ప్రకారం కాకపోయినా, ఇతర కారణాలవల్ల ఎం.ఫిల్ చెయ్యడం అప్పట్లో మానుకున్నాను.

"మీ మామగారికి 'కళాప్రపూర్ణ' బిరుదు లభించబోతున్నందుకు మీ అందరికీ అభినందనలు" అని రాస్తూ, "ఈ మధ్య వెళ్లి మీ మామగార్ని చూసి వచ్చాము. ఆయన నిజంగానే నీరసించినట్లు కనిపిస్తున్నారు. చూపు సరిగ్గా లేదు. చాలా చిక్కిపోయారు. ఆయనకి ఢిల్లీ వెళ్లి మీ దగ్గర ఉండాలని ఉంది - ఢిల్లీలో వాతావరణం అంత అనుకూలంగా లేకపోయినా. మీ ఇంట్లో ఇంకో గది వేరుగా ఉంటే బావుండుననుకున్నారు... మేమిద్దరం బాగానే ఉన్నాం. ఏమైనా, వయస్సు మీరుతున్న కొద్దీ నిశ్శబ్దంగా, నిశ్చయంగా దాని ప్రభావం తెలియజేస్తూనే ఉంటుంది. నా కుడికన్ను ఎప్పుడో గుడ్డిదైపోయింది కదా. ఎడమకన్ను కూడా అంత సంతృప్తికరంగా లేదిప్పుడు. అదీ ప్రస్తుత పరిస్థితి..." అని రాశారు.

అన్నయ్యకి కూడా నాన్నగారు ఇలాగే రాసి ఉంటారు. ఇంక ఈ పరిస్థితిలో అమ్మనీ, నాన్నగారినీ ఒంటరిగా, అంత దూరంగా ఉండనివ్వడం భావ్యం కాదనుకున్నాడేమో, నాన్నగారిని ధన్‌బాద్‌కి వచ్చెయ్యమని రాశాడుట.

"…. మీ అమ్మగారూ, నేనూ బాగానే ఉన్నాం – మాకు కొంత విశ్రాంతి అవసరమైనప్పటికీ. ఇప్పుడు మేము ఈ వయస్సులో మకాం మార్చాలని ఆలోచించడానికే (మీ అన్నయ్య ప్రతిపాదించినట్లు) అసాధ్యమనిపిస్తోంది. నాకింక ఎక్కడికీ మారాలని లేదు. హైదరాబాదు అంటే నేను మోజుపడి పోవడం వల్ల కాదు. ఎంత మాత్రమూ కాదు!)…" అని రాశారు నాకు.

* * *

మా చెల్లెలి మామగారు పోయారుట. వారం రోజులపాటు తీవ్రమైన పక్షవాతంతో బాధపడిన తరవాత ప్రాణం పోయిందిట. ఆయన వయస్సు 78ట. సరిగ్గా భార్య పోయిన ఏణ్ణార్ధానికి పోయారుట.

"… మీ అక్కయ్య గత వారం రోజుల నుంచీ సామర్లకోటలోనే ఉండి, మీ చెల్లెలికి సహాయం చేస్తోంది. మీ అక్కయ్య మహాత్మురాలు. అందరికీ సేవ చెయ్యడంలో ఆనందాన్ని పొందుతుంది. మీ అమ్మగారు ఒకటి రెండు రోజుల్లో అక్కడికి వెడతారు. ఆవిడకి ఎడమ కన్ను పూర్తిగా గుడ్డిదైపోయింది. నాకు కుడి కన్ను గుడ్డిది! మీ చెల్లెలి భర్తకి ఉత్తరం రాయి…." అని రాసి, అన్నయ్య బా ఉన్నదీ కనుక్కొని తనకు రాయమన్నారు.

అన్నయ్య కూతురు నాన్నగారికి నూతన సంవత్సర శుభాకాంక్షల్ని తెలుపుతూ ఉత్తరం రాసిందిట. దాని విషయమై వ్యాఖ్యానిస్తూ నాకు రాశారు:

"… ఎన్నో విషయాల్లో లాగే, క్రిస్‌మస్‌కీ, నూతన సంవత్సరానికీ శుభాకాంక్షల్ని తెలియజేస్తూ ఖరీదైన అందమైన కార్డులూ, కవర్లూ పంపించడంలో కూడా మన భారతీయులం పాశ్చాత్యుల్ని అనుసరిస్తూ ఉంటాం. ఇవ్వాళ మీ మేనకోడలి దగ్గర్నుంచి శుభాకాంక్షల్ని తెలియజేస్తూ కార్డు వచ్చింది. ఎందుకో, ఇటువంటి అలవాటు నేనెప్పుడూ చేసుకోలేదు. చాదస్తుడినైన వృద్ధుణ్ణి. అటువంటి అందమైన గ్రీటింగ్ కార్డ్సు మీద నేనెప్పుడూ ఖర్చుపెట్టలేదు. ఎవరైనా పంపిస్తే, అందాయని తెలియజేస్తూ ఉత్తరం రాస్తానంతే….

కాటికి కాళ్లు చాచుకుని కూర్చున్న నావంటి ముసలివాడికి శుభాకాంక్షలు పంపించడం హాస్యాస్పదం కాదూ? పైగా ఈ దుర్భరమైన చలిని తట్టుకోలేక, ఒకవైపు శారీరకంగా బాధపడుతూ, మరోవైపు ప్రపంచమంతటా సాంఘికంగా, ఆధ్యాత్మికంగా విలువలన్నీ దిగజారిపోతూంటే, ప్రతిచోటా ప్రతివాళ్లూ కృత్రిమమైన, అసహజకరమైన, అవినీతికరమైన జీవన విధానాలను అనుసరిస్తూంటే, నానాటికీ పెరుగుతున్న ధరలతో ఎంతోమంది బ్రతుకుతెరువు లేక నికృష్టంగా, ఉత్సాహరహితంగా జీవిస్తుంటే చూస్తూ, మానసికంగా ఆవేదన చెందుతూన్న నాబోటివాడికి శుభాకాంక్షల్ని పంపించడమా! నూతన సంవత్సరంలో నేను భోగ భోగ్యాలతో తులతూగాలని అభిలషించకండి. మీకు పుణ్యముంటుంది!!! ఈ శీతాకాలం మరింత దుర్భరంగా ఉండాలని అసలే కోరకండి!

అమ్మా, ఈ దుస్సహమైన చలికి తట్టుకోవడం ఈ ఏడు మరింత అసాధ్యమనిపిస్తోంది. మళ్లీ రాత్రి వస్తోందంటే మరో పీడకలలా భయం వేస్తోంది. దానికి తోడు, దోమలు మా రక్తాన్ని యథేచ్ఛగా పీల్చేస్తూంటాయి. మాకు కావల్సింది ఎండ, ఎండ, ఎండ! అంతకన్న ఏమీ వద్దు. ఎండ ఉన్నంతసేపూ ఎండలోనే కూర్చుని ఉంటున్నాం.

... నీకు నిజంగా నామీద ప్రేమ ఉంటే, నేను త్వరగా ఏ వ్యాధీ, ఏ బాధా లేకుండా, ఎవరికీ ఏ బాధా కలుగజెయ్యకుండా, దగ్గరగా ఉన్నవాళ్లకి గాని, దూరంగా ఉన్నవాళ్లకి గాని, ఎవరికీ కష్టం కలుగజెయ్యకుండా నేను తనువు చాలించాలని మనసారా కోరుకోమని నిన్ను బ్రతిమాలుకుంటున్నాను.

... నీ మేనల్లుడికి నేను పూర్తిగా అపరిచిత వ్యక్తినైపోయాను. అంచేత అతడు నాకు ఉత్తరం రాస్తాడని ఎలా ఎదురు చూస్తాను? గత మూడు సంవత్సరాల్లో ఒక్కసారైనా ఒక్క ఉత్తరమైనా రాయలేదు ఈ వృద్ధుడికీ, చాదస్తుడికీ..."

దానికి సమాధానంగా, కొంచెం ధైర్యం చేసి మనస్సులో ఉన్న మాట రాశాను. 'వేదాంతం, నిరాడంబరత' పేరుతో శరీరాన్ని హింసించడం ఏంన్యాయం? వేసవి కాలంలో శరీరం ఉడికి పోకుండా ఫేన్ వేసుకోవడం తప్పా? కడుపు నిండటానికి భోజనం చేసినట్లుగానే, శరీరం ఉడికి పోకుండా తగిన చర్య తీసుకోవద్దా? అలాగే శీతాకాలంలో వెచ్చగా ఉండేలా ఏదైనా కప్పుకోవడమో,

హీటర్ వాడుకోవడమో చేస్తే తప్పేముంది? ఇవన్నీ భోగభాగ్యాల(క్రింద జమవుతాయా? మనకున్నదాంట్లో ఆ మాత్రం ఖర్చుపెట్టుకోలేమా?... ఎవరైనా అటు వెడుతూంటే హీటరు పంపిస్తాను, దయచేసి వాడుకోండి, అలా అనవసరంగా బాధపడకండి" అని.

తక్షణం, నాన్నగారి సమాధానం : "... నీ ఉన్నత జీవన తత్త్వానికి అభినందనలు! తత్త్వశాస్త్రాన్ని క్లాసులో అధ్యయనం చెయ్యకపోయినా నీకు బాగానే పట్టుబడింది! నీకు పుణ్యముంటుంది – దయచేసి నాకు ఏ హీటరుగాని, నైలాను, ఉన్ని దుస్తులు గాని పంపించవద్దు. ఇటువంటి వంటే నాకు 'పరమ రోత', అసహ్యం. నువ్వు ఏమైనా పంపించినా నేను వాటిని ముట్టుకోను. నాకు 81 సంవత్సరాల వయస్సు నడుస్తోంది. ఇంతవరకు నేను నైలానుగాని, అటువంటి ఏరకం సరుకుని గాని స్పృశించనైనా లేదు. నాకు సాధారణమైన నూలు వస్త్రాలు, వీలైతే ఖద్దరు అంటేనే ఇష్టం. ఈ వయస్సులో నేనూ మీ అమ్మగారూ నైలాన్ స్టాకింగ్స్, సాక్స్ వేసుకుని తిరగాలనా నీ ఉద్దేశం!!! దేవుడా, రక్షించు! నాకేమీ వద్దు బాబోయ్. మీ అమ్మగారికీ అక్కర్లేదు... ఈ ఏడు శీతాకాలం ఎలాగూ అయిపోయింది. వచ్చే ఏడు శీతాకాలం వరకూ మేము బ్రతికి ఉంటే అప్పటి మాట చూసుకోవచ్చు. మేము వాస్తవిక జీవులం. నేను కృష్ణాజీ ప్రబోధాల కనుగుణంగానే జీవిస్తున్నాను వీలైనంత వరకు. నా సమయాన్ని చాలా వరకు ధ్యానానికే వినియోగిస్తూ ఉంటాను. ఈ ప్రపంచం నుంచి నేను ఏమీ కోరడం లేదు. నాకెవరి వద్దనుంచీ ఏమీ వద్దు. ప్రేమ కూడా వద్దు..." అని రాశారు.

తరవాత నాన్నగారికీ, అమ్మకీ ఫ్లూ జ్వరం వచ్చిందిట. అమ్మ పళ్లపోటుతోనూ, నాన్నగారు కాలివాపుతోనూ బాధపడ్డారుట. కొంచెం కోలుకున్నాక ఉత్తరం రాశారు నాన్నగారు. "నేను పథ్యం తీసుకుని రెండు వారాలయింది. నీరసం క్రమేపీ తగ్గుతోంది. కానీ, కుడికాలు మోకాలు క్రింది నుంచి పాదందాకా వాచి చాలా బాధపెడుతోంది. ఇంట్లోనే మెల్లిగా తిరుగుతున్నాను. ఆ నొప్పి తగ్గితే నాకు నయమైనట్లే. ఇవాళ కొంచెం మెరుగ్గా ఉంది. ఒక ఫర్లాంగు దూరం నడిచి రాగలిగాను. అట్టే కష్టమనిపించలేదు. మీ అమ్మగారు కావలసిన సపర్యలన్నీ చేస్తున్నారు. ఇతరులు ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు నన్ను చూసి బాధపడటం తప్పించి?...

రెండవ కొడుకు లేడని ఎప్పుడూ బాధనిపించలేదు - ఎప్పుడైనా కూరలు, బియ్యం, పంచదార, కిరసనాయిలు, మొదలైన వేమైనా తీపుకురావలసి వచ్చినప్పుడు తప్ప. మీ అమ్మగారు ఆసుపత్రికి వెళ్లి పళ్లుపీకించుకున్నారు. అలాగే అవస్థపడుతున్నారు. మీ అక్కయ్య కొడుకు, కోడలూ పక్కవాటాలోనే ఉంటున్నా, ఇద్దరూ పొద్దున్నే పనులు పూర్తిచేసుకుని 8-9 గంటలమధ్య ఆఫీసులికి వెళిపోయి, మళ్లీ రాత్రి 7 గంటలకి తిరిగి వస్తారు. వాళ్లు మాకోసం ఏంచేయ్యగలరు?..."

ఇటువంటి ఉత్తరాలు వచ్చినప్పుడూ, కబురు తెలిసినప్పుడూ బాధతో విలవిల్లాడటం, 'ఏంచెయ్యగలం'? అనుకోవడం - మళ్లీ మా 'రోటీను'!

అన్నయ్య హైదరాబాదు కెళ్లాడుట నాగ్‌పూర్ నుంచి. నాగ్‌పూర్‌లో ఏదో పని ఉండి, అక్కడినుంచి హైదరాబాద్ వెళ్లి ఒకరోజుండి వెళ్లాడుట. "వాడు వచ్చినందుకు చాలా ఆనందించాం" అని రాశారు నాన్నగారు.

తరవాత కొన్నాళ్లయాక అమ్మ నరసాపురంవెళ్లింది. అక్కయ్య రెండోకూతురి పెళ్లికి. నాన్నగారు వెళ్లలేదు. ఎప్పటిలాగే అన్నయ్య, నేనూ వెళ్లలేదు. "వెళ్లలేకపోతున్నందుకు ఏమీ అనుకోవద్దని చెప్పమని" అమ్మకి ఉత్తరం రాశాను. ఆ ఉత్తరం చేరేసరికే అమ్మ నరసాపురం వెళ్లిపోయిందిట. నాన్నగారు ఉత్తరం రాశారు :

"...మీ అమ్మగారు పెళ్లితంతు పూర్తయాక, ఇంకో వారం రోజుల్లో తిరిగి వస్తారు. ఈసారి అన్నప్రకారం త్వరగానే తిరిగి వస్తారు. తోటలో చెట్టుకి మామిడి కాయలు కోతకి సిద్ధంగా ఉన్నాయి. నా వంట నేనే చేసుకుంటున్నాను. ఊరగాయలు మీ అమ్మగారి ఆధిపత్యంలోకి వస్తాయి కదా!..."

పెళ్లి హడావిడి పూర్తయాక అమ్మ తిరిగి వచ్చాక మళ్లీ రాశారు. పెళ్లయిన మూడురోజుల తరవాత పెళ్లి కూతురు పెళ్లికొడుకుతో కలిసి బెంగుళూరు వెళిపోయిందిట. నేనుకూడా అలాగే వెళిపోయిన సంగతి గుర్తు తెచ్చుకుని, "రోజులు మారిపోయాయి మరి!" అని వ్యాఖ్యానించారు. అంతేకాదు, పెళ్లికి నేనూ అన్నయ్యా వెళ్లనందుకు అందరూ బాధ పడ్డారుట. అనవసరంగా డబ్బు ఖర్చుచేసుకుని అంతదూరం నుంచి రావద్దని నాకూ అన్నయ్యకూ నాన్నగారే సలహా ఇచ్చి ఉంటారనినాన్నగారిని నిష్ఠురమాడిందిట

అమ్మ. అసలు సంగతి ఖర్చుకాదనీ, అంత పెద్దహోదాలో ఉన్న వాళ్లు లేని వాళ్లతో కలవడం ఆయనకిష్టం లేక ఖర్చువంక పెట్టారనీ కూడా నిందించిందట.

"... నా జీవిత భాగస్వామిగా ఇంతకాలంగా నాతోబాటు ఉంటూ ఇంకా మీ అమ్మగారు నా మనస్సుని గాని, నా హృదయాన్ని గాని ఇంతవరకూ అర్థం చేసుకోలేక పోయారు. నేను పెద్ద పెద్ద వాళ్లనీ, బాగా చదువుకున్నవాళ్లనీ, అందమైన వాళ్లనీ, గొప్పవాళ్లనీ మాత్రమే ప్రేమించి, గౌరవించగలుగుతానట!!! ఎంత మూర్ఖత్వం! ఎలాంటి వక్రమనస్తత్వం! ఏం చెయ్యగలను? నామనస్సు, హృదయం మాత్రం నిష్కల్మషమైనవి..." అని బాధ పడుతూరాశారు. పైగా, "అటువంటి ఆత్మన్యూనతా భావంతోబాధపడేవాళ్లతో మెలగడం చాలాకష్టం" అని రాశారు. దానికి వాళ్లు పెరిగిన వాతావరణం, వాళ్లు ఎదుర్కొన్నఅనుభవాలేననీ, వాళ్లని సరియైన దృక్పథంతో అర్థం చేసుకోవాలనీ నేను సమాధానం రాస్తూ, నేను అంతకుముందెప్పుడో రాసిన కథ కాపీని నాన్నగారికి పంపించాను. అందులో స్త్రీ అభివృద్ధికీ, ఆత్మవిశ్వాసానికీ, సాంఘిక ప్రయోజనానికీ విద్య, ఉద్యోగం ఆమెకెంత అవసరమో తెలియజెప్పే కథ అది. దాన్నిచదివి, నాన్నగారు నాకు మళ్లీ రాశారు:

"... స్త్రీల విద్యగురించి మాత్రం రెండురకాలుగా అభిప్రాయపడవచ్చు. ప్రతి స్త్రీకీ విద్య అవసరం. విద్యనభ్యసించాలి - కానీ, ఏవిధంగా, ఏయే విషయాల్లో - అనేవాటికి భిన్నాభిప్రాయాలుండొచ్చు. ఇక స్త్రీలు ఉద్యోగాలు చెయ్యడంగురించి - ఇతరుల మీద ఆధార పడకుండా ఆర్థికంగా తన కాళ్లమీద తాను నిలబడటంకోసం స్త్రీ ఉద్యోగం చెయ్యడం అనేది చాలాక్లిష్టమైనది, కష్టమైనది. ఉదాహరణకి - మీ అక్కయ్య కోడలు పొద్దున్నే 8.30 కి వెళిపోయి, మళ్లీ సాయంకాలం 6.30 కి వస్తుంది. మామేడ మీద కాపురం ఉంటున్నావిడకి (కెమిస్ట్రీలో ఎం.ఎస్.సి) ఒక పాప ఉంది - నెలలపిల్ల - ఆవిడ ఆర్.ఆర్.లాబ్స్‌లో పని చేస్తుంది. నేనురోజూ అటువంటి యువతుల్ని లెక్కలేనంత మందిని చూస్తున్నాను- ఇ.సి.ఐ.ఎల్.లోనూ, ఎన్.ఎఫ్.సి.లోనూ ఇంకా ఎన్నో పరిశ్రమల్లోనూ, సంస్థల్లోనూ పని చేసే స్త్రీలు-పొద్దున్నే 6.30 నుంచీ, 7 గంటలనుంచీ బస్సులకోసం పడిగాపులు పడి నిలబడటం - అదంతా వాళ్లకెలా అనిపిస్తుందో, వాళ్లుసంసార జీవితాన్ని ఎంతసుఖంగా సాగిస్తున్నారో - మొదలైన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెప్పవలసింది వాళ్లే, నేను కాదు.

కానీ, నా మనస్సులో ఉన్నది చెప్పేస్తున్నాను - వాళ్లమీద నాకు విపరీతమైన జాలి...

అయితే, ఒకటిమాత్రం వాస్తవం - నెలకి 350/- నుంచి 500/- వరకూ జీతం సంపాదించుకునే పురుషుడు తన భార్యకూడా సంపాదిస్తేగాని జీవితాన్ని సుఖప్రదంగా సాగించలేకపోతున్నాడు. సంసారాన్ని నడపడానికి భర్త జీతం ఒక్కటే సరిపోవడం లేదు కాబట్టి స్త్రీ ఉద్యోగం చెయ్యడం తప్పనిసరి అయిపోతోంది. ఒక సమస్యని పరిష్కరించాలనే ప్రయత్నంలో ఇంకోసమస్యనీ, మరింకెన్నో సమస్యల్నీ సృష్టించడం జరుగుతోంది. ఈ పరిస్థితి మీద నేను వ్యాఖ్యానించలేను. సానుభూతితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. కాలంతోబాటు మారుతున్న అలవాట్లనీ, అభిరుచుల్నీ జీవన విధానాలనీ, ఇంకా ఎన్నిటినో గమనిస్తున్నాను.

...నిజం చెప్పాలంటే, నాకిప్పుడు ఇష్టం, అయిష్టం - అంటూ ఏదీ లేదు. చూస్తాను, వింటాను, అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను - ఎటువంటి వ్యక్తిగత అనుభూతీ లేకుండా. అవలోకించడం, అవగాహన చేసుకోవడం - అంతే - ప్రతిస్పందన లేకుండా..."

ఆ క్రిందటేడు మామరిది పెళ్లికి వచ్చినప్పుడు పెళ్లిపందిట్లో కూర్చున్న అతిధులకి "కోకోకోలా"లూ, "ఫాంటా" లూ ఇస్తూ, నాన్నగారికి కూడా ఒక సీసా అందించబోయాను. నాన్నగారు వెంటనే తేలునిచూసినట్లు వెనక్కి వెనక్కి జరుగుతూ "నాకొద్దు, నాకేమీవద్దు, నేపుట్టి పెరిగాక ఇంతకరకు అటువంటివి రుచి చూడలేదు" అన్నారు ఒక్క గుక్కలో. నేను మరోసారి అడిగితే, "కూల్‌డ్రింక్స్ వ్యసనం" మీద ఉద్రేకంగా ఉపన్యాసం ఇచ్చి పెళ్లి పందిట్లోంచి ఎక్కడ "వాకౌట్" చేస్తారోనని భయపడి నేను వెనక్కి తగ్గాను. ఆపక్కనున్నాయన నవ్వుతూ "పోనీ, ఇప్పుడు రుచి చూడండి"! అన్నాడు. నాన్నగారు కూడా చిరునవ్వు నవ్వి "మహా ప్రభో, వద్దు" అన్నట్టుగా చేతులెత్తి నమస్కారం పెట్టారు. నాన్నగారు ఎంతమారిపోయారు! అనిపించింది. అయితే, ఆరోజుల్లో - ఆయన హడావిడి చేసినది వాళ్ల అక్కయ్య కూతురి ఇంట్లో పెళ్లికి. ఇప్పుడిది మా అత్త వారింట్లో పెళ్లికదా!

* * *

మా చెల్లెలు, భర్త, పిల్లలతో కలిసి ఢిల్లీ రావాలనుకుంటున్నారని తెలిసి, మా నాన్నగారు నాకు ఉత్తరం రాశారు :

"…. హైదరాబాదులో ఎండలు చాలా తీవ్రంగా ఉన్నాయి. ఢిల్లీలో ఇంతకన్న ఎక్కువగా మండిపోతున్నాయనుకుంటాను. నాకు ఢిల్లీ అంటే తగని విముఖత. అక్కడి అవినీతి, లంచగొండితనం, కుట్రలు, కుటిల రాజకీయాలూ, దుర్మార్గాలూ – ఢిల్లీ పేరెత్తితేనే నా ఒళ్ళు జలదరిస్తుంది…" అని రాసేసరికి, నాకూ కొంచెం ఒళ్ళు మండింది – చీటికీ మాటికీ ఢిల్లీని విమర్శిస్తూంటే. నా అసమ్మతిని తెలియజేశాను జవాబులో. దానికి మళ్ళీ నాన్నగారు "మీ ఢిల్లీ గురించి – భారత రాజధాని గురించి ఆ విధంగా రాసినందుకు మనస్ఫూర్తిగా, బేషరతుగా క్షమించవలసిందిగా వేడుకుంటున్నాను. మీరుంటున్న ఢిల్లీ మహానగరాన్ని దూషించి, అవమానించే హక్కు నాకెంత మాత్రం లేదని ఒప్పుకుంటున్నాను" అని రాశారు.

తరవాత, మా చెల్లెలూ, వాళ్ళూ ఢిల్లీ ప్రయాణం విరమించుకున్నారు కారణాంతరాల వల్ల. నాన్నగారు ఆనందించి ఉంటారు లోలోపల. దేశంలో 'ఎమర్జన్సీ' ప్రకటించడం జరిగింది. నాన్నగారు వెంటనే నాకు ఉత్తరం రాశారు: "… మీ న్యూఢిల్లీ, ఆ బ్రహ్మాండమైన ప్రధానమంత్రీ మాకు ప్రతిరోజూ ఏవో అద్భుతమైన వార్తల్ని అందిస్తూ దేశ చరిత్రలో ఒక వినూత్నమైన మలుపు తీసుకొస్తున్నారు. ఆవిడ – ఆ "ధృతరాష్ట్రుడు కమ్ లేడీమేక్‌బెత్" ప్రయత్నాలు సఫలం కావాలని నా కోరిక!… రేపటికి ఈ శరీరానికి 81 సంవత్సరాలు పూర్తవుతాయి. ఈ సందర్భంగా మీ అందరికీ నా శుభాకాంక్షలు. కానీ, ఎన్నాళ్ళిలా కొనసాగాలి? ఇంకా ఎంతకాలం ఈ "తోచక పోవడాన్ని" సహించాలి? మీ అమ్మగారు ఏవో చిన్న చిన్న బాధలున్నా, చెయ్యవలసిన చాకిరీ అంతా చేసుకుంటున్నారు…."

ఇక ఉత్తరాల్లో వచ్చే వార్తలిలాంటివే. ఇటువైపునుంచీ, అటువైపు నుంచీ కూడా. మామగారికీ వయసుతోబాటు నీరసం ఎక్కువవుతోంది. అలోపతీ, హోమియోపతీ ఏవేవో మందులు లెక్కలేనన్ని వాడుతున్నారు. అత్తగారి బాధలు ఆవిడవి – హై బి.పి., గుండె నీరసం, ఆయాసం, దడ, వగైరాలు. ఇంట్లో చాకిరీలు తప్పడం లేదు. ఈలోగా ఈయనకి తీవ్రమైన అస్వస్థత! హాస్పిటల్లో ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో చేర్చారు. చిన్న పని కుర్రవాడి సహాయంతో

తంటాలు పడుతున్నాను హాస్పిటల్‌కి ఇంటికీ మధ్య తిరుగుతూ. అన్నయ్య ఏదో పనిమీద ఢిల్లీ వచ్చినప్పుడు మా పరిస్థితి తెలిసి, నాన్నగారికి ఉత్తరం రాశాడుట, నాతో మాట్లాడాక.

"... మీ ఆయన అనారోగ్య పరిస్థితి గురించి వివరంగా రాశాడు మీ అన్నయ్య. నీకు సహాయంగా ఉండటానికి మీ వదినని పంపిస్తానని చెప్పాడుట. మీ అమ్మగారిని ఎంతమాత్రం పంపించవద్దని కచ్చితంగా చెప్పావుట. నిజమే. ఆవిడ కీళ్లనొప్పులతో అంతదూరం ప్రయాణం చేసే స్థితిలోగాని, ఆ ఢిల్లీ వాతావరణంలో ఇమడగల స్థితిలో లేరు – నీకు సహాయపడటం మాట అలా ఉంచి. మీ ఆయన్ని ఆసుపత్రి నుంచి ఇంటికి తీసుకొచ్చిన తరువాత, తక్షణం నాకు ఉత్తరం రాయవలసిందిగా కోరుతున్నాను. నీ ఉత్తరం కోసం ఆదుర్దాగా ఎదురుచూస్తూ ఉంటాను. ఎంతమాత్రం ఆలస్యం చెయ్యకు..." అని రాశారు నాన్నగారు.

అటు, అదే సమయానికి అత్తగారికీ గుండెపోటు వచ్చి హాస్పిటల్లో చేర్చారని తెలిసింది. ఈయనకి కాస్త నెమ్మదించగానే ప్లేన్‌లో హైదరాబాదు వెళ్లాం ఇద్దరమూ. అత్తగారింకా హాస్పిటల్లోనే ఉన్నారు. నేను వెళ్లడం కుదరలేదని, నాన్నగారే నడిచొచ్చారు మమ్మల్ని చూట్టానికి. మా మరిది భార్యకి సెలవు లేక, ఆఫీసుకి వెళ్లడం తప్పడం లేదు – ఇంట్లో చంటిపిల్లని వదిలేసి. మామగారే చంటిపిల్లని చూసుకుంటున్నారు పనిపిల్ల సహాయంతో. ఇల్లంతా అస్తవ్యస్తంగా ఉంది. అత్తగారిని ఇంటికి తీసుకొచ్చేవరకూ అక్కడే ఉండి, తరువాత ఢిల్లీకి తిరిగి వచ్చేశాం.

మేము వచ్చేశాక, అమ్మకి జబ్బు చేసిందిట! అక్కయ్య నరసాపురం నుంచి వచ్చిందిట సహాయంగా ఉండటానికి. అది తిరిగి వెళ్లిపోయేముందు నాన్నగారు రాశారు నాకు : "... పొద్దున్నే వినాయకుడి పూజ చేసుకున్నాక, సాయంకాలం మీ అక్కయ్య ఊరికెళ్లిపోతుంది. నెల్లాళ్లనుంచీ మీ అమ్మగారికి సహాయంగా ఉంది. ఇప్పుడు మీ అమ్మగారు బాగా కోలుకున్నారు. ఇక్కడ వర్షాలు బాగా పడుతున్నాయి. రాత్రనక, పగలనక ఎడతెరిపి లేకుండా కురుస్తూండటం వల్ల, మీ అమ్మగారు సూర్యుణ్ణి చూస్తేగాని భోజనం చెయ్యడం అలవాటు లేదు కనక, రోజూ భోజనం చెయ్యడం ఆలస్యమవుతోంది. ఇవ్వాళ పొద్దున్న పెందరాళే తినగలిగారు..."

చిన్నప్పటి నుంచీ సూర్య నమస్కారాలు చెయ్యడం అలవాటు అమ్మకి. నేను పుట్టక ముందు నాన్నగారు కూడా చేసేవారుట. నా చిన్నప్పుడు నాకింకా గుర్తు. వానాకాలంలో ముసురు పట్టినప్పుడు, అమ్మ నన్ను చీటికీ మాటికీ వీధిలోకి వెళ్ళి చూసిరమ్మనేది సూర్యుడు కనిపిస్తున్నాడేమోనని. తెల్లవారుఝామున లేచి ఇంట్లో పనులన్నీ చూసుకుని, మడి కట్టుకుని కట్టెల పొయ్యిమీద అడ్డెడు గిన్నెతో అన్నం వార్చి, వంటంతా పూర్తిచేసి, అందరికీ వడ్డనలు చేసి, సూర్యుడు కనిపించలేదని, సూర్యుడి కోసం ఎదురు చూస్తూ, వంటింటి గడప మీద తలపెట్టుకుని ముడుచుకు పడుకునేది. ఏమిటో ఆ పిచ్చి చాదస్తం ఇప్పటికీ! తలుచుకుంటే జాలేస్తుంది.

ఉద్యోగరీత్యా ట్రెయినింగ్ కోసం ఫ్రాన్స్ వెళ్ళాల్సి వచ్చింది నేను. ఒకవైపు ఆ అవకాశం నాకు లభించినందుకు నాన్నగారికి సంతోషం, మరోవైపు ఈయన్ని వదిలి తొమ్మిది నెలలపాటు అంతదూరంలో ఉండాలన్న బాధ. నా పరిస్థితీ అలాగే ఉన్నా, ఈయనతోబాటు అందరూ ప్రోత్సహించడంతో వెళ్ళడానికి సంసిద్ధమై ఫ్రెంచి నేర్చుకోవడం మొదలుపెట్టాను.

* * *

నేను ఫ్రాన్స్‌లో ఉండగానే అన్నయ్య కూతురి పెళ్ళి నిశ్చయమైంది. పెళ్ళి హైదరాబాదులో జరపడానికే నిశ్చయించారు. అన్నయ్య శుభలేఖ పంపించాడు నాకు. "బోర్డో" నుంచి నాన్నగారికి ఉత్తరం రాస్తూ, శుభలేఖ చూసిన తరువాత కలిగిన సందేహాన్ని వెలిబుచ్చాను. దానికి నాన్నగారి సమాధానం - "నా అసలు పేరుని మళ్ళీ వాడటం ప్రసక్తే లేదు. ఒక విచిత్రమైన చిక్కు పరిస్థితి ఏర్పడింది: (1) తల్లితండ్రులు బ్రతికి ఉండగా వివాహ ఆహ్వాన పత్రికలను మీ అన్నయ్య పేరు మీదుగా వెయ్యడం సంప్రదాయరీత్యా మర్యాద కాదు. బంధు మిత్రులంతా అపార్థం చేసుకుంటారు. (2) 'మృత్యుంజయ' అనే పేరున ఆహ్వాన పత్రికలు వేయడంలో అర్థం ఉండదు. అంచేత నాకు కొంత అయిష్టంగా ఉన్నప్పటికీ, నా అసలు పేరుతో అచ్చు వేయిస్తామని మీ చెల్లెలి భర్త, మీ వదినగారి అక్క కొడుకూ వచ్చి అడిగినప్పుడు, కాదనలేక పోయాను. ఇప్పటికీ ఉత్తరాలు మాత్రం 'మృత్యుంజయ' పేరుతోనే రాస్తున్నాను. ఇదీ అసలు కథ... మీ మేనకోడలి వివాహం ఏ అవాంతరం లేకుండా బాగా జరిగింది...." అని రాశారు.

"అవాంతరం లేకుండా" అని రాశారు కాని, పెళ్ళిలో చేసే "అనవసరపు" ఖర్చుల గురించి అన్నయ్యకీ నాన్నగారికీ వాదోపవాదాలు జరిగి ఘర్షణకి దారితీసిందనీ, చివరికి పెళ్ళి పందిట్లోకి నాన్నగారు అడుగుపెట్టలేదనీ తరవాత తెలిసింది నాకు. అటువంటి సమయాల్లో అమ్మ "పుట్టుకతో పుట్టిన బుద్ధి...." అంటూ వ్యాఖ్యానిస్తూ ఉంటుంది నాన్నగారి గురించి.

నేను ఫ్రాన్స్ నుంచి తిరిగి వచ్చిన తరవాత, ఆఫీసుకి దగ్గరగా పెద్ద క్వార్టర్స్‌లోకి మకాం మార్చాం. ఆ సంగతి నాన్నగారికీ, అందరికీ రాశాను. నాన్నగారు వెంటనే ఉత్తరం రాశారు.

"... అంత మంచి పెద్ద ఇంట్లో, అన్ని ఆధునిక సౌకర్యాలతో, ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉండబోతున్నందుకు అందరం చాలా సంతోషించాము... నిన్న మీ అత్తగారినీ, మామగారినీ చూసి వచ్చాము. మీ మరిదీ వాళ్ళూ వేరే ఇంట్లో ఉంటున్నారు. మీ అత్తగారికి కన్ను సరిగ్గా కనిపించడం లేదు. ఇంటి పనులు చేసుకోవాలంటే శారీరక దార్ఢ్యం లేదు. ముసలాయన – సంస్కార కుసుమంలాంటి మీ మామగారు ఇంట్లో అంతంత మాత్రం తిరుగుతున్నారు. ఇంకేమీ చెయ్యలేరు. ఈ విషయంలో వాళ్ళకన్న మా పరిస్థితే మెరుగ్గా ఉంది. వారికి శారీరకంగా సహాయపడేవాళ్ళూ, మానసికంగా ధైర్యం, సాంత్వనం కలుగజేసేవారూ అవసరం. కూతురి దగ్గర ఉండటానికి మొహమాటపడుతున్నారు. మిమ్మల్ని చూడాలని తపించి పోతున్నారు. మీరంటే వాళ్ళకి చాలా ఆపేక్ష. మీ ప్రేమ, ఆప్యాయతల కోసం అలమటించి పోతున్నారు. కానీ, ఢిల్లీ వెళ్ళి అక్కడ ఉండాలంటే, ఆ వాతావరణానికి భయపడిపోతున్నారు. ఏంచెయ్యడానికీ పాలుపోక, వారి కన్నులలో నిండిన నీరు స్పష్టంగా కనిపించింది. నా హృదయం వికలమై, ఆర్ద్రమైపోయింది.

ఇక, నా విషయమై మరిచిపో. నేనూ, ఢిల్లీ తూర్పు పడమరల్లా వ్యతిరేకం. న్యూఢిల్లీ పేరెత్తితేనే నాలో ఏదో చెప్పలేనంత ఏవగింపు కలుగుతుంది. నేను వెళ్ళడం అన్నది అసాధ్యం. ఈ జీవితంలో ఢిల్లీకి గాని, వింధ్య పర్వతాలు దాటి మరెక్కడికైనా గాని నేను వెళ్ళడం అనేది అసాధ్యం. మొండితనం కాదిది. ఇక్కడైనా నేను ఎంతో అసౌకర్యంగానూ, ఆనందం లేకుండానే ఉంటున్నాను. మీ అమ్మగారు పట్టుపట్టి నన్ను నరసాపురం నుంచి ఈడ్చుకొచ్చి ఇక్కడ పడేశారు. నేను మాట్లాడకుండా మౌనంగా సహిస్తున్నాను.

నా బి.పి. పెరిగింది. నా ఆరోగ్యం అంత బాగా లేదు. నేను శారీరకంగా ఎంతగా శ్రమ తగ్గించుకుందామనుకున్నా, పరిస్థితులు నాకు శ్రమని మరింత అధికం చేస్తున్నాయి. వంట మనిషినీ, వేరే నౌకరునీ పెట్టుకోవడం సాధ్యమయ్యే పనికాదు. నీటి ఎద్దడి ఘోరంగా ఉంది. తోటపని చెయ్యడానికి ఇంకెవరూ లేక, నేనే తప్పనిసరిగా మొక్కలికి రోజూ నీళ్లు పోస్తున్నాను (55 బకెట్ల నీళ్లు). తోట తుడిచి శుభ్రం చేస్తూ ఉంటాను. అ నుంచి క్ష వరకూ ఇంటిపనులూ, బజారు పనులూ చెయ్యాలి. నా జీవితానికి అలా రాసిపెట్టి ఉంది. నేనెవరి మీదా నింద వెయ్యడం లేదు. నా కోరికల్లా, తోటపని చేస్తూ నేలకూలిపోవాలనే. అలా అయితే, ఎవరూ ఈ శరీరానికి సేవ చెయ్యక్కర్లేదు. ఎవరికీ కష్టం, ఇబ్బందీ కలక్కుండా ఉంటుంది. ఇంకో మూడు నెలల్లో 83 సంవత్సరాలు పూర్తవుతాయి.

ఇక నేను వెళ్లిపోయి, తక్కిన వాళ్లకి చోటు కల్పించాలి. నేను వెళ్లిపోయాక, ఈ ఇంటి అద్దె వసూలు చెయ్యడం లాంటి పనులు అంతదూరం నుంచి మీ అన్నయ్య ఎలా చూసుకుంటాడు అన్నదే ప్రశ్న. నా శరీరమూ, మనస్సూ ఏవిధమైన కల్మషమూ లేకుండా పరిశుభ్రంగా ఉన్నాయనే అనుకుంటున్నాను..''

నాన్నగారి ఉత్తరం అందిన కొద్ది రోజులకే అత్తగారినీ మామగారినీ ఢిల్లీకి రప్పించేశాం. అన్నయ్య కూడా అమ్మ గురించీ, నాన్నగారి గురించీ ఏదో ఒకటి చెయ్యాలని నిశ్చయించుకున్నట్లు చెప్పాడు. వాళ్ల సమస్య నిత్యం మనసులో ములుకులా గుచ్చుకుంటున్నట్లు బాధపడ్డాడు. అన్నయ్య పని ఒత్తిడితో బాగా అలిసిపోతున్నాడు.

బాధ్యతాయుతమైన ఉన్నత పదవుల్లో ఉండటం ముళ్ల సింహాసనం మీద కూర్చుని ముళ్ల కిరీటం పెట్టుకున్నట్లుగానే ఉంటుంది. నాకూ మనస్సేమీ బావుండలేదు. ఒక బలహీన క్షణంలో నా జాతకం చక్రం ఉన్న కాగితాన్ని తీసి చూశాను. అది ఎప్పుడో నాన్నగారు నాకిచ్చారు. అందులో ఇప్పుడు రవి మహాదశ ప్రారంభం కాబోతున్నట్లు రాసి ఉంది. ఆ దశ ఆరు సంవత్సరాలపాటు ఉంటుంది. నాకు జ్యోతిష శాస్త్రం తెలియదు. చదవలేదు. కుతూహలం కొద్దీ నాన్నగారికి రాశాను. రవి మహాదశ ప్రాముఖ్యం, లక్షణాలూ ఏమిటని. నాన్నగారు తక్షణం నాకు సమాధానం రాశారు వివరంగా :

"..(1) నేనిదివరకు నీకు రాసి ఇచ్చినట్టున్నాను లగ్నం కుంభం –

జననకాల శని దశాశేషం 0.1.13 కావచ్చును... శుక్రదశ కొద్దినెలల్లో పూర్తవుతుంది. రవి దశ ప్రారంభమవుతుంది. 6 సంవత్సరాలపాటు ఉంటుంది. (2) బుధ, కేతు దశలలో నీ చదువు, వివాహం జరిగాయి. శుక్ర దశలో (శుక్రుడు 4, 9 స్థానాలకు అధిపతి) వాహన, భాగ్యాధిపతి దశ. (జ్యోతిష శాస్త్ర ప్రకారం నేనెప్పుడూ అనుకున్నట్లుగానే) నీ జీవితంలో ఇదే ఉత్తమ దశ అనుకోవచ్చును. అలాగే వాస్తవంగా జరిగింది కదా.

(3) ఇక రవిదశ - ఆరు సంవత్సరాల గురించి : రవి 7వ స్థానానికి అధిపతి. నీకు పేరూ, కీర్తి ప్రతిష్ఠలూ కొంతవరకు తీసుకు రావచ్చును. కానీ, కొన్ని మనస్సుకి బాధ కలిగించే ఘటనలు కూడా జరుగవచ్చును. తమ భవిష్యత్తు గురించి ఎవరైనా తెలుసుకోవాలనుకున్నప్పుడు వారి మనస్సు స్తిమితంగా, స్థిరంగా, ధైర్యంగా, వేటినైనా ఎదుర్కొనేలా ఉండాలి. ప్రతివాళ్లూ మంచి, ఇంకా మంచి భవిష్యత్తు ఉండాలనే కోరుకుంటారు. కనీసం, ఉన్నదున్నట్లుగానైనా కొనసాగాలనుకుంటారు. అంతేకాని, ఏ కష్టాలు సంభవించినా తట్టుకోవడానికి సిద్ధంగా ఉండరు. ఒక్కటి గుర్తుంచుకోవాలి. జీవితంలో వెలుగు, చీకటి, పైకి వెళ్లడం, క్రిందికి జారడం, సుఖం, దుఃఖం అన్నీ కలగలిసే ఉంటాయి. మనిషికి హేతుబద్ధమైన, స్తిమితమైన మనస్సు ఉండాలి. ఏ కష్టం వచ్చినా, విచారం కలిగినా, తలక్రిందులై పోకూడదు.

ఇప్పుడు నేను 84 ఏళ్ల వయస్సులో ఉన్నాను. మీ అమ్మగారికి 73 గాని 74 గాని ఉండొచ్చును. ఈ రవి దశలో నీ తల్లితండ్రులు పోతే తట్టుకోవడానికి సిద్ధంగా ఉండొద్దా? దానికి విచారించాలా? మేమిద్దరంగాని, మీ అత్తమామలలో ఎవరైనా గాని పోవచ్చునని నువ్వు ఎదురు చూడొచ్చు. ఇవే ఈ దశలో కలిగే చిన్న చిన్న బాధలు. మీ చెల్లెలి భర్త నీకన్న చిన్నవాడు కొద్దికాలం క్రితమే తల్లితండ్రులిద్దరినీ పోగొట్టుకున్నాడు. అది సహజమే కదా. నువ్వు కూడా అటువంటివే ఏవో జరుగుతాయని అనుకోవచ్చు. రవి దశలో మంచి, చెడూ రెండూ సంభవమే. కొన్ని దుస్సంఘటనలతోబాటు, కొన్ని ఉత్సాహ జనకమైన విశేషాలు కూడా లేకుండా ఉండవు. పేరు రావడం, ధనలాభం మొదలైనవి. అంచేత విచారించవలసిన పని లేదు. సంతోషంగా ఉండు.

(4) మీ అమ్మగారు సామర్లకోట వెళ్లారు. అక్కడ నుంచి నరసాపురం వెడతారుట. ఆవిడ నరాల బలహీనతతో బాధపడుతున్నారుట. బలానికి

దానికి ఏవో మందులు పుచ్చుకుంటున్నారుట. (5) నేను వండుకు తింటున్నాను. ముసలావిడ తిరిగి వచ్చేవరకూ నా పని ఇంతే. నేను ఒక పక్క వంట చేసుకుంటూనే, మరోవైపు నుంచి తోటలో మొక్కలికి నీళ్లు పొయ్యడం, మొదలైన పనులన్నీ చేస్తున్నాను. శ్రమ అనిపిస్తున్నా. నాకిలా రాసిపెట్టి ఉంది. నాకు విచారం లేదు..."

నాన్నగారి ఉత్తరం చదువుతున్నంతసేపూ గొంతులో ఏదో అడ్డుపడినట్లూ, మింగుడు పడనట్లూ తోచింది. అమ్మ ఊరి నుంచి తిరిగి వచ్చాక నాన్నగారు మళ్లీ ఉత్సాహంగా ఉత్తరం రాశారు. అందులో చాలా రోజుల తరువాత కృష్ణమూర్తి గారి ప్రసక్తి తీసుకొచ్చారు.

"...జిడ్డు కృష్ణమూర్తిగారి "ది ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్" అనే గ్రంథానికి నేను చేసిన తెలుగు అనువాదం నీకొక కాపీ పంపించాను కదా. అది నీ దగ్గర ఉందనుకుంటాను. ఎవరో దాన్ని చదివి మెచ్చుకున్నారని కూడా రాశావు. విచిత్రం ఏమిటంటే, ఒక పెద్ద మనిషి దాన్ని అచ్చువేయించి ప్రచురించడానికి అయ్యే ఖర్చంతా భరించడానికి సిద్ధంగా ఉన్నాడుట. ఇది వరకు నేను మొత్తం ఆరు కాపీలు తయారు చేశాను (మొత్తం 1500 పేజీలకు పైనే). ఒకటి రాజమండ్రి థియొసాఫికల్ లాడ్జికీ, ఒకటి తాపేశ్వరం లాడ్జికీ, ఒకటి రాయలసీమ ఫెడరేషను వారికీ, ఒకటి ఒక మిత్రునికీ, ఒకటి నీకూ కాక, ఆఖరిది నీ చపలచిత్తపు మేనల్లుడికిచ్చాను. ఇప్పుడు నువ్వు నీకిచ్చిన కాపీని ఒకసారి నాకు పంపించాలి – ఆ పెద్దమనిషి ప్రచురించాలను కుంటున్నాడు కనుక. ఎంత చిత్రమైన అనుభవం..."

ఈ "ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్" అనే గ్రంథం కృష్ణమూర్తిగారి గ్రంథాలన్నిటిలోకీ ఉత్తమమైనదీ, ఉత్కృష్టమైనదీ. ఈ తెలుగు అనువాదాన్ని చివరికి ప్రచురిస్తారో లేదో తెలియదు. ముందు నువ్వు దాన్ని పంపించడానికే నాలుగైదు రూపాయలు ఖర్చవుతుందేమో. కానీ, నేను ఒక్కొక్కళ్లకి 2.50 రూ॥ల చొప్పున ఖర్చుపెట్టి మీ అందరికీ పంపించాను. నువ్వు ఆలస్యం చెయ్యకుండా పంపించు...

నీకు గుర్తుందో లేదో, పదిహేనేళ్ల క్రితం నేను కృష్ణమూర్తిగారి తత్త్వం గురించి చేసిన ప్రసంగం చిన్న పుస్తక రూపంలో వచ్చింది. దాన్ని హైదరాబాదు

థియొసాఫికల్ లాడ్జివాళ్లు ప్రచురించి చాలాచోట్ల పంచిపెట్టారు. ఆ చిన్న పుస్తకాన్ని మామిడిపూడి వెంకట రంగయ్యగారు ఆవిష్కరించారు. దాన్ని చాలా చవగ్గా (35 పైసల కొక కాపీ చొప్పున) అమ్మారుట. ఆ రోజుల్లో దానికోసం చాలామంది అడిగారుట. నేనిక్కడికి ఏడేళ్ల క్రితం మళ్లీ వచ్చినప్పుడు, మిగిలిన కాపీలన్నిటినీ ఇంగ్లండు, నార్వే, న్యూజిలాండ్, మొదలైన దేశా లనుంచి అడిగిన వారందరికీ పంపించారుట. నిన్న ఒక 'థి' మిత్రుడు ఆ సంగతులన్నీ మళ్లీ చెప్పాడు. నాకు ఆశ్చర్యం వేసింది. అంతా విచిత్రం!...''

దాంతోబాటే, అన్నయ్య హైదరాబాదు వస్తున్నట్లు రాశారు. సెలవుపెట్టి, కుటుంబంతోసహా వస్తున్నట్లు రాశాడుట. నేను నాన్నగారు కోరిన విధంగా అనువాద గ్రంథం రాతప్రతిని జాగ్రత్తగా రెజిస్టర్డ్ పోస్టులో పంపించాను. ఆ పుస్తకం అంత శ్రద్ధగా దాచినందుకూ, మరింత శ్రద్ధగా పేక్ చేసి పంపించినందుకూ మెచ్చుకుంటూ, అంత వెంటనే పంపినందుకు ధన్యవాదాలు తెల్పుతూ ఉత్తరం రాశారు. దాంతోబాటే, హైదరాబాదులో ఈ మధ్య దొంగతనాలూ, దోపిడీలూ ఎక్కువైపోయాయనీ, పట్టపగలే ఇళ్లలో ఆడవాళ్లనీ మగవాళ్లనీ బుర్రలు బద్దలుకొట్టి నగలూ డబ్బూ దోచుకు పోతున్నారనీ, రాత్రిళ్లు కూడా, లైట్లు వేసుకుని ఇళ్లలో మెలుకువగా ఉంటున్నారందరూ అనీ రాశారు.

దొంగలే కాదు దోచుకుపోయేది - దేవుడు కూడా దోచుకుపోతూంటాడు మనకత్యంత ప్రియమైన వాటిని. దొంగల్లో మాత్రం దేవుడు లేడూ!

* * *

అన్నయ్య మా ఇంటికొచ్చాడు హైదరాబాదు వెళ్లేముందు. నేనింట్లో లేను ఆ సమయానికి. మా వారితోనూ, అత్తగారితోనూ, మామగారితోనూ చెప్పాడుట హైదరాబాదు వెడుతున్నట్లు. ఈసారి ఎలా అయినా నాన్నగారిని ఒప్పించి తనతో ధన్‌బాద్ తీసుకు వెళ్లడానికి ప్రయత్నిస్తాననీ, లేకపోతే, తనే వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకొని హైదరాబాద్ వెళ్లిపోవాల్సి ఉంటుందేమోననీ అన్నాడుట. నాకు ఆ సాయంకాలం ఆఫీసులో ఏదో మీటింగు ఉండి, ఇంటికి ఆలస్యంగా రావడం వల్ల అన్నయ్యని కలుసుకోవడం పడలేదు.

నాన్నగారి ఆలోచనలు వేరే విధంగా ఉన్నాయి. జాతకం ప్రకారం ఇక తనకు మృత్యువు ఆసన్నమై తీరాలి, తప్పదు అనుకున్నారు. అన్నయ్య

సమయానికి వస్తున్నందుకు సంతోషించారు. అన్నయ్య హైదరాబాదుకి వచ్చాక, వాణ్ణి తీసుకుని నాన్నగారు బ్యాంకుకి వెళ్లి తన పేరున ఉన్న ఎక్కౌంటుని జాయింట్ ఎక్కౌంటుగా మార్పించారు. తను పోయాక, డెత్ సర్టిఫికేట్ చూపించినా, లేకున్నా అన్నయ్య సులభంగా ఆ డబ్బుని ఎత్‌డ్రా చేసుకోవడానికి వీలవుతుందని. ఆ పని పూర్తికాగానే నాన్నగారు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు.

తానొకటి తలిస్తే దైవం ఒకటి తలుస్తుందిట. ఆ మర్నాడు పొద్దున్న పదకొండు గంటలకి అన్నయ్య "మాసివ్ హార్ట్ ఎటాక్" వచ్చి పోయాడు క్షణాల్లో. వైద్యుణ్ణి పిలిచేందుకుగాని, వైద్యుడి దగ్గరకు తీసుకు వెళ్లేందుకుగాని అవకాశం ఇవ్వకుండా దోచుకుపోయాడు దేవుడు - పట్టపగలు అందరూ చూస్తూండగా. నాన్నగారి బదులు ఆ రోజు పొద్దున్న అన్నయ్యే మొక్కలికి నీళ్లు పోశాడుట. నాన్నగారి బదులు వాడు పోయాడు! ఇద్దరి జన్మదినం ఒక్కటే తిథుల ప్రకారం. జాతకం ప్రకారం నాన్నగారు తన ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకున్నారు. అన్నయ్య చెప్పా చెయ్యకుండా వెళ్లిపోయాడు! నాన్నగారు వింధ్య పర్వతాలు దాటి రానంటే, చివరికి తనే దాటి వచ్చాడు - ప్రవక్త పర్వతం వద్దకి పోకపోతే, పర్వతమే ప్రవక్త వద్దకి పోయినట్లు.

నాకు మా పిన్ని కొడుకు ఇచ్చిన టెలిగ్రాం అందింది అన్నయ్య పోయాడని. "నో నో నో - అన్యాయం - అబద్ధం - అయ్యో అన్నయ్య పోవడమేమిటి?" హైదరాబాదులో మా ఆడబిడ్డ ఇంటికి ఫోన్ చేశాం. నిజమా కాదా కనుక్కోమని. స్వయంగా వెళ్లి కనుక్కుని అరగంటలో మళ్లీ ఫోను. "నిజమే. ఘోరం - అన్యాయం - పాపం" అంటూ. ఆ రాత్రి ప్లేన్ బైమైపోయింది. మర్నాడు పొద్దున్న బయల్దేరాం. ప్లేన్‌లో కిటికీ దగ్గర కూర్చున్నాను. కిటికీలోంచి బయట ఎండలో తెల్లని మేఘాలు కదుల్తున్నా మనసులో చీకటి, కన్నుల్లో కారు మబ్బులు దట్టంగా కమ్ముకుని ధారాపాతంగా కురుస్తున్నాయి... ఉరుములూ, మెరుపుల్లా మధ్యలో ఆలోచనలు - "అమ్మకి పది కాన్పులయినా, నలుగురే మిగిలి, గర్భశోకం అంతటితో అంతమైందని సరిపెట్టుకుంటున్న సమయానికి చావుదెబ్బ - అమ్మ శోకాన్ని ఎవరాపగలరు? నేనెలా సముదాయించగలను? ఆ శోకం నాకేం తెలుసునని? వదిన... చల్లని నీడనిస్తుందని తలదాచుకుంటే చెట్టు విరిగి మీద పడింది. మళ్లీ తలెత్తుకుని లేచి బ్రతుకు బాటమీద నడవగలదా? బ్రతుకు బాట మీద స్వయంగా నడవాలని ఇప్పుడిప్పుడే లేచి నిలబడబోతున్న

కొడుకు... తన కొడుకు ముద్దు మాటల్ని తన తండ్రికి వినిపించాలనే ఉబలాటాన్ని విఘ్నం చేసిన విధిని తలుచుకుని విలవిల్లాడుతున్న కూతురు - వీళ్లంతా సరే. నాన్నగారు - అయ్యో నాన్నగారు ఎలా భరించగలరు ఈ విఘాతాన్ని - ఎలా సహించగలరు ఈ దుఃఖాన్ని - ఈ కడుపులో చిచ్చుని - ఈ మనసులో మంటని - నాన్నగారిని తలుచుకోగానే అనేక రూపాలు కళ్ల ఎదుట మసక మసగ్గా - ముప్ఫై ఏళ్ల క్రితం - తెల్లని ధోవతి, నల్లకోటు, గంజిపెట్టి ఇస్త్రీ చేసిన తెల్లని గ్లాస్కో గుడ్డతో చుట్టుకున్న తలపాగా, జేబులో రత్నం పెన్ను, కళ్లకి నల్ల ఫ్రేము కళ్లజోడు, కాళ్లకి కిర్రు చెప్పులు, చేతిలో దస్తావేజుల కట్ట.... జట్కాలో కూర్చుని కోర్టుకి వెళ్లడం... వచ్చేటప్పుడు ఎవరితోనో ఒకరితో మాట్లాడుతూ ఇంటికి నడిచి రావడం... వస్తూనే ఎవరినో ఒకర్ని చూసి సింహగర్జన చెయ్యడం.... ఇంకా మసగ్గా మరో రూపం.... నలభై ఏళ్ల క్రితం... మడిగా ఆరేసిన ధోవతి కట్టుకుని, భోజనాల వసారాలో ఇత్తడి పువ్వులు మూలల్ని అతికిన పీట మీద, బాసింపట్టు వేసుకుని కూర్చుని, ఎదురుగా రాగిపంచపాత్రలో ఉద్ధరిణి, నీళ్లూ పెట్టుకుని, పక్కని రాగి పళ్లెంలో తిరుచూర్ణం, నామం కటిక, చిన్న అద్దం పెట్టుకుని, నుదుటి మీద నామం దిద్దుకుని, జంద్యం సర్దుకుంటూ జపం చేసుకోవడం... మేడమీద ఆఫీసు గదిలో చుట్టూ 'లా' పుస్తకాలతో నిండిన బీరువాల మధ్య, గోడమీద ఉన్న నిలువెత్తు కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారి ఫోటో ఎదురుగా, జడ్జీ కుర్చీ మీద కూర్చుని... వెనకాల గోడమీద పాతకాలపు గడియారం మధ్య మధ్య ఠంగ్ ఠంగ్ మంటూంటే... పక్కన తివాసీ మీద - గుమాస్తాగారు రికార్డు రాస్తూంటే, క్లైంట్స్‌తో ఖంగ్ ఖంగ్ మంటున్నట్లు మాట్లాడుతూ... మసక తొలిగి మరో రూపం... మంగలిచేత తల నున్నగా గొరిగించుకుని 'యూల్ బ్రిన్నర్'లా చూడటం... తలమీద అరంగుళం పొడుగున ఎదిగి, నిక్క బొడుచుకున్నట్లుండే తెల్లని జుట్టు, తెల్లని లాల్చీ, రెండు భుజాల మీంచీ వ్రేలాడుతూ మెడ చుట్టూ వేసుకున్న మడతపెట్టిన జరీ అంచు కండువా... మసక మరింత తొలిగి, మరో రూపం.... నిన్న మొన్నటి రూపం... ఉతికి ఆరేసిన రంగు మాసిన తెల్ల ధోవతి, భుజం మీద అంగవస్త్రం, జంద్యం లేని ఛాతీ, చేతిలో కర్ర, కళ్లజోడు, బోసినోరు, నామం లేని నుదురు, తలమీద మొలిచీ మొలవని తెల్ల జుట్టు... ఎప్పటిదో ఇంకో రూపం.... కోర్టు నుంచి వచ్చి, అపురూపంగా చూసుకున్న ఆఖరి సంతానం - రెండో కొడుకు - పసివాడి శవాన్నీ, గుండెలు బాదుకుని ఏడుస్తున్న అమ్మనీ చూసి మొదటిసారి కంటతడి అయితే

నలుగురూ చూస్తూండగా రుమాలుతీసి కళ్ళు తుడుచుకున్న రూపం - నాన్నగారి రూపం - ఇప్పుడు ఉన్న ఒక్క కొడుకూ - చెట్టంత కొడుకుపోతే - నాన్నగారిని ఏరూపంలో చూస్తాను.... చూస్తానా అసలు... చూడగలనా అసలు... నాన్నగారూ... నాన్నగారూ...." ఇటూ అటూ మసలుతున్న ఎయిర్ హొస్టెస్, పక్క సీట్లలో పాసెంజర్లూ గమనిస్తున్నారని తెలిసినా ఆనకట్ట కట్టలేని కన్నీళ్ళు... "నాన్నగారూ... అయ్యో నాన్నగారూ" అంటూ... అన్నయ్య కోసమా? నాన్నగారి కోసమా? ఎవరి కోసం ఈ కన్నీళ్ళు? అర్థం లేకుండా.... ఆగిపోకుండా... అదే ధారగా కారుతున్నాయి.

... ఒక్క సంగతి మరిచిపోయాను. నాన్నగారు 'మృత్యుంజయ' అన్న సంగతి. కొడుకు మరణాన్ని కొండంత స్థైర్యంతో స్వీకరించారు. కోడలి కోరిక ప్రకారం యథావిధిగా కర్మకాండ జరిపారు. కొడుకు కూతురి పెళ్ళికోసం సొంత పేరుని మళ్ళీ ఎలా పెట్టుకున్నారో, కొడుకు కొడుక్కి ఉపనయనం కానందువల్ల, తను ఏనాడో విసర్జించిన జంధ్యాన్ని మళ్ళీ వేసుకుని కర్మ చేశారు కన్న కొడుక్కి. 84 ఏళ్ళ వయస్సులో తడిబట్ట కట్టుకుని గొంతుక్కూర్చుని గంటల తరబడి కర్మకాండ జరిపారు. అన్నయ్య మరణానంతరం డబ్బుకి సంబంధించిన - ఇన్సూరెన్స్, బ్యాంక్ ఎక్కౌంట్లు, మొదలైన వ్యవహారాలన్నిటితో రెండేళ్ళు ఎలా గడిచాయో ఆయనకే తెలియదు.

వ్యవహారాలు పూర్తి అవుతూనే, అప్పటివరకూ మసక మసగ్గానెట్టుకొస్తున్న రెండోకన్ను కూడా పూర్తిగా గుడ్డిదైపోయింది. కేటరాక్ట్ ముదిరిపోయింది. రెండు కళ్ళూ చీకటి గూళ్ళు. మంచమే శరణ్యం అయింది. మరణం కోసం ఎదురు చూడ్డమే మిగిలింది. బ్రతికినన్నాళ్ళూ కోరికలని చంపుకుంటూనే బ్రతికారు. మరణించాలన్న కోరిక ఒక్కటే ఆయన చంపుకోలేక పోయినది. దానికే శిక్ష అనుభవించినట్టున్నారు.

కంటికి రెప్పలా చూసుకోవలసిన కొడుకు ముందే పోయాడు. అన్నయ్య పోయిన రెండేళ్ళకి నాన్నగారి రెండు కళ్ళూ పోయాయి. వాటితోపాటే నేను నా చిరకాలపు "కలం స్నేహితుణ్ణి" కోల్పోయాను.

* * *